ఆధునిక సాహిత్య వేదిక

# 14

# శ్రీశ్రీ సాహిత్య సమాలోచన





ఆధునిక సాహిత్య వేదిక

14

ఫిబ్రవరి 1970

# శ్రీశ్రీ సాహిత్య సమాలోచన

నిర్వాహణ

సాహితీ మిత్రులు

172 పేజీలు

నూటయాభై పైసలు

ముఖచిత్రం: శ్రీశ్రీ

ఫోటో: చలసాని ప్రసాదరావు

ఈ సంచిక నుంచి
సృజన సంవత్సరచందా ఐదు రూపాయలు

ప్రతులకు, వివరాలకు :
సృజన
పోస్ట్‌బాక్స్ 67, వరంగల్ - 2

ప్రతి సంచిక రూపాయి పావలా

ఈ సంచిక రూపాయి యాభై పైసలు

# నాలుగేళ్ళ సృజన



సృజన నాలుగవ జన్మదినం జరుపుకుంటున్నది.

ఈ నాలుగేళ్ళలోను సృజన బలం పుంజుకొని పురోగమించింది.

ప్రయోగశీలత్వం, సృజనాత్మకత, ఆధునిక దృక్పథం పునాదులుగా సృజన ఈ నాలుగేళ్ళ లోను 13 సంచికలుగా వెలువడింది.

ఈ నాలుగవ జన్మదిన సంచికను పూర్తిగా కథల సంచికగా వెలువరిస్తున్నాము.

ఆధునిక సాహిత్యంలో కథకున్న ప్రాముఖ్యాన్నిగూర్చి మేమిక్కడ విడమర్చి చెప్పాల్సిన పనిలేదు. కాని నేటి వ్యాపార పత్రికలు కథానిక స్థాయిని చాలా దిగజార్చివేశాయి. కథంటే కేవలం కాలక్షేపంకోసం ఒకసారి చదివి అవల పారేసేదనో లేక రచయిత తన పగటి కలల్ని కథలుగా రాసితీర్చుకోవటానికనో లేక పాఠకుడి పగటికలల్ని సంతృప్తి పరచటానికోనన్న దృక్పథంతో ఈ నాడు వ్యాపార పత్రికలు కథల్ని ప్రచురిస్తున్నాయి. కాని సమాజంలోని ఆర్థిక, రాజకీయ, సాంఘిక, మానసిక సమస్యల్ని వాస్తవికంగా చిత్రించే కథల్ని అవి తగినంతగా ప్రోత్సహించటంలేదు.

ఈ సంచికలో వో పన్నెండు కథల్ని అందిస్తున్నాము.

ఈ 12 కథల్లో ప్రతి కథలోను యేదో ఒక నిజమైన సమస్య వుంది, జీవితం వుంది, జీవితంలోని చేదునిజాలున్నాయి, జీవితాన్ని వివిధ కోణాల్లోంచి చిత్రించాలన్న తపనవుంది. పాఠకుణ్ణి జోకొట్టటం కాకుండా అతని మేధస్సుకు కొంచెం పదునుపెట్టి పనికల్పించాలన్న ప్రయత్నంవుంది.

# సృజనలో శ్రీశ్రీ

| | | |
|---|---|---|
| 1) జవాబురాని ప్రశ్న | సంచిక 1 | నవంబర్ 66 |
| 2) నాకునచ్చిన వచన శైలి | 2 | ఫిబ్రవరి 67 |
| 3) ఆధునిక సాహిత్యంలో- ఆధ్యాత్మిక చింతన | 4 | ఆగస్ట్ 67 |

# శ్రీశ్రీ పై సృజనలో

| | | |
|---|---|---|
| 1) శ్రీశ్రీ 'ఖడ్గసృష్టి' సమీక్షా సమీక్ష 'మనః కార్మికశాల' | సంచిక 3 మే 67 | కె. వి. రమణారెడ్డి |
| 2) 'సుమనో ధార్మికవేల' | సంచిక 6 ఫిబ్రవరి 68 | త్రిపురనేని వెంకటేశ్వరరావు |
| 3) మనః కార్మికశాల- సుమనో ధార్మిక వేల | సంచిక 8 ఆగస్టు 68 | కె. వి. రమణారెడ్డి |
| 4) అగ్నిజల్లినా, అమృతంకురిసినా | సంచిక 11 మే 69 | త్రిపురనేని వెంకటేశ్వరరావు |
| 5) ఖడ్గసృష్టి—రస (కుస్త్రీ) పట్లు | సంచిక 12 ఆగస్ట్ 69 | కె. వి. రమణారెడ్డి |
| 6) మహాప్రస్థాన కావ్యమీమాంస | సంచిక 4 ఆగస్ట్ 67 | కుందుర్తి |
| 7) కుందుర్తి మహాప్రస్థాన కావ్య మీమాంస | సంచిక 5 నవంబర్ 67 | ఆర్వియార్ |
| 8) మహాప్రస్థానంలో కొనమెరుపులు | సంచిక 8 ఆగస్ట్ 68 | వరవరరావు |
| 9) 'యోగ్యతాపత్రం' | సంచిక 10, ఫిబ్రవరి 69 | శ్రీపతి |

# కృతజ్ఞతలు

కోరగానే ఇంటర్వ్యూ యిచ్చి, గోష్ఠిలో పాల్గొని అన్నివిధాల అడిగిన రీతిలో సహకరించిన శ్రీశ్రీగారికి, 'రచన' సంస్థ తరఫున ఏర్పాటు చేసిన గోష్ఠి సృజనలో ప్రచురించుకోవడానికి అనుమతించిన చలసాని ప్రసాదరావుగారికి, స్వల్ప వ్యవధి యిచ్చి వ్యాసాలు అడిగినా వెంటనే పంపించి యీ సంచిక యింత బలంగా రావడానికి తోడ్పడిన రచయిత లకు, ఈ సంచిక యింత సాహసంగా బరువుగా వేసే ప్రణాళికకు తోడ్పడి జయప్రదం చేసిన వేణుగోపాల్ అండ్ వినాయ్ కంపెనీవారికి, శ్రీరామ్, శ్రీపతి, వెంచాళా, రంగనాథం, పార్థసారథి, చేకూరి రామారావు, ప్రేమానంద్ ప్రతోలీ, పెండెం శ్రీనివాసరావు, జె వెంక టేశ్వరరావు, నెల్లుట్ల జగన్మోహనరావు, పింగళి రంగారావు మున్నగు సాహితీ మిత్రులకు, శ్రీశ్రీ పట్ల, సృజన పట్ల వున్న అభిమానంతో తమ వ్యాపార ప్రకటనలు యిచ్చి ఆర్థికంగా తోడ్పడిన ప్రకటన కర్త లకు, విరాళాలిచ్చిన దాతలకు, అభిమానులయిన చందాదార్లకు, చాల స్వల్ప వ్యవధిలో యింత అందంగా ముద్రించి యిచ్చిన కమల్ ప్రింటర్స్ వారికి, మాకు ప్రాణమయిన పాఠకులకు మా హృదయ పూర్వకమయిన కృతజ్ఞతలు. ఏ నిర్మాణాత్మకమయిన కార్యమూ ఎవరో ఒక్క వ్యక్తితో పరిపూర్ణంగా నిర్వహించబడజాలదు. ఇందులో ఎంతో సమష్టి కృషి ఫలితమున్నది.

అట్టి శక్తికి మా కృతజ్ఞతలు.

-'సాహితీ మిత్రులు'

అభ్యుదయ సాహిత్య వేదిక

# సృజన

శ్రీశ్రీ సాహిత్యా సమాలోచన

## 'నిన్న విడిచిన పోరాటం నేడు అందుకోక తప్పదు'

తెలుగు సాహిత్యంలోకి ఎర్రెర్రని దుప్పటి కప్పుకొని వచ్చిన రివాల్వర్ శ్రీశ్రీ. ఆ రివాల్వర్‌లోంచి దూసుకొని వచ్చిన శబ్దాలు పుట్టించిన అగ్ని కిరీటపు ధగధగలు ధరించిన మరో ప్రపంచం యింకా సామాన్యుని స్వప్నంలోనే మిగిలింది.

తెలుగుజాతి సంప్రదాయ మౌఢ్యానికి కందుకూరి భాషా కృతకత్వానికి, గిడుగు భావ ఛాందసానికి, గురజాడ గొడ్డలిపెట్టు పెడితే యీ ముగ్గురి వారసత్వాన్ని అంది పుచ్చుకొన్న శ్రీశ్రీ సంస్కరణ వాదిగానే మిగలక కాలాన్ని తన కలం బయనెట్ మీద నడుపగల విప్లవ నిర్దేశకుడయ్యాడు.

రాజుల, జమీందార్ల, ధీరోదాత్త నాయకుల గుత్తాధిపత్యాన్ని కూలదోసి కమ్మరి కొలిమీ, కుమ్మరి వామీ శరీర కష్టం స్ఫురింపచేసే గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి, సహస్ర వృత్తుల సహస్ర చిహ్నాలతో తెలుగు కవిత్వానికి భావం, భాగ్యం, ప్రాణం పోసాడు. కాల్పనిక కవిత్వమూ ప్రాంతీయాభిమాన జాతీయ కవిత్వమూ అభిమానించే సాహిత్య బూర్జువా తత్వాన్ని సవాల్‌చేసి శ్రమైక జీవన సౌందర్యానికి

సమానమైనది లేనేలేఎని వ్యర్థార్థ జీవిత యదార్థ దృశ్యాలు మన ముందుంచాడు

శ్రీశ్రీరాకతో తెలుగు కవిత సామాగ్రీ, స్వరూపమూ, స్వభావమూ మారిపోయాయి. సామాజిక చైతన్యమే కావ్య వస్తువుగా, శ్రమైక జీవన సౌందర్యమే కావ్య శిల్పంగా, దగాపడ్డ తమ్ముళ్ళు, పతితులు, భ్రష్టులు, బాధా సర్పదష్టులే నాయకులుగా, యీనాటి పద్దెనిమిది పంక్తుల గేయమే పద్దెనిమిది పర్వాల మహాకావ్యంగా మారిపోయింది ఆయన ఊపిరిలోని ఆందోళన బలంతో.

అందుకే ఆధునిక తెలుగు సాహిత్య ప్రపంచంలో కొందరు దీప స్తంభాలై నిల్చిపోతే శ్రీశ్రీ విద్యుత్తయి ప్రసరించాడు. ఈ విద్యుత్తు... ధూర్త లోకానికి విద్యుదాఘాతమయితే దగాబడ్డ తమ్ములకు వెలుగుల రవ్వల జడి వినిపించిన జలపాత మయింది.

మరోప్రపంచం జలపాతం విని దారి పొడుగునా గుండె నెత్తురులు తర్పణ చేస్తూ ముందుకు పోతున్న నెత్తురు మండే, శక్తులునిండే శ్రమజీవులందరికీ యీ దేశంలో ఊపిరీ ఊరటా శ్రీశ్రీలోనే కాని తమ జీవితాల్లో ఇంకా రాలేదు వాళ్ళింకా బాధ సర్పదష్టులే. అందుకే శ్రీశ్రీ యింకా వాడిగా వేడిగా వున్నాడు. అందుకే శ్రీశ్రీ యింకా తెలుగు 'వాడి'కి అంకితమవుతున్నాడు.

మూడు దశాబ్దాల కింద ఎంతో ముందుచూపుతో మరోప్రపంచాన్ని ఆవిష్కరించిన శ్రీశ్రీకి అరవై ఏళ్ళు నిండిన చారిత్రక సమయంలో ఇది షష్ఠిపూర్తి వేడుక చేసుకోవడం కాదు. ఈనాడు సమాజ స్థితిని అవగాహన చేసుకొని అంచనావేసి అభ్యుదయకరమైన కార్యక్రమాన్ని ప్రజల కివ్వాల్సిన చారిత్రక అవసర మేర్పడింది. ఎప్పుడూ ప్రజా ఉద్యమాలకన్నా ముందు ఉండాల్సిన కవి భవిష్యత్ స్వరూపాన్ని తాను దర్శించి ప్రజలకు చూపించాల్సిన కవి ఈనాడు కనీసం ప్రజా పోరాటాల

వేగాన్ని కూడ అందుకోలేకపోతున్నాడు. పోరాట ఫలితాలను ప్రజలకు వివరించి విప్లవ అనంతర సమాజ స్వరూపాన్ని, తన స్వప్నాన్ని ప్రజల స్వప్నంగా, ప్రజల స్వప్నాన్ని తన ఆదర్శంగా చేపట్టాల్సిన నైతిక బాధ్యత యీనాటి రచయిత మీద వున్నది. ప్రజా చైతన్యాన్ని పలికించాలి కవి.

తనకు సమాజానికీ సామరస్యం కుదిరిందాకా కవిచేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వమన్నాడుగాని చలం, తనకూ, తనకు తృప్తి నివ్వని వ్యవస్థకూ, ప్రభుత్వానికీ, ఎస్టాబ్లిష్‌మెంట్‌కూ ఆర్థిక, సామాజిక సాంస్కృతిక విధానాలకూ పొత్తు కుదరనపుడు కవిచేసే యుద్ధమే కవిత్వం ఈ పొత్తు కుదరడమన్నది రాజీవడడమో, అమ్ముడు పోవడమో, సర్దుకపోవడమో అన్న అర్థంలో పర్యవసిస్తే కవికన్నా హిపోక్రాట్ లేడు.

అందుకే యీనాడు, అధర్మనిధనంచేసే ఖడ్గాన్ని సృష్టించిన 'ముప్పైఏళ్ళ కవి' శ్రీశ్రీ కలం వాడి అందుకొని యీ సమాజంలోని అసమానతలను, అవకతవకలను హతమార్చే ఆయుధంగా సాహిత్యాన్ని పదను పెట్టుకొమ్మని యువతరానికి ఉత్తేజాన్నీ, ఊతనూ యివ్వడానికే యీ శ్రీశ్రీ సాహిత్య సమాలోచన.

యువయోధుని కత్తివాడి, చెయ్యిచేవ, గుండెబలం కవి కలానికి అబ్బితే కలం సృష్టి అంతా ఖడ్గసృష్టే అవుతుంది. అప్పుడు సాహిత్య దృక్పథం సాంస్కృతిక నైతిక పరిధుల్లో నయినా ఖడ్గదృష్టే అవుతుంది. కవి వ్యష్టినుంచి సమష్టికి సమకూరగల పుష్టి అంతకన్నా మరేంకావాలి. ఆ దీక్షతో 'నిన్న విడిచిన పోరాటం నేడు అందుకోక తప్పదు.'

వరవరరావు.

# శ్రీశ్రీతో ఇంటర్వ్యూ

—నవీన్, శ్రీపతి. పటిపరరావు

ప్ర. 1: మీకు మొట్టమొదటి సారిగా కవిత్వం రాయాలన్నకోరిక ఎప్పుడు కల్గింది? ఆ కోరిక కల్గటానికి ఏవైనా బాహ్యసంఘటనలు కారణమా?

జ. నేను 10, 12 యేళ్ల వయస్సులోనే ఒక కందపద్యం రాశాను. కందం రాసినవాడే కవి అనేవాళ్లకదా. కవిని అనిపించుకోవాలనే ఉబలాటంతోనే ఆ కందపద్యం రాశాను. ఆ పద్యాన్ని మానాన్నగారికి చూపించాను. ఆ పద్యంలో ఛందస్సులేదని 'యమాతారాజభానస' అన్న ఛందోసూత్రాన్ని ఉపదేశించాడు మానాన్న.

కాని కవిత్వం రాయాలన్న Urge నాలో సహజంగా మరోసారి కల్గింది. అందుకుకారణం మీరన్నట్టు ఒక బాహ్యసంఘటన నన్నుబాగా కదలించటమే.

ఆరోజుల్లో మానాన్నగారికి బాగాతెలిసిన వడ్డి కేశవరావునాయుడు అనే ఒక very popular Principal ఉండేవాడు. Shelley, Keat లాంటి వాడతను. మానాన్నకు అతనికి బాగాస్నేహం. అతనే నాకు అప్పకవీయం చదవమని సలహాకూడా ఇచ్చాడు.

ఒకరోజు వడ్డి కేశవరావునాయుడు అకస్మాత్తుగా T. B. తో చనిపోయినట్టు నాన్నగారికి టెలిగ్రాం వచ్చింది. నాన్నగారు ఈ విషయాన్ని నాకు వెంటనే చెప్పలేదు. ఆ రోజుల్లో మాయింటిదగ్గర 'కాఫీ క్లబ్' అని ఒక కాఫీహోటలుండేది. అక్కడ కాఫీతాగటం నాకు చాలా సరదా. ఆ టెలిగ్రాం సంగతి తెలీక ఆ కాఫీక్లబ్‌కెళ్లి కాఫీతాగుదామని మా నాన్నగారిని బాగా బలవంతంచేసి తీసికెళ్లాను. ఆ హోటలుకు వెళ్లాక నాన్నగారు అన్నమాటలు నాకింకా జ్ఞాపకం:

'వడ్డి కేశవరావు నాయుడు చనిపోయాడు. నీ కింకా కాఫీతాగాలని పిస్తోందిరా' అన్నాడాయన. సరిగ్గా ఈమాటవిన్నప్పుడు నాకు ఏదో రాయా లన్న కోరిక కల్గింది.

ప్ర. 2 : కవిగా మీ ప్రారంభదశలో మిమ్మల్ని బాగా influence చేసిన రచ యితలెవరు ?

జ. Fever Black అంటాడు. 'A man is a man because of what he eats' అని. అలాగే A poet is a poet because of what he reads.

ఆ రోజుల్లో నేను చదివిన గ్రంథాలే నన్ను influence చేశాయి.

ఆ రోజుల్లో నన్ను influence చేసినవాళ్లల్లో ఒకడు నజ్రుల్ ఇస్లాం. నజ్రుల్ ఇస్లాంను నాకు పరిచయం చేసింది పురిపండా అప్పల స్వామి. తరువాత హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ్‌కూడా నన్ను influence చేశాడు.

ప్ర. 3 : కొంపెల్ల జనార్దనరావును గూర్చి మీరు గొప్ప ఎలిజీ రాశారుగదా. అంతగా కదలించేటటువంటి ప్రభావయుతమైన ఎలిజీ రాయటానికి ఆయన మిమ్మల్ని యేవిషయంలో అంతగా influence చేశాడు ?

జ. జనార్దనరావు influence నామీద ఏమీలేదు. ఆ రోజుల్లో ఆయన భావాలు చాలా conservative గా ఉండేవి. అప్పుడు మాయిద్దరి మీద కూడా విశ్వనాథ సత్యనారాయణ ప్రభావం బాగా ఉంది. నేను సరిగ్గా ఆ రోజుల్లోనే అనుకరణ కాకుండా సొంతగొంతుకోసం వెతుక్కుంటున్నాను.

ప్ర. 4 : మీ కవిత్వానికి Marxismకు గల సంబంధం ఎలాంటిది ?

జ. 'మహాప్రస్థానం' అన్నగీతం రాసేనాటికి నాకు Marxismను గూర్చి తెలియనేతెలియదు. నేను Marxismను తెలుసుకున్నది సాహిత్యం ద్వారానేగాని రాజకీయాలద్వారా కాదు.

మొదట్లో నన్ను ట్రాట్‌స్కీ బాగా influence చేశాడు. తర్వాత నాకు అబ్బూరి రామక్రిష్ణారావు London Progressive writers ప్రచు

రించిన వాళ్ల Manifestoని చదవమనియిచ్చాడు. ఈManifesto నన్ను Marxist lineలో పడవేసింది.

ప్ర. 5 : అభ్యుదయపంథాలో మీరురాసిన మొట్టమొదటిగీతం యేది? అది మొదట ఏపత్రికలో ప్రచురింపబడింది ?

జ. 'జయభేరి' అన్నగీతం నేనురాసిన మొట్టమొదటి ముఖ్యమైన గీతం. ఈ గీతాన్ని నేను ఒక ప్రయోగాత్మక గీతంగా గుర్తించాను.

'జయభేరి' ఉదయినిలో అచ్చయింది. ఆ రోజుల్లో నేనురాసిన గీతాలన్నింటిలోను ఇదొక్కటే నాకు preserve చేసుకోదగిందిగా కనిపించింది.

ప్ర. 6 : కొందరు 'వచనకవిత'ను మొట్టమొదటరాసింది శ్రీరంగం నారాయణ బాబు అంటారు, దీన్నిగూర్చి మీ అభిప్రాయం ఏమిటి ?

జ. శ్రీ రంగం నారాయణబాబు was simply an imitator. ఇంకా he was essentially an anarchist, probably an opportunist also.

ప్ర. 7 : మీరురాసిన కొంత సర్రియలిస్టుకవితను సీరియస్‌గానే రాశారా ?

జ. సర్రియలిస్టు కవితను నేను casualగా మాత్రమే రాశాను. సీరియస్‌గా రాయలేదు.

ప్ర. 8 : గురజాడలోని ముందుచూపుని, ఆధునికతని మొట్టమొదట గుర్తించి ప్రచారం చేసినవాళ్ళలో ముఖ్యులు మీరు. మీరు యే stageలో ఉండగా మీకు గురజాడలోని గొప్పతనం అర్థమైంది ?

జ. మొదట్లో నేనుకూడా గ్రాంధికభాషలో రాసినవాడినే. అరసున్నాలు, బండి 'ఱ'లు జాగ్రత్తగా పాటించినవాడినే. అయితే బసవరాజు అప్పారావు, చింతాదీక్షితులు, కవికొండల ఈ ముగ్గుర్ని చదివాక నాకు గురజాడను చదవాలనిపించింది. అంటే గురజాడ అనే మేడను అధిరోహించటానికి ఈ ముగ్గురు నాకు మూడుమెట్లలాగా తోడ్పడినారు.

'జయభేరి'అన్నగీతం కవిగా నా జీవితంలో ఒక గొప్ప మలుపు. మొదటిసారిగా వ్యావహారికభాషలో నేనురాసినగీతం అదే.

నేను ఇదివరకే ఎక్కడో అన్నట్టు గ్రాంథికం ఫ్యూడల్ వ్యవస్థకు, వ్యావహారికం ప్రజాస్వామ్యానికి ప్రతినిధులు. పూర్వపు 'రథం' లాంటిది గ్రాంథికం, ఇప్పటి మోటారులాంటిది వ్యావహారికం.

ప్ర. 9 : ఈనాటికైనా తెలుగుదేశం గురజాడ గొప్పతనాన్నిగుర్తించి ఆయన కివ్వాల్సినంత గౌరవాన్ని ఇస్తున్నారని మీరనుకుంటున్నారా ?

జ. లేదు. గురజాడకు రావాల్సినంతగౌరవం ఇంకా రాలేదు. విశాఖపట్నంలో నాకాంస్యవిగ్రహాన్ని నిలుపుతామని ఆమధ్య కొందరు స్నేహితులు నాతో అన్నారు. గురజాడకు లేకుండా కాంస్యవిగ్రహం నాకక్కర్లేదు అన్నాను.

ప్ర. 10 : గురజాడనుండి మీకు సంక్రమించిన ముఖ్యమైన influences ఏమిటి ?

జ. గురజాడ కవితలోని easy way of expressionను నేను నేర్చుకు న్నాను. 'దేశమును ప్రేమించుమన్నా....' మొదలైన గురజాడగీతాల్లోని కవితాసౌలభ్యం నన్ను ఆకట్టుకుంది. అలాగే గురజాడరాసిన కన్యా శుల్కం నాటకంలో కూడా నాకు చాల కవిత్వం కన్పించింది. కన్యా శుల్కంలో గిరీశంమాట్లాడిన ఎన్నోమాటలు నిజమైన ఆధునిక కవిత్వ మంటాను.

ప్ర. 11 : 'వచనకవిత' అన్నది అభ్యుదయ కవిత్వోద్యమంలో ఒక పరిణామ క్రమమేనంటారా ? అసలు వచనకవితను ఒక ఉద్యమంగా మీరు స్వీకరిస్తారా ?

జ. వచనకవితను నేను అభ్యుదయ కవిత్వోద్యమం యొక్క పరిణామ క్రమంలో ఒక భాగంగానే స్వీకరిస్తున్నాను.

ప్ర. 12 : వచనకవితలో కథాకావ్యాలువస్తేనే వచనకవిత నిలుస్తుందని కుందుర్తి మొదలైనవాళ్లు అంటున్నారు. మీరేమంటారు ?

జ. వచనకవితలో కథాకావ్యాలు అన్నమాట వట్టి 'హంబగ్' అని నే నను కుంటాను. వచనకవిత నిలువడానికి కథాకావ్యాలక్కర్లేదు.

ప్ర. 13 : బాలగంగాధర్ తిలక్‌నుగూర్చి మీ అభిప్రాయం ?

జ. తిలక్ మంచికవి—a nice poet.

ప్ర. 14 : ఒకప్పుడు ఆరుద్రరాసిన 'త్వమేవాహ'నికి ముందుమాటరాస్తూ ఇక నేను కవిత్వం రాయకపోయినా ఫరవాలేదు. నేను రాయదలచుకొన్న కవిత్వం ఆరుద్ర రాసేస్తాడన్న భావాన్ని మీరు వ్యక్తపరచారు. ఆరుద్ర మీ expectationsను ఎంతవరకు fulfil చేశాడు ?

జ. లేదు. ఆరుద్ర నా expectationsను fulfil చేయలేదు. ఆరుద్ర దారి తప్పిపోయాడు. ఈరోజుల్లో ఆరుద్రని అందరికంటె ఎక్కువగా అతని శ్రీమతి influence చేస్తున్నట్టున్నది.

ప్ర. 15 : దిగంబర కవుల్నిగూర్చి మీ అభిప్రాయమేమిటి ?

జ. వాళ్లు నిజమైనకవులు. అయితే వాళ్ళ కవితాశక్తుల్ని సరియైన మార్గంలో పెట్టలేకపోతున్నారు. వాళ్ళలోని unrest (అశాంతి)ని సరియైన మార్గంలో పెడితే బాగుంటుంది.

ప్ర. 16 : దిగంబరకవులు వచనకవితరాస్తూనే మేము రాస్తున్నది వచనకవిత కాదని బుకాయిస్తున్నారు. దీన్నిగూర్చి మీరేమంటారు ?

జ. దిగంబరకవులురాస్తున్నది వచనకవితే.

ప్ర. 17 : Marxism మీద నమ్మకంలేని రచయితను అభ్యుదయ రచయిత అనటానికి వీల్లేదంటారా ?

జ. లేదు. Marxism - Leninism మీద నమ్మకంలేనివాడు అభ్యుదయ రచయిత కాలేడు.

ప్ర. 18 : రాజకీయంగా ఇప్పటి మీ దృక్పథం యేమిటి ?

జ. నేను Marxistను. Marxism is an article of faith with me. మనదేశంలోని సమస్యలన్నింటిని Marxist సిద్ధాంతంద్వారా పరిష్కరించుకోగలమన్న విశ్వాసం నాకుంది.

ప్ర. 19 : 'జ్వాల' పత్రికకు మీరిచ్చిన ఇంటర్వ్యూలో మీరు శ్రీకాకుళం వెళ్ళి నక్సలైట్లలో చేరిపోతామన్నట్టుగా మాట్లాడారు. నిజమేనా ?

జ. 'జ్వాల' పత్రికకిచ్చిన ఇంటర్వ్యూలో నేను శ్రీకాకుళం వెడతానని అన్న మాట నిజమే. కాని ఎందుకు వెడతానన్నానో అన్నచోట మాత్రం జ్వాల పత్రిక కొంచెం కలరింగ్ ఇచ్చింది. నేను శ్రీకాకుళం వెడతానన్నది నక్సలైట్లలో చేరిపోవటానికని 'జ్వాల' పత్రిక రాసింది. నేను శ్రీకాకుళం వెడతానన్నది నక్సలైట్ల ఉద్యమాన్ని On the spot చూసి study చేద్దామని.

నేనెప్పుడైనా నా కలంతోనే యుద్ధంచేయగలను. నా కలాన్ని విప్లవానికే అంకితం చేశాను.

ప్ర. 20 : Socialist Realism అంటే యేమిటి ? తెలుగు సాహిత్యంలో ఈ Socialist Realism వచ్చిందా ?

జ. రాజకీయంగా సోషలిజం రాకుండా సాహిత్యానికి Socialist Realism రావడానికి వీల్లేదు. కవిత్వంలో మయకోవ్‌స్కీ, వచనంలో గోర్కీ Socialist Realismను తెచ్చారు. మనం చేయాల్సిందల్లా Socialist Realismకు దారితీసే సాహిత్యాన్ని సృష్టించటం మాత్రమే. మన దేశంలో ప్రేమ్‌చంద్ ఈ పనిచేశాడు.

ప్ర. 21 : ఈ మధ్య దేశచరిత్రలు అన్న మీగీతంలో మీరు వాడిన 'ఇతరేతర' అన్న పదాన్ని మీరు పరస్పర అన్న అర్థంలో వాడారని రాచమల్లు రామచంద్రారెడ్డి, ఇతర (other) అన్న అర్థంలో వాడారని అద్దేపల్లి రామమోహనరావు చాలా తీవ్రంగా వాదించుకున్నారు. 'ఇతరేతర' అన్న పదాన్ని మీరాగీతంలో యే అర్థంలో వాడారు ?

జ. ఇతర (other) అన్న అర్థంలోనే వాడాను.

ప్ర. 22 : విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డిని గూర్చి మీ అభిప్రాయం ?

జ. రాచమల్లు రామచంద్రారెడ్డి చాలా క్రూరుడైన విమర్శకుడు. unkindest critic. విమర్శ అంత క్రూరంగా ఉండాల్సిన అవసరంలేదు.

ప్ర. 23 : అంటే మిమ్మల్ని ఎవరైనా కావాలని misinterpret చేసినప్పుడు కూడా దాన్ని తీవ్రంగా ఖండించాల్సిన పని లేదంటారా ?

జ. Misinterpret చేసుకోనివ్వండి. అదొక particular view-point. రాసుకోనివ్వండి. అంత తిట్టాల్సిన, అంత చీల్చి చెండాడాల్సిన అవసరం లేదు.

ప్ర. 24 : మీరు కన్యాశుల్కాన్ని గూర్చి రాస్తూ కన్యాశుల్కం భీభత్సరస ప్రధానమైన విషాదాంత నాటకమని అన్నారు. ఈ అంశాన్ని కొంచెం విశదీకరిస్తే బాగుండేదేమో.

జ. నాపని hints యివ్వటంవరకే. వాటి ఆధారంతోనే మీలాంటివాళ్ళు కన్యాశుల్కాన్ని బాగా స్టడీచేసి ఆ hints ను విశదీకరిస్తూ వ్యాసాలు రాయాలి. చార్లీ చాప్లిన్ పిక్చర్స్‌లో ఉండే విషాదమే, డికెన్స్ నవలల్లో ఉండే విషాదమే కన్యాశుల్కంలోనూ ఉంది.

ప్ర. 25 : తమిళ సినిమాలు ప్రజల్లో రాజకీయ చైతన్యాన్ని సృష్టించటంలో ఎంతో ప్రాముఖ్యాన్ని వహించాయని మీరన్నారు. తెలుగు సినిమాలు ఆపని చేయలేక పోవడానికి కారణమేమిటంటారు ?

జ. మన నిర్మాతల్లో బిజినెస్ దృక్పథం ఎక్కువ కావటం వల్ల మన తెలుగు సినిమాల్లో చీప్‌సెక్స్, క్రైమ్, ఫ్యామిలీ సెంటిమెంట్ మొదలైన అవాస్తవిక విషయాలే ఎక్కువై పోయాయి. కాని ఈ మధ్యనే తెలుగు సినిమా రంగంలో కూడా వాస్తవానికి దర్పణం పట్టే నిర్మాతలు, రచయితలు ముందుకు వస్తున్నారు. ఇటీవలి 'మనుషులు మారాలి' అన్న సినిమా తెలుగు సినిమారంగంలో ఒక మలుపుని సూచిస్తుంది.

తెలుగు సినిమాలు తమిళ సినిమాలంత Educative గా ఉండక పోవటానికి మరో కారణమేమంటే తమిళ చిత్రాల్లో రచయిత పాత్ర చాల పటిష్టంగా ఉంటుంది. తమిళ సినిమాలకు కథ, మాటలు రాసే రచయితలు బాగా డబ్బు సంపాదించి వాళ్ళే నిర్మాతలు, దర్శకులు అయ్యారు. హీరో, హీరోయిన్లకంటె ఎక్కువగా నిర్మాతల్ని శాసించే పొజిషన్‌లో ఉన్నారు. రచయిత ఇంత dominant position లో ఉన్నాడు కాబట్టే తమిళ సినిమాలు అంత Educative గా ఉంటున్నాయి.

కాని తెలుగు సినిమాల్లో రచయిత పాత్ర యేమిటో అందరికీ తెలుసు. నిర్మాత చేతిలో కీలుబొమ్మ. తన కథని, డైలాగుల్ని నిర్మాత, హీరో, హీరోయిన్ మొదలైనవాళ్ళు ఎలా మార్చమంటే అలా మార్చాల్సిందే. రచయితే వీళ్ళనందర్నీ శాసించేరోజు వచ్చిననాడు తెలుగు సినిమారంగం బాగుపడుతుంది.

ప్ర. 26 : ఈ రోజుల్లో ప్రపంచమంతటా యువతరంలో ఒక భయంకరమైన అశాంతి తాండవిస్తోంది. దీనికి మీ దృష్టిలో, కారణమేమిటంటారు ?

జ. నేడు యువతరంలో వెల్లి విరుస్తున్న ఈ అశాంతి మంచికేనని నా అభిప్రాయం. I am an optimist.

1968 మే నెలలో ఫ్రాన్సులో విద్యార్థులు ఒక గొప్ప విప్లవాన్ని తీసుకొచ్చారు. ఈ విప్లవాన్ని గూర్చి తెలుగువాళ్ళకు చెప్పాలనే 'Beginning of the End' అన్న పుస్తకాన్ని 'రెక్క విప్పిన రివల్యూషన్' అన్న పేరుతో తెలుగులోకి అనువదిస్తున్నాను.

యువతరంలోని ఈ అశాంతికి ముఖ్య కారణం పాతతరంవాళ్ళలోని హిపోక్రిసీకి, కొత్తతరం వాళ్ళలోని idealism కు జరుగుతున్న సంఘర్షణ అని నేననుకుంటున్నాను. యువతరాన్ని తమ సమస్యల్ని తమనే పరిష్కరించుకోనివ్వాలి. Old generation is too conservative. వాళ్ళ విషయంలో నేను ఎప్పుడో రాసిన మాటనే యిప్పుడూ అంటాను. 'ఎముకలు కుళ్ళిన, వయస్సు మళ్ళిన సోమరులారా చావండి ! అని.

ప్ర. 27 : మీ భవిష్యత్ కార్యక్రమాలేమిటి ?

జ. చాలా ఉన్నాయి. 'యేది నేరం — యేది శిక్ష' అనే పేరుతో ఒక వందగీతాలు రాయాలని ఐడియాఉంది. ఈ వంద గీతాల్లో రకరకాల Pen - portraits వేయాలనిఉంది. 'ఆకలి మంటలు' అనే ఒక నవలని ఫిల్ముస్క్రిప్టుగా రాయాలన్న ఐడియా కూడా ఉంది. దీనికి సార్త్రి రాసిన Chips Are Down అన్న ఫిల్ముస్క్రిప్టు ఆధారం.

* ఈ ప్రశ్న వెంచాశాగారు అడిగారు.

# శ్రీశ్రీ మహాప్రస్థానం

-కె. వి. రమణారెడ్డి

'మహాప్రస్థానం' కవిత్వం శ్రీశ్రీ సాహిత్యాని కంతటికీ శిఖరాయమానమని మొదటే రాయడం, కనీసం నమస్కారబాణంగానైనా అవసరమేమో! భావకవిత్వంతోటి ముఖం మొత్తి అనుకరణంతోటి విసుగుపడి "సొంతగొంతుక" కోసం తపన అనుభవిస్తూ ఉండేవాడేమో, ఆ తొలి తీవరింపులో శ్రీశ్రీ కవిత్వానికి ఏ అడ్డూ ఆపూ లేకపోయింది. ఒక్కరోజులోనే ఒక సుదీర్ఘమైన గేయాన్ని రాయగలిగాడంటేనే, కావ్య సృజనకు అది ఎంతటి ఉన్ముఖమైన మనస్థితో అర్థమవుతుంది. ఈ గేయాలకు చేకూరిఉన్న ఊపూ తోపూ నిర్జరమైన అ యౌవన తీవ్రతనుంచి మాత్రమే సంక్రమించాయి. జీవితపాఠశాలలో నేర్చుకొన్న చదువు మాత్రమేనా ఇది? అలా అనిపించదు. జీవితంనుంచి నేర్చినదానికంటె ఎన్నోరెట్లు ఎక్కువగా సాహిత్యం నుంచి నేర్చుకొన్నాడనిపిస్తాడు శ్రీశ్రీ. అంటే, గౌణమైన సాహిత్యం జీవితంస్థానాన్ని అక్రమించి ప్రత్యామ్నాయంగా ఉపకరించింది.

'మహాప్రస్థానం' గేయానికి ఏఏ శక్తులు ప్రోత్సాహం కల్పించాయో 'ఆరంభం పెద్ద అవస్థ' అనే వ్యాసంలో శ్రీశ్రీ వివరించిన దాన్నిబట్టి చూస్తే, అవి అన్నీకూడా యధార్థ జీవితేతరాలే అని ధ్రువీకరించవచ్చు. కాజీనజ్రుల్ ఇస్లాం 'విద్రోహి' గేయం, హరీంద్రనాథ్ చటోపాధ్యాయ గేయం, కవికొండల వెంకటరావు గారి 'శివరాత్రిప్రభ' గేయం—ఇలా అనేక మూలాలనుంచీ మూలల నుంచీ సేకరించుకొన్న కదంబాన్ని, సొంతపరచుకొంటూ పూర్తిగా మార్చివేయగలిగింది శ్రీశ్రీ ప్రతిభ. అన్య ప్రభావాలను అక్షరపరమైన సువర్ణంగా మార్చే విద్య శ్రీశ్రీకి కూసువిద్యే.

అందుకనే కాబోలు, శ్రీశ్రీ ప్రారంభదశ గురించి బాగా తెలిసిన కవిమిత్రులు కొందరు శ్రీశ్రీని copyist అని ఒకప్పుడు నేరుగా మోటుగా అని

ఇప్పుడు చాటుగా అంటున్నారు! Bertold Brecht పేరూ ఊరూ తెలియని పసితనంలో "తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు ?" పాదానికీ బ్రెక్ట్ సేయ చరణానికీ లంకెసలపడంకూడా ఆ (దుః) అభిప్రాయంతోనే. శ్రీరంగం నారాయణబాబు గా రంటే తమకుగల (దుః) అభిమానం కూడా శ్రీశ్రీపట్ల అపచారంగా పరిణమించి ఉండవచ్చు.

ఆ ఊసెందుకుగానీ మరో 'మహాప్రస్థాన' గేయాన్ని ఇక్కడ స్పృశించి వదులుతాను. దాని పేరు "దేశచరిత్రలు." చారిత్రక భౌతిక వాదానికి చేరువా దూరమా అన్నదికాదు ప్రశ్న. అప్పటికీ ఇప్పటికీమార్క్సిస్టు సిద్ధాంతం గురించి స్థూలంగా తప్ప శ్రీశ్రీకి తెలియదని నా అభిప్రాయం. ఆ అక్కరాలేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయం లైబ్రరీ తలుపులు శ్రీశ్రీ కోసం అహర్నిశలూ తెరిచి ఉండే రోజుల్లో, లైబ్రేరియన్ తనవాడే కావడంవల్ల పుస్తకాల వడ్డున దివ్యంగా జరిగిపోయేది. అబ్బూరి రామక్రిష్ణారావుగారి పూర్వాశ్రమం అది. లండన్ నగరంలో జరిగిన అభ్యుదయ రచయితల సమావేశంతాలూకు పత్రాన్ని శ్రీశ్రీ ముందు పడవెయ్యడం జరిగింది. అది లక్ష్యప్రకటన పత్రంకావడం తెలుగు కవిత్వానికి ఇలా లాభించింది. అందులోని శుద్ధ, శుష్కవచనం ఇక్కడ శబ్దపటుత్వం భావ మహత్త్యంగల కవిత్వంగా రూపం మార్చుకొంది.

అర్థంతోటి ఎలాంటి నిమిత్తమూలేకుండా 'మహాప్రస్థానం' యావత్తూ కరతలామలకమై పోయినట్లు భావించే పాఠకులు వందలసంఖ్యలో ఉన్నారు. రాజకీయాభిమానం కొద్దీ దీన్ని పారాయణ గ్రంథంగా చేసుకొన్నవాళ్ల మాట మరెందుకు? దాన్ని తరచి చూడడం మతద్రోహ నేరమౌతుందేమో నాకు తెలియదుగాని ఈపని ఎన్నడో జరిగి ఉండవలసింది. 'మహాకవి'గా Infallible అని పించుకోక ముందు శ్రీశ్రీ కవిత్వాన్ని నిలదీసిన వాళ్లు లేకపోలేదు. ఈ వ్యాసంలో వాళ్లనందర్నీ స్మరించి, సదరు ఆక్షేపణలను సమీక్షించడం అవసరమనిపిస్తున్నది.

ఒళ్లుదగ్గర పెట్టుకొని 'మహాప్రస్థానం' గేయాలను విమర్శగా చదివాక ఎవరికైనా అనిపించాల్సిన మొట్టమొదటి సంగతి, శ్రీశ్రీది ప్రధానంగా శబ్దాశ్రయమైన రచనా పద్ధతి. శబ్దం కావ్యానికి శరీరంకాబట్టి దాని ప్రాముఖ్యం దానిదేనని

ఒప్పుకొంటూనే, భావాన్ని కించపరచకుండా మాత్రం అది అతిశయించజాలదని వెనువెంటనే చెప్పుకోక తప్పదు. శ్రీశ్రీ కవితలో భావానిది గౌణమైన స్థానమేనని శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారు అనిఉన్నారు. నిజమేగాని ఇది ఎందువల్ల జరిగిందో ఆయన చెప్పరు. అద్రే మోర్వా ఒకవ్యాసంలో ఇలారాశాడు :

whenever poetry takes on a new life, it turns back to its source, that is to say, the magic of words.

భావకవిత్వ పంథాను పూర్తిగా వదలివెయ్యలేకపోయినప్పుడు, శ్రీశ్రీ కవిత్వం కూడా ఈ శబ్ద ఇంద్రజాలంలో పడిపోయిందని అనుకోవచ్చు. అయితే, భావకవిత్వానికి కూడా ఈ పదజాలమే అనివార్యమై పోయిందికదా, అదీ ఒకలాంటి తిరుగుబాటే కాదా అంటే, శ్రీశ్రీ కవిత్వం తిరుగుబాటు మీద తిరుగుబాటు అయి కూచుందని జవాబు. భావకవిత్వ పదజాలం 'మహాప్రస్థానం' గేయాల్లో కూడా మొదట్లో దర్శనమిస్తుంది. ఏకదేశంగా మాత్రమే కనిపించే ఈ ప్రభావాన్ని శ్రీశ్రీ విప్లవకవిత్వాని కంతటికీ విస్తరింపజేస్తూ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారేమంటున్నారంటే–"ఇతని అవేశం కాల్పనికోద్యమానిదే; భాషకూడా అంతవరకు కావ్యభాషగావస్తున్నదే" అని. వెనువెంటనే "కాని దానితోనే కొత్తకాహళలవీ దుందుభులవీ మ్రోతలుమ్రోగిస్తాడు" సర్దుకొంటున్నారు. సర్దుకోవలసిందే 'మహాప్రస్థానం' గేయాన్నీ కృష్ణశాస్త్రిగారి 'అరుణతార' గేయాన్నీ దగ్గరపెట్టుకొని, పదాలగురించే తారతమ్య పరిశీలన చేసినట్లయితే, కృష్ణశాస్త్రీయమని చెప్పదగిన గేయ కవిత్వ బాణీని వదిలి ఎంతముందుకు శ్రీశ్రీ వచ్చిచేరిందీ తెలుస్తుంది. 'జయభేరి' వేస్తూ మాహాప్రస్థాన దశకు ఉపక్రమించిన శ్రీశ్రీ ఆరచనలో ఇంకా భావకవిత్వం అనే తల్లిచాటు బిడ్డగానే కనిపిస్తాడు (1933). "జగమునిండ స్వేచ్ఛాగానఝురుల నింతు"నని కృష్ణశాస్త్రిగారన్న దానికీ ప్రగల్భాలనిపించే శ్రీశ్రీ ఆశయాలకీ పోలికకూడా కనిపించవచ్చు. 'నేను' అనేది ఉభయ సామాన్యం కావచ్చు. అయితే ఈ 'నేను' భావకవుల 'నేను' మాత్రంకాదు. చరిత్రను నిర్మించగల మహా సాంఘికశక్తులతోటి శ్రీశ్రీ తన్మయీభావం పొందుతూ అభేదం స్థాపించుకొంటూన్నాడు. సమాజం నుంచి విడిపోయి తనతనాన్ని విరాడ్రూపంగా పెంచుకొని విపరీత ధోరణిలో సొంత బాధలను వెళ్లగక్కుకోకుండా సమాజంతో కలగలిసి తన తనానికిబలాన్నీ సార్థక్యాన్నీ ఇచ్చుకొంటూన్నాడు. ప్రపంచాబ్జంలో తానొక రేకు, వీణకు ఒకతంత్రి. కాబట్టే భువనమే ఒక భవనమైతే దాని బావుటా కాగలుగు

తున్నాడు. తాను కోకిలై గానంచేస్తే ఆ గాన శీకరాలే లోకానికి శ్రీకరాలు అవు తాయని ఆశిస్తున్నాడు. 'ఐ' అనేగేయం కూడా ఇలాంటిదే అనలేము.

'ఒకరాత్రి' అనేగేయం పూర్తిగా భావకవిత్వ వాసనలను వదులు కోలే దనిపిస్తుంది. 'ప్రభవ' పద్యాల చాయలే ఇవికూడా. "స్వర్గదేవతలు" వంటి పద్యా లలో మోహనమైన ప్రకృతి గురించి గానంచేసి ఆనందంపొందిన కవే ఈ గేయాన్నీ రాశాడు. అయితే ప్రకృతికి గల రెండవదైన ముఖాన్ని, ప్రకృతిలోని భయంకరత్వాన్ని ఇందులో చూపెడుతున్నాడు. గ్రాంథికరూపాలు బహుళంగా ఉండి సంధికార్యం సుష్టుగా జరిగిన ఈ గేయం ద్విపదగా నడుస్తుంది. వెన్నెల ప్రస్తావన వచ్చినప్పుడల్లా వెర్రెత్తిపోయే సాంప్రదాయకమైన వైఖరికి భిన్నంగా, వెన్నెలకుగల భయపెట్టే శక్తిని ప్రదర్శించడంలో, శ్రీశ్రీ సంప్రదాయాన్ని తెగ డెంచాడు. కవి సమయాలను తుంగలో దొక్కి జాబిల్లిని కాళ్లుతెగి ఆకాశపు పెంటా రిలో పడిఉన్న ఒంటరి ఒంటెగా ఉపమించాడు.

గాలిలో కనరాని గడుసు దయ్యాలు
భూదివమ్ముల మధ్య ఈదుతున్నాయి

బాద్‌లేర్ కవి Evening Twilight లోని

Mischievous demons rouse lumpishly in the air కు అను కరణ కూడా కావచ్చు. అప్పటికే ఫ్రెంచి సింబాలిస్టుల ప్రభావం శ్రీశ్రీపై ప్రస రించసాగిందనే విషయాన్ని మరిచిపోగూడదు. "ఆశాదూతలు" అనే గేయంలో ఈ సింబాలిస్టుధోరణి మరింతస్పష్టంగా రూపు తాల్చింది. ఈ దూతలు ఎవరూ ఏమిటీ అనే ప్రశ్నలకు కవినుంచికూడా సమాధానం లభించదు. వీళ్ళు దిక్పతు లకు సంకేతప్రాయులుకారు. చివరివాడు తప్ప తక్కినవాళ్ళంతా భయంకరులూ లయంకరులూకూడా. "మానవకోటి సామ్రాజ్యదూతలు" కళాయజ్ఞాశ్వములూ గాలులూ తరగలూ తావులూ పుప్పొళ్ళూ కుంకుమలూ పొగలుగా రూపాంతరం పొందుతున్నారు. శబ్ద ఇంద్రజాలానికి భావం పూర్తిగానే లోబడిపోతున్నది. అంటే, శ్రీశ్రీ కవితలో భావానికి ప్రాప్తి అభావమేనా? శ్రీశ్రీనీ, ఆయన కవిత్వాన్నీ బాగానే ఎరిగిన మల్లవరపు విశ్వేశ్వరరావుగారు సుదీర్ఘమైన ఒక వ్యాసంలో శ్రీశ్రీనీ కృష్ణశాస్త్రినీ పోల్చి చూస్తూ, "ఇద్దరి కవిత్వంలోనూ నాద

బ్రహ్మ మేధస్సుని ఆవరించింది—కృష్ణశాస్త్రిలో మైకంలాగ, శ్రీశ్రీలో స్వప్నం లాగ" అని రాసికున్నారు :

విశ్వేశ్వరరావుగారు ప్రత్యేకించి చర్చించింది "నవకవిత" నైనప్పటికీ, ఆ చర్చనుంచి వారు పైవిధంగా ఒక సూత్రాన్ని రాబట్టారు. శ్రీశ్రీది గానంలాంటి భావమైతే, కృష్ణశాస్త్రిది భావంలాంటిగానమట. మొత్తంమీద శ్రీశ్రీ కవిత్వంలో భావపుష్టితక్కువ అని తీర్మానం చేశారు. భావాలన్నీ ఐక్యమైనప్పుడు అర్థలయ చేకూరి మనస్సుకు స్పష్టమైన జ్ఞానాన్ని ఇవ్వగలగాలి. లేనప్పుడు, "శబ్ద ప్రస్తావం" మాత్రమే మిగులుతుంది. "నవకవిత" గేయంలో నవకవితకు అవ సరమని శ్రీశ్రీ ఇచ్చిన వస్తువులజాబితా నిజానికి అవసరంకాదు. ఆ వస్తువులు మరివేటికో సంకేతాలు. వాటిని స్ఫురింపచెయ్యడానికే వీటిని వాడాడు కవి. అయితే ఆ స్ఫురణ సవ్యంగా జరగలేదు. జరిగిందంతా వట్టి శబ్దగానం. మిగి లింది కట్టి వర్ణచిత్రం. భావస్ఫూర్తి మాత్రం ఫలించిందికాదు. అందుచేత శ్రీశ్రీవి సంగీతాత్మకమైన భావచిత్రాలు మాత్రమే – musical images.

శబ్దలయతోనే శ్రీశ్రీ భావచిత్రాలు కట్టబూనాడు. ఏ శబ్దానికి ఆ శబ్దాన్ని విడదీసి చూసినప్పుడు స్ఫురించని భావం శబ్దాల విన్యాసంవల్ల స్ఫురిస్తుంది. ఇది స్పష్టంగానే జరగాలని నిబంధనలేదు. అస్పష్టత (obscurity)ను ఆరాధించే కళోద్యమాల ప్రభావం శ్రీశ్రీకి సోకింది. సాగదీసిన అలంకారాలద్వారానో సాదృశ్యాలద్వారానోకాకుండా సంకేతంద్వారానే భావాన్ని ఉద్దీపింప బూనినప్పుడు, ఆ సంకేతం పూర్తిగా కవి ఇచ్ఛానువర్తి అయినప్పుడు, అస్పష్టత అనివార్య మౌతుంది, తప్పదు. ఒకశబ్దం ఎన్నో స్ఫురణల (associations)ను సూచిస్తుంది; సూక్ష్మచ్ఛాయలను నిర్దేశిస్తుంది. కవిత్వం గానానికి లోబడిపోతుంది. శబ్దం భావాన్ని లోబరచుకొంటుంది. శబ్దాలూ వర్ణాలూ, గానం, కవిత్వం, కళలూ, అనుభూతులూ ఒక్కటిగా కలిసిపోయి Synaesthesia గా పరిణమిస్తాయి. బాద్‌లేర్ నుంచి మాత్రమేగాక, స్విన్‌బర్న్‌నుంచి శ్రీశ్రీ సేకరించుకొన్న కళా దృక్పథం ఇలాంటిది.

'ఐ'అనే చిన్న గేయమే చూద్దాం. ఏ మాటకు ఆమాటను నిలబెట్టితే, పరస్పర సంబంధమూ సమన్వయమూ లేనట్లుగా కనిపించే శబ్దాలు మొత్తంమీద చూస్తే ఒక చిత్రాన్ని కంటికి కట్టిస్తాయి. కేదారగౌళరాగానికి నక్కకూతఅయిన

ఊళకూ, లేదా మనిషి వేసే ఈలకూ సంబంధమేమిటి? అసలు ఆ రాగం ముఖ్యంగా భక్తి ప్రకటనంకోసమే పెట్టిపుట్టిందంటారుకదా? కవి ఉద్రేకాలకూ పరమేష్ఠి జూకాలకూ శబ్దంలోతప్ప సామ్యంఏమిటి? భవభూతి శ్లోకాల ప్రస్తావన కరుణరసోత్కర్షకా లేక భావనిర్భరత్వానికా? ఈ ప్రశ్నలన్నీ ప్రవాహవేగానికి కొట్టుకొనిపోక తప్పదన్నట్లుగా శబ్దానికి శబ్దం జతకలిసి చిక్కిరిబిక్కిరి గీతల ద్వారా చిత్రాన్ని నిర్మించేట్లు ఆశించని ఒక అద్భుతమైన వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి. భూతమూ, యజ్ఞోపవీతమూ, వైష్ణవ్యగీతమూ ఒండొంటితో సమసించేవిధం శబ్దసామ్యంవల్లనేగాక ఆ మూడింటి సంయోగఫలితంవల్ల కూడా అనిపిస్తుంది.

'మహాప్రస్థానం' గేయాలలో కనిపించేది ఇంతమాత్రమేకాదు. శబ్దంమీద శ్రీశ్రీకిగల అపరిమితమైన ప్రభుత గురించి విశ్వనాథవారి శిష్యులు కూడా యోగ్యతా పత్రాలిచ్చి ఉన్నారు. సంస్కృత భాషా పరిజ్ఞానమేలేకుండా శ్రీశ్రీ వాడిన సాంస్కృతిక సమాసాలనుచూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. 'వర్షుకాభ్రముల' వంటిచోట్ల తప్పుచేసినట్లు గమనించికూడా, ఈవరకే అచ్చుపడి రూఢమై ఉన్న పాఠాన్ని మార్చడానికి శ్రీ శ్రీ అంగీకరించలేదు. కృష్ణశాస్త్రిగారి 'విటపీవని'కూడా ఇలాంటిదే. 'చూర్ణమాన' అలాక్షణిక ప్రయోగమని, 'చూర్ణయమాన' అనేదేసాధురూపమని, కానీ అర్థం కుదరడానికి అది 'చూర్ణ్యమాన' కావాలని, అలాగే ధాతువేగాని 'దీర్ణ' శబ్దానికి 'దీర్ణమాన' పుట్టజాలదని శ్రీ కాళూరి హనుమంతరావుగారొక వ్యాసంలో రాశారు. ఈ చర్చను శాబ్దికులకు విడిచిపెట్టి, శ్రీశ్రీది శబ్ద లౌల్యమాకాదా అనే విషయాన్ని ఎత్తుకొంటాను.

'శబ్ద ప్రభువు' అనే మాటకు నామ మాత్రుడైన ప్రభువు అని అర్థం కాబట్టి దాన్ని వాడను. శబ్దంమీద శ్రీశ్రీకి అద్వితీయమైన అధికారం ఉండవచ్చు, ఉందికూడాను. అయితే శ్రీశ్రీమీద శబ్దానికి గూడా అధికారం లేకపోలేదు. శ్రీశ్రీ గురువైన స్విన్‌బర్న్ లోపం కూడా ఇదే. స్విన్‌బర్న్ పాటల గురించి ఒక పాటే రాసిన శ్రీశ్రీ, గురువు నోట్లోంచే ఊడిపడ్డాడు. వశం తప్పిన మాటల దూకుడులో కానరాకే కదలిపోతూ స్విన్‌బర్న్ "గళ గళన్మంగళ కళా కాహళ హళాహళిలో" కలిసీ కరిగీ పోయానంటాడు. స్విన్‌బర్న్ గురించి ఆస్కార్ వైల్డ్ అన్న ఈ మాటలను శ్రీశ్రీకీ అన్వయించవచ్చు.

It has been said of him with truth that he is a master of language, but with still greater truth it may be said that language is his master. Words seem to dominate him. Alliteration tyrannises over him.

శ్రీశ్రీ 'అద్వైతం' గేయం ఈ శబ్దాధీనతకు తార్కాణ. స్విన్‌బర్న్‌కంటె ఒక ఆకు ఎక్కువే చదివినట్లు సాగిన ఈ రచనలో శ్రీశ్రీ చూపెట్టిన శబ్ద ప్రియత్వం జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి పేరడీకి పాత్రమైందంటే, బలం అనుకొనే గుణమే అతిశయించి అవగుణమైందని గ్రహించవచ్చు. స్విన్‌బర్న్‌కు అనుసరణీయుడు బాడ్‌లేర్, బాడ్‌లేర్‌కు అనుసరణీయుడైన అమెరికన్ కవి ఎడ్గార్ అలెన్ పో The Bells అనే రచనలో వట్టి శబ్దాలతో గారడీ చేశాడు. శబ్దానికీ భావానికీ మైత్రిఉంటే దాన్ని Onomatopoeia అంటారు. ఈ మైత్రి వైదొలగకుండా శబ్ద ప్రధానమైన కావ్యం రాయడం గొప్ప విషయమే. పోగానీ శ్రీశ్రీగానీ అలా చెయ్యలేదు. శబ్దాతిశయం (overfulsomeness) దీనికి బలాన్నివ్వలేదు సరికదా, దౌర్బల్య హేతువై కూచుంది. మరొక గేయంలో, 'సెలయేళ్ళ' శబ్దం వెంటనే 'లేళ్ళు' రావడం శబ్దలయకేగాని భావానికి అంతగా సాయపడదు. లేళ్ళలా చెంగలించే సెలయేళ్ళని అర్థం ఊహించుకొంటే, అది వేరే మాట. 'తల్లడిల్లే', 'కెళ్ళగిల్లే', 'పల్లడిల్లే' శబ్దాలు బాటసారికి వచ్చిన కష్టాన్ని చూచి పాఠకుడు మరింత జాలి చెందడానికి పనికివస్తాయేమోగాని వాటికి ఉండవలసినంత అర్థ సంపన్నత ఉన్నట్లులేదు. క్రమంభంగాన్ని కూడా గుర్తించినంతగానో, గుర్తించి కూడా సరిదిద్దుకోలేనంతగానో, ఈ శబ్ద చాపల్యం శ్రీశ్రీలో అక్కడక్కడ కనిపిస్తుంది. 'సర్గవిలయ హేమంత వసంత ధ్వాంత కాంతి విక్రాంతి వేళలో' అనే దానిలో వసంతమూ కాంతీ ముందుకైనా రావాలి, 'సర్గం' వెనక్కైనా పోవాలి. "హింసనచణ" "ధ్వంసనచణ" లకూ 'ధ్వంసరచన' 'హింసరచన'లకూ మధ్య శబ్దమైత్రి ఉండవచ్చునేమోగాని అర్థపుష్టిలేదు.

అరరె! ఆడిపోతున్నాయి :
వాడి ముమ్మొనవాలు.
హుతభుక్
అజకపాలం
డొక్కు డుబుడుక్
నాల్గుసేతుల నాడులౌతున్నాయి.

అంటూ కవికొండల వెంకటరావు నిర్మించిన తాండవశివుని భయంకర లీల శ్రీశ్రీ చేత నటధూర్జటి ప్రళయకేళిగా మార్పుచెంది ప్రపంచాన్ని భయపెట్టేందుకు నిటాలాక్షిని పటాలుమని పగలగొట్టి నిటలాగ్నిని రగలబెట్టింది కాబట్టి ఆ ఊపు లోనే ఆశ్చర్యాన్నీ సంభ్రమాన్నీ కలిగించేందుకు

అరె ఝూఁ ! ఝూఁ !
ఝుటక్, ఫటక్....
హింసనచణ
ధ్వంసరచన !
ధ్వంసనచణ
హింసరచన

చేయించింది. హింసనకు చణమైనది, ధ్వంసనకు చణమైనది అని అర్థం చెప్పుకో వచ్చుగాని, అది Constructive Interpretation అనిపించు కొంటుందేమో !

ఇంతకూ శబ్దంమీద కవికిగల అధికారానికీ, కవిమీద శబ్దానికిగల అధికారానికీ వెంట్రుకవాసి భేదమే ఉంటుంది. అదిఇదీ ఇదిఅదీ అయిపోయే ప్రమాదం ఉంది. శ్రీశ్రీ కూడా ఆ ప్రమాదానికి లోనుగాక తప్పలేదని చెబుతూ ఈ ప్రకరణం ముగిస్తాను.

'మహాప్రస్థానం' గేయాలలో సమకాలిక చరిత్రగతిని వెదికి పట్టవలసిన పనిలేదు. శ్రీశ్రీ విప్లవ కవిత్వమూ దేశంలో శ్రామికోద్యమమూ అనుజన్మలని వెనకటికి నేనొకమారు రాశాను. అది శ్రీశ్రీ ఒప్పుదల పొందలేదు. వాటి రెంటి మధ్య జన్యజనక సంబంధమేదో ఉందని అప్పుడూ ఇప్పుడూ నా ఉద్దేశంకాదు. కాకుంటే, అవి దాదాపుగా ఒకేకాలంలో బయల్పడడం యాదృచ్ఛికమని నే నను కోను. జీవన నైష్ఠూర్యాన్ని రుచిచూడకముందే, జీవితంలో సంబధం లేకుండా సాహిత్య పరంగా మాత్రమే శ్రీశ్రీ ఈ పంథాలో కాలుమెట్టి ఉండవచ్చు. ఈ కవిత్వానికి ఒక తెన్నుచూపి లక్ష్యాన్ని నిర్దేశించింది ఏ ఒక్క సమకాలిక ఘటనా కాకపోయి ఉండవచ్చు కూడా. Secondary Sources నుంచి శ్రీశ్రీ ఉత్తేజం పొంది ఉండవచ్చు. అయినా ఒక చారిత్రక దశకంతటికీ చెందిన ధోరణుల

నుంచి శ్రీశ్రీ విప్లవకవిత్వం స్వతంత్రించలేదు. బ్లాక్, మయకోవస్కీల కవిత్వం గానీ, అభ్యుదయ రచయితల లండన్ మహాసభా పత్రాలుగానీ తన కవిత్వాన్ని ప్రభావితం చెయ్యలేదని శ్రీశ్రీ కూడా అనలేదు.

కొన్ని గేయాలను రచించేందుకు ఏ ప్రాపంచిక ఘటన మిమ్మల్ని ఉత్సాహ పరిచింది అని నేను శ్రీశ్రీని ప్రశ్నించినప్పుడు, ఇదమిత్థమని తేల్చి చెప్పలే దాయన. అయినా ఆ గేయాల రచనాకాలాన్ని గుర్తుంచుకొంటే లౌకిక ఘటనల తోటి వాటికిగల లంకెలు బయల్పడక పోవనుకొంటాను. బయల్పడడమంటే అదృశ్యరూపాన్ని వదిలి పెట్టడమే. పరిశోధకుల ఊహాగానాలకు విడిచివెయ్య కుండా, తానై కవిచెప్పగలిగితే మంచిది. శ్రీశ్రీ ఆపని చెయ్యలేదు. చెయ్యలేకనే చెయ్యలేదేమో ! "రష్యా ! రష్యా! ఓ రష్యా" గేయంతప్ప తక్కినవాటిలో దేనికీ ప్రపంచఘటనలతో ప్రమేయమేదీ లేదన్నట్లుగా తేల్చివేయడం వరకైతే తేల్చి వేశాడు. 1938లో రాసిన 'జ్వాలాతోరణం' గేయంలో, హిరణ్యనేత్రుడు శివుడో హిరణ్యాక్షుడో కాదు, 'హి' వర్ణసామ్యంవల్ల హిట్లరు స్ఫురించాలట. మాటవరసకు సరేనందాం. ఆ చరణంలోనే ఒక వృకోదరుడున్నాడుగదా, 'వృ' వర్ణంవల్ల ఏ లోకకంటకుని పేరు స్ఫురిస్తుంది ? ముస్సోలినీకాదు కదా ! ఇలా మరెవ్వరికీ అంతుజిక్కని విధంగా తానుద్దేశించిన వాటిని గేయాల్లో పాతరవేసి పెట్టాడా శ్రీశ్రీ ? లేక, దేన్నీ, ఎవర్నీ ప్రత్యేకించి ఉద్దేశించలేదా ?

1934లో రాసిన 'అవతారం' గేయంలో "పుడమి తల్లికి పురుటి నొప్పులు" తెచ్చిపెట్టిన ఈ అద్భుత కవిత్వ శిశువు, నాల్గేళ్ల ప్రాయం దాటక ముందు 1938లో "పుడమికి.... పుట్టిన రోజట" అంటున్నాడు. ఏవో ప్రాపంచిక ఘటనలకు ఇవి అక్షర ప్రతిబింబాలనుకోవడమే పనిలేనిపని అని పిస్తుంది. అయితే కూలీల సమ్మెల వంటి విషయాలు ఒకటికి రెండుమార్లు ప్రస్తావనకు రావడం మాత్రం తోసివెయ్యాల్సిన సంగతికాదు. ఏదోరూపంలో సమ్మెలు అంతకు ముందునుంచీ మనదేశంలోకూడా జరుగుతూ ఉండవచ్చు. అయితే 1925 తర్వాతనే సోషలిస్టు మార్గంలో కార్మిక సంఘటన మొదలైంది. శ్రీ శ్రీ విప్లవ కవిత్వం బయల్దేరే సమయానికి అది నిశ్చితమైన రాజకీయరూపాన్ని ధరించింది. శ్రీ శ్రీ చైతన్యంలో ఇది క్రమేపీ పైచెయ్యి సంపాదిస్తూవచ్చి కాల్ప నిక వాదపు గుప్పిటినుంచి శ్రీ శ్రీ కవి-వ్యక్తికి విడుదల కలిగించింది. "బుక్కులు" గేయంలో పరమ సామాన్యమైన వస్తువులనుంచికూడా కవిత్వాన్ని

మెట్లుదిగుతున్న రంగమ్మతో.

'లేదయ్యా, పొద్దుగూకినాక వస్తాడు. రాత్రికి యాడేవుంటాడు' అంది.

నీళ్ళలో రెండుమెట్లుదిగి చేతులూ మొఖమూ కడుక్కోంబోయింది రంగమ్మ. 'భద్రమే రంగి, జారిపడేవు!' అంటూ రెండుమెట్లుదిగాడు శివకామయ్య. కడుక్కోటం పూర్తి చేసుకొని లేచినిలబడింది రంగమ్మ. 'ఇప్పటి కడుక్కోటమే, నీ మొగాన బురదైనాపోలేదు!' అని రంగమ్మ చెక్కిలిమీదికి చెయ్యిపోనిచ్చాడు. రంగమ్మవెంటనే వెనక్కి జరిగింది. కొంచెం అనుమానిస్తూ చూసింది అతని వైపు. 'అట్లా భయపడతావేమే, నీ మొగుడిప్పుడే రాడులే' అంటూ కొంగు పట్టుకున్నాడు. రంగమ్మ నివ్వెరపోయింది. అతని చేతిలోనుండి చీరచెంగును లాగటానికి ప్రయత్నించింది. శివకామయ్య ఇకిలించాడు. 'అదేమే రంగి. కొంగుపట్టుకుంటేనే కోడిపిల్లాడదీసినట్టు ఉలికి పడతావ్ రా!' అంటూ యింకా బలంగా లాగబొయ్యాడు. కొంగుచాటునుండి బయటపడిన యౌవన చిహ్నాల్నిచూసి అతని కోరిక కట్టలు తెంచుకుంది. రంగమ్మ వాని పట్టు విప్పు అయినంతగా పెనగ పడింది. మరుక్షణంలో రంగమ్మలో శక్తి ప్రవేశించింది. 'పోరా! పాపయ్యాడు తిమ్మిరెక్కినట్టుంది, ఇదుగో!' అని పురుగును దులిపినట్టు విదిలించివేసింది. చివర మెట్టుమీదున్న శివకామయ్య ఆ విదిలింపుకు దభీ మని నీళ్ళలో పడ్డాడు. 'బాగైంది ముండాకొడుక్కి' అని అంత కోపంలోనూ చిరునవ్వు నవ్వుతూ మెట్లెక్కింది రంగమ్మ.

గట్టుమీదికొచ్చి తిరిగి చూచిన రంగమ్మ నిర్విణ్ణురాలైంది. శివకామయ్య కనిపించలేదు. 'సచ్చినోడికి ఈత రాదో యేమో' నని విలవిల్లాడింది. యింతలో శివకామయ్య అంత దూరంలో కనిపించాడు. నీటిప్రవాహం బలంగా వుంది. మునుగుతూ తేలుతూ కొట్టుకుపోతున్నాడు. రంగమ్మకు గుండె ఆగినంత పనైంది. గట్టిగా కేకలేస్తూ గట్టువెంబడి పరుగెత్తసాగింది. కనుచూపుమేర దూరంలో యెవరూ లేరు. శివకామయ్యకు చావు తప్పదు అనుకుంది రంగమ్మ. ఒక మైలు దూరంలో తప్ప మెట్లులేవు. కాబట్టి మెట్లమీది నుంచి చెయ్యి అందిచ్చే వీలుకూడలేదు. శివకామయ్య గట్టువెంబడే కొట్టుకుపోతున్నాడు. సిమెంటు చేయబడిన గట్టును పట్టుకొని నిలిచేదానికి విఫల ప్రయత్నం చేస్తున్నాడు. మునుగుతున్నాడు. తేలుతున్నాడు. గట్టుమీద రంగమ్మ పిచ్చిదానిలా 'అయ్యో అయ్యో సంపేసినానురోయ్' అని కేకలేస్తోంది.

వెంటనే మెరుపులాంటి ఆలోచన తట్టింది. తట్టిన వెంటనే రంగమ్మ చీర విప్పడం ప్రారంభించింది. క్షణంలో నగ్నంగా తయారైంది. చీర కొస ఒకటి

అని బాధాసర్పదష్టులకీ భ్రష్టులకీ రాజ్యాధికారాన్ని కవి స్వయంగా ఇచ్చేస్తున్నాడు. అయినా అది అప్పటికీ ఇప్పటికీ స్వప్నమే. స్వప్నంకనకనే దానికి అంతటి ఆకర్షణ!

శ్రీశ్రీ కూడా స్వాప్నికుడేనన్నమాట. కవి ప్రతిఒక్కడూ కల గనవలసిందే. ఆస్వప్నం నిజమైతే మరో మంచిస్వప్నం కౌగిలికి మనస్సును అప్పగించుకొంటూ స్వప్నంనుంచి స్వప్నానికి ప్రయాణిస్తూ పోవడమే తాను చేయగలిగిందీ చేయవలసిందీ. రుజువయ్యాక స్వర్గాలు స్వర్గతుల్యంగా లేకపోతే, పరిపూర్ణతకోసం నిర్వక్రతకోసం ఇంకో స్వర్గదృశ్యాన్ని ఊహించుకొని గానం చేస్తాడు. ఒక చారిత్రక దశలో సమాజంకనిన గొప్ప కలను శక్తిగల అక్షరాలలో నిలిపి ప్రజల కలలో నాలుకైనందుకైనా శ్రీశ్రీ విప్లవ కవిత్వం విలువగలది.

'నెత్తురూ, కన్నీళ్ళూ తడిపి కొత్త Tonic తయారు చేశాడు శ్రీశ్రీ యీ వృద్ధ ప్రపంచానికి.'

* * *

"హృదయం ఎల్లా కంపిస్తే ఆ కంపనకి మాటల రూపాన్ని యివ్వడం అతనికే తెలుసు. మాటల్ని కత్తులూ, యీటెలూ, మంటలుగా మార్చటం అతనికే చేతనవును. పద్యాలు చదువుతోంటే, ఇవి మాటలుకావు, అక్షరాలుకావు – ఉద్రేకాలు, బాధలు, యుద్ధాలు – అతని హృదయంలోంచి మన హృదయంలోకి Direct గా పంపిన ఉత్సాహాలు, నెత్తురు కాలువ లనిపిస్తుంది."

— చెలం

# శ్రీశ్రీ వచన రచన

— కొడవటిగంటి కుటుంబరావు

సిద్ధహస్తులైన కవుల వచనానికి ఒక ప్రత్యేకత ఉంటుంది-ఉండాలి-అన్నభావం స్వాభావికమైనది. నన్నయ్యభట్టుగారి గద్యల్ని గురించి గొప్పగా చెప్పుకునేవారు. ఈనాటి కవులలో చాలామంది వచన రచనలు చేశారు - కృష్ణ శాస్త్రి, శ్రీశ్రీ పిలకా గణపతిశాస్త్రి, బాలగంగాధర తిలక్, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి మొదలైనవారు. స్త్రీ హస్త పాకానికీ, పురుషహస్త పాకానికీ తేడాతెలిసినట్టుగానే కవులు రాసే వచనానికీ, కవిత్వం చేతగానివాళ్ళు రాసే వచనానికీ తేడా తెలుస్తూనే ఉంటుంది. విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి వంటి సవ్యసాచుల దారివేరు,

కథలూ, నవలలూ, విమర్శలూ, తదితర వ్యాసాలూ రచించేవాళ్లను సాహిత్యమన్నది వచన మహాసముద్రమనీ, కవిత్వం ఆ సముద్రంలో తేలే చిన్న పెద్ద తెప్పలనీ అనిపిస్తుంది. కాని కవులకు అట్లాకాదు; కవిత్వమే మహా సముద్రం, వచన రచనలు ఆ మహాసముద్రంలో చిన్న పెద్దదీవులు.

రెండు అభిప్రాయాలూ వేరువేరు దృక్కోణాలనుంచి సరిఅయినవే. కవి వచనరచన చేసినా తనకు సహజమైన కవి దృష్టిని విడనాడడు. వచనరచయిత కవిత్వాన్ని-ఎంత నచ్చిన కవిత్వాన్నైనా సరే ఆటవిడుపు రచనగానే చూస్తాడు.

"నేను వచనం రాస్తున్నా నా హృదయాంతరంలో మట్టుకు కవిత్వం అంటే మట్టుకు మహా అభిమానం," అంటాడు శ్రీశ్రీ ("సీతయ్య"). అయితే వచనం రాయటందేనికీ ? పద్యాలతోనే పనికానిచ్చుకోకూడదూ ? కూడదు. వచనంలో సాధించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి శ్రీశ్రీకి. అవి వివిధంగా కూడా ఉన్నాయి. వాటిని గురించి సంగ్రహంగా తెలుసుకుందాం.

## ఆశయాలు

శ్రీశ్రీ ఆశయాలన్నిటిలోకీ అతిముఖ్యమైనది ఈ నాటి జీవితాన్ని అభ్యుదయవాద భౌతిక దృష్టితో విమర్శించటం. "నేస్తం ! నేటి ప్రపంచానికి తెలిసింది ఒక్కటే విలువ ధనం ! సంగీతాన్నీ, కవిత్వాన్నీ, చిత్రలేఖనాన్ని ఎవరో హర్షించారు. డాక్టరునై .... డబ్బు తీసుకోకుండా వైద్యంచేస్తానంటే వెర్రివాడికింద కట్టేస్తారు. ఉత్పత్తి ప్రాథమికదశలు ఉన్నప్పుడు వ్యక్తి సామర్థ్యానికి ప్రాముఖ్యం ఉండేది. ఇది జూదంగామారలేదు ! అంతాలాటరీ ! అంతాగారడీ ! ఎవడెప్పుడు గెలుస్తాడో తెలియదు. ఎవడెందుకు ఓడిపోతాడో తెలియదు. నేటి వ్యవస్థకొక నీతిలేదు, ఒక నియమంలేదు. తానే చెయ్యగలపని తనమనస్సంతాపెట్టి చెయ్యడం, చేసినందువల్ల తాను ఆనందంపొందడం, దానిఫలితం అందరినీ అనుభవించనివ్వడం, ప్రస్తుత పరిస్థితులలో సాధ్యమవుతుందా ? నేను సుఖంగా ఉండడానికి నా నౌఖరును కష్టపెడతాననడానికి (ఇప్పుడు) వీలులేదు. విద్యుచ్ఛక్తి నిన్ను సుఖపెడుతుంది. ఆవిరి నిన్ను సుఖపెడుతుంది. విజ్ఞానం నిన్నుసుఖపెడుతుంది. నీ సుఖాలను నీ సోదరులందరికీ పంచిపెట్టు. అందులోనే అనల్ప సౌఖ్యంఉంది. ఈ ప్రపంచం మిథ్యఅనీ, జీవితం దుఃఖభూయిష్ఠమనీ అనేవాళ్ళను నేను లక్ష్యపెట్టను....ధనికవర్గం ఈ సుఖాన్ని దాచుకుంది. అలాదాచుకోడానికి వీలుగా నేటి పద్ధతి సర్వమూ నిర్మించబడింది. ధనవంతులకే మరింతధనం ! వెనుకబడినవాడు వెనకనే. దరిద్రుడుగా పుట్టడమే తప్పు. అదివాడి కర్మం. అదివాడిపాపం (అని) ఈ వ్యవస్థను సమర్థించడానికి కూడా మనపండితులు కొందరు బయలుదేరుతున్నారు. డబ్బు ఎంత క్షమించరాని నేరంచేస్తోంది ! అమూల్యమైన రసాత్మలను కొనేస్తోంది....సహజగమనాన్ని శాస్త్రీయంగా అర్థంచేసుకున్నవాడు ఎవరి పక్షం వహించాలి ఈనాడు ?....పురుషులదేం కష్టం ? కష్టాలనీ, కష్టాల సహనాన్నీ చెప్పాలంటే స్త్రీలని స్మరించు....( ఆహా, స్త్రీలోకంలో ఉదాహరణలు స్మరిస్తే చెయ్యివణకుతోంది.)....ఈ భూలోకానికి నా ఆశీర్వాదం. నదులవల్ల, పర్వతాలవల్ల, అరణ్యాలవల్ల, మహానగరాలవల్ల, పల్లెటూళ్ళవల్ల సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ భూలోకం అభ్యున్నతిని కాంచునుగాక ! ఆనకట్టలతో, వంతెనలతో, వేనవేలమైళ్ళరాళ్ళ దారులతో, విమానాలతో, శాస్త్రపరిశోధనలతో, టెలిగ్రాఫ్, రేడియో శ్రవణాలతో, సినీమా, టెలివిజన్ నేత్రాలతో మానవత్వం విజృంభిం

చునుగాక ! లోకమంతా ఏక కుటుంబమై, తనవిధిని తానే నిర్ణయించుకోగలశక్తిని మానవుడు సాధించును గాక" ("చరమ రాత్రి").

"ఎంత కలికాలమైనా ఎక్కడో ఒక నాయకుడు దొరక్కపోడు. ఆంధ్ర దేశంలో నాయకులకే కొదవా ? అయితే ఒక చిక్కున్నది. వాళ్లు తమమీద పద్యాలు రాయమంటారు. పువ్వులదండలు వెయ్యమంటారు. స్వాగత పత్రాలు సమర్పించామంటారు.... ఇది వరకు ఏం చేస్తున్నారు తమరంటే, స్వరాజ్యం తేవడానికి ప్రయత్నిస్తున్నామనేవారు. ఇప్పుడుమాత్రం. 'ఇంగ్లీషువాడు మనకిచ్చిన స్వరాజ్యం ఏమీబాగోలేదు. దీన్నిపట్టిగెళ్లి వాడికే ఇచ్చేద్దాం' అంటున్నారు.... బజారులో దొరికే సరుకుకాదుగదా నాయకుడంటే !.... ఎవరో పెద్దపెద్ద పెట్టుబడి దారులుతప్ప సామాన్యులెవరూ నాయకులను కొనలేరనుకుంటాను." ("అనామిక")

"ఈనాటి రాక్షసులు ఎంతో అందముగా కనబడతారు.... నమశ్శివాయ దొంగ, పచ్చిదొంగ.... దొంగతనాన్ని ఒక లలితకళగా అభివృద్ధి చేశాడు. కాని ఆ దొంగకు శిక్షలేదు. అసలు నమశ్శివాయ చేస్తున్నది దొంగతనం అని గుర్తించడమే కష్టం.... బోలెడంత ఆస్తిఉన్నవాడు.... వ్యాపారం చేసి ఆ ఆస్తిని మరింత అధికం చేశాడు.... ఎంత పెద్దమనిషి తరహాగా కనబడతాడు ! ఊళ్ళో అతనికెంత పలుకుబడి ఉంది ! అతనా దొంగ ?.... అలా అన్నవాడినే అంతా తిడతారు." ("నేటి హిరణ్యాక్షుడు")

"సంఘం అనకు ప్రజలంటే ఒప్పుకుంటాను. ప్రజలనగా గవర్నరు నుంచి గవరయ్యదాకా అందరూ ప్రజలే. కాని గవర్నరు సంఘంవేరు, గవరయ్య సంఘంవేరు." ("శూర్పణఖామాన సంరక్షణం")

"మీ రాజకీయ నాయకులు చేసే ఉపన్యాసాలలో ఎంతనల్లమందులేదు?– ఎక్కడుందయ్యా, మీ సౌందర్యం?.... అసలు మీరు సౌందర్యాన్ని కనిపెడుతున్నారా ? కనిపెడితే గౌరవిస్తున్నారా ? " ("హేమంతం"లో అవ్వ)

"దిగడం, దించడం సులభం, సుఖం ! ఎక్కడం, ఎత్తడం (మనల్నీ మన సహచరులనీ) కష్టం, దుఃఖం" ("ఒక్కటి")

"అక్రమలాభాలమీద అదనపు పన్ను తగ్గింపు. ఆర్థిక పరిస్థితిమీద కేంద్ర ప్రభుత్వపు దండయాత్రకృషి, ఇతోధికకృషి, ద్రవ్యోల్బణము. దాని నరి కట్టుటకు ఆరు మార్గాలు".... "స్వరాజ్యం వచ్చినతర్వాతనో అంతక్రితం ఆరేడు నెలల పూర్వమో జమీందారు జాతీయ మతం తీసుకుని దీక్షావస్త్రాలు ధరించాడు".... "'కమ్యూనిస్టులను పాతేస్తున్నాం' అన్నారు దొరతనంవారు. పాతేస్తున్నారు. వానలు కురిస్తే దేశం అంతటా కావలసినంత పంట." ("క్షణంలో సగం")

ఈభావాలన్నీ ప్రతి అభ్యుదయవాదీ ఆమోదించేవే, హర్షించేవే. అయితే వాటిని ఇలా "ప్రచారం" అనిపించుకునే ధోరణిలో చెప్పే వచనరచయితలు అరుదు, కథకులు ఇంకా అరుదు.

వచన రచనలో శ్రీశ్రీ novice అన్న అనుమానం కలుగుతుంది. ముందు చెప్పబోయేవిషయాలు ఈ అనుమానాన్ని బలపరుస్తాయి.

## వచన రచనలమీద దాడి

వచన రచలు సాగించటంలో శ్రీశ్రీ కనబరిచే మరో ఆశయం వచన రచనలపై వ్యాఖ్యానించటం. కొన్ని కొటేషన్లు :

"సీతయ్య నా చేతిలో యంత్రం.... నా హార్మొనియంపెట్టె, కేరమ్సుబల్ల."

"ఓ గొప్ప కథానాయకుణ్ణి సృష్టించుదామని నేను చాలా యత్నించిన మాట వాస్తవమే, ఇంతసేపూ సీతయ్య ఒక యథార్థవ్యక్తి అనీ, వాడి గురించి యావత్తు నాకు తెలుసుననీ మీలో ఒక అభిప్రాయం కలిగించాను."

"ఇప్పటికి మీరు కొంత విసుగుపుట్టి, తటాలున తర్వాతిపుటలకు పోదా మని వుంటుంది కాని, 'సీతయ్యను గురించిపూర్తిగా తెలుసుకొని మరీ పోదాం, ఎలాగు రానేవచ్చాం' అనే ఆస్థ పీకుతూ ఉంటుంది. కల్పితవ్యక్తి అయితేనేం ? కథ బాగుంటే చాలునని నిలబడతారు."

పాత్రలకూ, పఠితలకూ ఉండే సంబంధాలను ఇంతకన్న తప్పుగా భావనచెయ్యటం సాధ్యంకాదేమో.

సుమారైన మంచి కథలు రాసేవాడు కూడా తానుసృష్టించిన పాత్రలు తన యిష్టంవచ్చినట్టు ఆడవని గుర్తించి ఉంటాడు. పాత్రలు కల్పితమైనవి కావని ఏ పాఠకుడూ అనుకోడు; కాని వాటిలో వాస్తవికతకోసం పాఠకుడు అన్వేషిస్తాడు.

ఈమారు మీ దేశాభిమానాన్ని రెచ్చగొట్టుతున్నాను. ఇవన్నీ మామూలు పద్ధతులే అనుకొండి."

"ఈ సీతయ్యతో నేను ఎంతపనైనా చెయ్యగలను. వీడు నా సృష్టి. పూర్తిగా నాచెప్పు చేతలలో మెలగవలసినవాడు.... వీడికిరూపంయిచ్చి, గుణాదులు కల్పించి, సంఘటనలో నిలిపి కథ నడిపించాలన్నా నడిపించవచ్చు. అదో కష్టమైనపని కాదుకూడా!"

మరేది కష్టమైనపని ? ఆ పనిని శ్రీశ్రీ చేశాడా ?

"కథ వండు దామని కలంపట్టుకుని కాగితాలు పెట్టుకుని కూచున్నాను. ఇతివృత్తాన్ని ఎసరుమీది కెక్కించాను. కథానాయకుణ్ణి ముక్కలుగా తరిగి కారప్పొడి చల్లి పచ్చడి చెయ్యాలనుకున్నాను.... కథానాయకులందరినీ ఇదివరకే సినిమా వాళ్లు పచ్చడిచేసి నంచేసుకున్నారు నాకొక్కడినీ మిగల్చకుండా."

ఇది సినిమాకు డిజర్వుకాని కాంప్లిమెంటు. సాహిత్యంలో పనికివచ్చే నాయకులు దాదాపు సినిమాలలో లేరనే కొందరం అనుకుంటున్నాం.

"నేటికాలం....కథలకి కాలమేకాదు." సినిమా కథలదృష్టిలో ఈమాట నిజమే. శ్రీశ్రీ వండుదామనుకుంటున్నది సినిమా కథ కాదుగద! అయే ఉండాలి. "ఈ రోజుల్లో ఎవరికథలు వాళ్ళే రాసుకుంటున్నారు. వాళ్ళకు మనం రాసిపెట్టే కథలు సాయించవు." నిశ్చయంగా "వాళ్ళు" సినిమా ప్రొడ్యూసర్లే.

"చాలా కథల్ని సంపాదకుడు చంపేస్తుంటాడు." ఇవి మళ్ళీ మామూలు కథలు.

"కొంతమంది ఒక చిటికెడు కథావస్తువు తీసుకుని గంగాళాలకొద్దీ విషయాన్ని కలుపుతారు. మరికొంతమంది చవగ్గా దొరికిందిగదాఅని గంగాళమంత కథావస్తువు తీసుకుని చెమ్చాలో ఇమిడిపోయేటంత చిన్నకథ రాస్తారు....కథ అయిపోతుంది, కథావస్తువు మిగిలిపోతుంది." ఇదంతా మళ్ళీ సినిమా గురించే.

"కథానాయకుడితో ఒకరకం బాధయితే, కథావస్తువుతో ఇంకొకరకం బాధ"—సినిమాలు తీసేవాళ్ళకి. వాళ్ళబాధలైనా శ్రీశ్రీ సరిగా బయటపెట్టక పోవటం శోచనీయం.

## కథకుడుగా శ్రీశ్రీ

"చరమరాత్రి" ప్రచురణ కర్తలు ఇలా అన్నారు : మహాప్రస్థానం కవితలు విప్లవంతెస్తే, చరమరాత్రి కథల్లో విప్లవం సృష్టిస్తుంది."

ఈ దేశంలో విప్లవాలు అంతతేలిగ్గా రావని వారు గుర్తించలేదు. మహాప్రస్థానం కలిగించింది సంచలనాన్ని. దాన్నిచూసి అనేకులు ఆనందంతోనూ, కొద్దిమంది ఆవేశంతోనూ పరవశులయ్యారు. కొన్ని వందలమంది యువ కవులు దాన్ని కాపీకొట్టారు. ఇంతే జరిగిన విప్లవం. "చరమరాత్రి" అలాంటి సంచలనాన్నికూడా కలిగించలేదు.

"సంఘటనల్లేని సంచలనంలేని కర్త, కర్మ, క్రియల్లేని కథనాన్ని కాదనడం ఎలా?....ఒక్క పూరిల్లుగాని, పచ్చకర్పూరంగాని, చివరికొక సిగిరెట్టుకాని తగలెట్టేటప్పుడు బయల్దేరే పొగలో కనిపించే కదలిక పాటిదికూడా ఈ రాతలో మీకు కనబడదు," అని శ్రీశ్రీ ఒప్పుకుంటున్నాడు.

అయితే అతని సాధన దేనికి?

"మెదడు తగలబడిపోయేటప్పటి పొగకాని పొగ, కదలనట్లు కనిపించే కదలడం, జరగనట్టుకనిపించే జరగడం ఇందులో చూపించాలని ఎందుకో ప్రయత్నం."

ఈ ప్రయత్నం జరిగిన రచన పేరు "బాధ కవిత్వానికి పర్యాయపదం." కథలతో నిమిత్తంలేదు, వచన రచనే అయినా !

శ్రీశ్రీ రాసిన వాటిని కథలనేకన్న వచనప్రయోగాలనవచ్చు. వచనం రాయటంలో శ్రీశ్రీకి ఆసక్తి అంతగా లేనట్టే, కథ రాయటంలోనూలేదు. శ్రీ శ్రీ ఇంచుమించు కథలకు శత్రువు.

అయితే శ్రీశ్రీ ప్రయోగాలు పూర్తిగా విఫలం కాలేదు. కొనేటిరావుకు సంబంధించిన మూడు కథలూ విజయవంతమైనవే. "బొమ్మ"లో నాకు మంచి

కథ కనిపించింది. ఒక్కముక్కలో చెప్పలంటే, శ్రీశ్రీ తానురాసేదానికి తానే అడ్డంగా నిలబడని రచనలన్నీ రక్తిగానే ఉన్నాయి. "కథలేదు, కథకుడు మాత్రమే ఉన్నాడు" అనిపించే ప్రయోగాలు విజయవంతం అయినట్టు కనబడవు.

## అంకెల వ్యసనం

"రాత్రి పదకొండు గంటలయింది. ఇంకొక గంట, ఇంకొక్క అరవై నిమిషాలు, సరిగ్గా పన్నెండు కాగానే చచ్చిపోదలచుకున్నాను." ఎందుకింత ప్రిసిషన్ ?

"ఆరు నెలలనుంచీ నాకిదే ఆలోచన" (మళ్ళా) "ఆరు నెలలనుంచి సిద్ధమవుతున్నాను.... ఆరునెలల కిందటే తెగించాను." అరవై నిమిషాలు—ఆరు నెలలు—ఇందులో న్యూమరాలజీ ఏమైనా ఉందా ? ఈ ఆరునెలలు మనని ఒకంతట వదిలిపెట్టదు. "ఆరునెలలు అహోరాత్రాలు.... అవభృదస్నానాలు....ఇదివరకు ఆరునెలల క్రితం, ఎప్పుడో ఆరునెలలకిందట...."

"ప్రేక్షక జనం అయిదు నిమిషాల ఇరవై సెకండ్లసేపు కరతాళ ధ్వనులు చేసి...."

$1-1=1$

$1+1=1$, అని అనడం మానలేను."

నిజానికి అంకెలు సంకేతాలు. గణిత సత్యాలను జీవిత సత్యాలుగా మార్చేటందుకు "కీ" ఏదీలేదు.

$2\times 4=8$

రెండేమిటి ? నాలుగేమిటి ? ఎనిమిదేమిటి ? అడుగులను అడుగులుపెట్టి హెచ్చిస్తే చదరపు టడుగులు వస్తాయి. పండు రెండణాల చొప్పున నాలుగు పళ్ళు కొంటే ఎనిమిదణాలు అవుతాయి. రూపాయకి రెండు చొప్పున నాలుగు రూపాయలకు కొంటే ఎనిమిది పళ్ళవుతాయి. నారింజ కాయలను వంకాయలు పెట్టి హెచ్చించలేం. హెచ్చిస్తే ఏం వచ్చేదీ చెప్పటం ఎవరితరమూ కాదు. ఈ అంకెల సహాయంతో ఏదో తాత్త్విక సత్యాన్ని నిరూపించటం ఎవరివల్లాకాదు. (ఔను—కాదు) + (మంచి—చెడ్డ) — (వెలుగు—చీకటి) + (చావు—బదుకు).... అన్నది లెక్కకాదు, పచ్చి మిస్టిసిజం.

## శైలి, ఛలోక్తులు, సూక్తులు

ఒక రేడియో ప్రసంగంలో ి, తనకు ఎవరి శైలి ఇష్టమన్న ప్రశ్నకు తన శైలే ఇష్టమన్నాడు.

నిజానికి ప్రతి రచయితకూ తన శైలి విధిగా ఇష్టమవుతుంది. ఎవడూ తనకు ఇష్టంలేని శైలిలో పనిపెట్టుకు రాయడుగద. ప్రతి రచయితా తన భావ ప్రకటనకు అనుకూలించే శైలిని ఆలంబన చేసుకుంటాడు.

అయితే, నా అనుభవంలో, రచయితకు తాను రాసే శైలి ఒకటే ఉన్నప్పటికీ, తాను చదవగోరే శైలులు చాలా ఉంటాయి. నామటుకు నాకు చాలా మంది శైలి ఇష్టం. గురజాడ అప్పారావు దగ్గిర ప్రారంభించి గుండ్రంగా తిరిగి రాచకొండ విశ్వనాథశాస్త్రిదాకా వచ్చింది నా అభిరుచి. మధ్యలో భమిడిపాటి కామేశ్వరరావూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రీ, గోపీచందూలాంటి వాళ్ళు ఎందరో తగిలారు. నాకే ఒక శైలి అంటూ ఉన్న పక్షంలో అది నేను రాయటానికి ఉపయోగించేదేగాని చదవటానికి ఎంతమాత్రమూ ఉపయోగపడదు.

శ్రీశ్రీకి తాను రాసే శైలే, తాను చదివే శైలికూడా అయితే, అది ఆశ్చర్యమే. శ్రీశ్రీ వచన రచననిండా పుష్కలంగా "నేను" ఉండటాన్ని బట్టి ఆశ్చర్యాన్ని కొంత తగ్గించుకోవచ్చునేమో.

కాని surrealist ధోరణిలో పడ్డాక అతన్ని అందుకోవటం చాలా కష్టం.

"హెడ్డు గుమాస్తా కోనేటి రావు పంతులు పదకొండు గంటలయింది. గుమాస్తా కోనేటి హెడ్డు పదకొండు గంటలు కొడుతున్నారు. ఆఫీసువేళ కోనేటి గంటల గందరగోళం తొందర భోజనం ముగించుకుని చుట్ట బిగించుకుని బట్ట సవరించుకుని ఒసే కుర్రాళ్లు జాగ్రత్త.... కోనేటి కాగితాల దొంతినిండా కోపం జోళ్ళలో కాళ్ళు జారబడ్డాయి."

ఇలాటి పరుగులో శ్రీశ్రీని అందుకోవటం కష్టం. ఇది శ్రీశ్రీకి స్వక్షేత్రం.

"ఎంతలా సుఖంగా దిగిపోతున్నాం! గబగబా! గభగభా! భగభగా! గాగాభాగగా! గభగా! గాగా! గాభగాగా! గగభగగా! బాగా!"

కవిత్వంనుంచి కొటేషన్లు అంతా సులువుగా దొరకవని నేనంటే, "కోట్ చేస్తే అంతా కోట్ చెయ్యాలి." అన్నాడు ఆరుద్ర. అదే నిజంలా కనబడుతుంది.

కాని శ్రీశ్రీ వచనంలో మెరిసే వాక్యాలు చాలా దొరుకుతున్నాయి.

"ఇంకోదినం దగ్ధమయిపోయిందనే సూచనగా (ఎదురుగుండా పశ్చిమాకాశంమీద) ఎర్రని మంటలు కనబడ్డాయి."

"చేసుకున్న పాపంలాంటిది కొనుక్కున్న బొమ్మ."

"నలుగురితో పెళ్ళి చావుతో సమానం."

"స్నేహం కన్న పరిచయమే డబ్బు పలికిస్తుంది."

"తెలుగు కథలకి మాత్రమే కంచి గమ్యస్థానమనుమంటాను. బంగాళీ కథలు ఎక్కడికి వెళతాయో ? ఇతర భాషల్లోకి కాబోలు."

"కోల్పోవడానికి నాకసలు మనశ్శాంతి అనేదే లేదు."

"నా గురించి ఎవరు ఏమనుకున్నా నాకు లక్ష్యంలేదు. ఏమీ అనుకోకపోతేనే బాధపడతాను."

"శూర్పణఖకి మాత్రం మానంలేదా ? దాన్ని సంరక్షించడం ఉత్తమాదర్శంకాదా ? శూర్పణఖ తనకి మానభంగం చెయ్యవలసిందనే రాములవారి నడిగింది."

వెధవ ఊహలు, పాపిష్టి మనస్సు, మనలో ఇంత కుళ్ళు పెట్టుకుని లోకాన్ని తిడతాము."

"ఈ లోకంలో ఆడదై పుట్టడమంత హీనం ఇంకోటి లేదు.

"చలం కలం విశృంఖలం."

ఎడం చేతివేపునుంచి రమణ మహర్షిని, అంటూ అవ్వ అంతర్ధానమయింది."

"ఈ రోజుల్లో రెండురకాల మాలవాళ్ళున్నారు, సినిమాలవాళ్ళు, డ్రామాల వాళ్ళు."

"రెక్కలు ధరిస్తే మాత్రం ఎక్కడికి వెళ్ళగలవోయ్, మానవుడా ?'

## తాత్త్విక చింతన

"దేవుడులేడు'అని నేనన్నప్పుడు నా ఉద్దేశం 'దేవుడు ఉన్నాడు' అని. ఇది ఎవరికర్థం అవుతుంది? నా 'ఔను'కి, 'కా'దని, నా 'ఉంది'కి 'లే'దని అర్థం ఉందనీ, లేదనీ, ఉండి లేదనీ, లేకఉందనీ ఎలా నచ్చచెప్పగలను ? "

కష్టమే.

"నిరీశ్వరుడే ప్రత్యక్షమై 'నేనున్నాను' అంటే నమ్మకం లేకుండానే నమ్మకాన్ని ప్రకటిస్తాను."

"ఔను/కాదు, మంచి/చెడ్డ, వెలుగు/చీకటి, చావు/బ్రతుకు, మనిషి/దేవుడు అంతా ఒకటే"

అంటే ?

"జీవించినా మరణించినా నేను నేనే కాబట్టి జీవితం సుఖమనీ, మరణం దుఃఖమనీగానీ, జీవితం బానిసతనం, మరణం స్వాతంత్ర్యం అనిగాని వాదించడం మానేస్తున్నాను"

"భూత, వర్తమాన, భవిష్యత్కాలాలను ఒకే క్షణంగా ముద్ద చేసి నేను కల్పించుకున్న, నేను నివసిస్తున్న స్వర్గం"

ఇందులోకి ఎందరు పాఠకులు తొంగిచూడగలరు ?

ఓహో ! సత్యాసత్యాల కవితల సాఫల్యం ! నిత్యానిత్యాలను మించిన సాంగత్యం ! మానవ మనశ్శాఖలమీద పుష్పించిన సంగీతం ! అనేక తరాలలో ఏక కాలమే జీవిస్తున్న అనుభవం ! ఏక కాలంలో ఉండడాన్ని, ఉండకపోవడాన్నీ సాధించే స్వాతంత్ర్యం. ఇది నాకావ్యం ! ఇది నా కామ్యం ! ఇదీ నా స్వర్గం ! "

ఇంత ఎత్తు నాలాటివాడు ఎలా ఎగరడం ? నాకంటె కూడా అర్భకుల మాటేమిటి ?

నన్నడిగితే శ్రీశ్రీ వచనం రాయనవసరంలేదు. అతనిది గరుత్మంతుడి దృష్టి. మూడులోకాలను ఒక్కసారి చూడగలవాడు. అలాటివాడు అల్పవ్యక్తుల్లోకి చూస్తే, గొప్పవాళ్ళు కావటానికి వాళ్ళుపడేపాట్లూ (సీతయ్య), వ్యాపార ప్రకటనల వెనకఉండే దగా (హేమంతం) సినిమాల అన్వేషనూ (అంతటా) కనిపిస్తాయి. వీటినిగురించి మూడోరకం, నాలుగోరకం రచయితలు రాస్తూనే ఉన్నారు.

శ్రీ శ్రీ వేదాంతం కూడా రాయనవసరంలేదు. ఆనల్లమందు శ్రీ శ్రీ పాఠకులను ఉపయోగపడదని శ్రీ శ్రీ ఆరాధకుల్లో ఒకడుగా నేను చెబుతున్నాను.

"శ్రీరంగం శ్రీనివాసరావు – అంటే శ్రీశ్రీ – తో మానవోద్యమంలో రెండోతరం పొలిమేరల దగ్గరికి నవ్యకవిత్వం వస్తుంది ........ ఇతని ఆవేశం కాల్పనికోద్యమానిదే; భాషకూడా అంతవరకు కావ్యభాషగా వస్తున్నదే; కాని దానితోనే కొత్త కాహళలవీ, దుందుభులవీ మ్రోతలు మ్రోగిస్తాడు; నవకవిత్వావరణలో మరొక కవిత్వోద్యమానికి ప్రతినిధిగా నిలబడ్డాడు. ఇతని అనుయాయులు అనేకులు. ఇతడు శబ్దాలమీదా, ఛందస్సులమీదా అమోఘమైన అధికారం చెలాయిస్తాడు."

— దేవులపల్లి కృష్ణశాస్త్రి

# శ్రీశ్రీ నాటికలు

— అద్దేపల్లి రామమోహనరావు

శ్రీశ్రీలో ఒక మహాలక్షణంఉంది. అది అతనికి రచనా శిల్పంమీద ఉన్న గౌరవం. అతని నరనరాల్లో అభ్యుదయ భావన జ్వాలా రూపంగా ప్రవహిస్తున్నప్పటికీ, అతని కవితాత్మ, ఆ భావనల నెప్పటికప్పుడు శిల్పావధికంగా వెలువరిస్తూ ఉంటుంది. నిజానికి ఏ మహాకవి లక్షణమైనా యిదే. భావజ్వాల ఉండి, దాన్ని అపూర్వ శిల్పంతో అందించలేనివాడు సామాన్యుడే ఔతున్నాడు. తన వస్తువుని పఠిత హృదయంమీద సమగ్రంగా హత్తింపగోరే మహాకవి, రచనాగతమైన అనేక రహస్యాల్ని నిరూపించవలసిఉంది. అంతరంగ చైతన్యాన్ని అనంతకవితా శిల్పజ్ఞానంతో నింపుకోవలసిఉంది. వస్తువుని యింకా యింకా ఉజ్వలంచేసేదే శిల్పం. అందువల్లే తీవ్రవస్తువాది, తీవ్రశిల్పవాది ఔతున్నాడు. వస్తుశిల్పాల అద్వైతస్థితి, మహారచనకి పునాది. శ్రీశ్రీ యొక్క అత్యున్నత శిల్పజ్ఞానంలోనుండి ఉద్భవించినవి అతని నాటికలు. బలమైనశైలి, అతిలోకమైన భావనాశక్తి, సాంకేతికనైపుణ్యమూ, మానవుని మూలవిలువల్ని ప్రశ్నించే ఆలోచనలరూపకల్పనమూ,—ఈ నాటికలకి ఒక విశిష్టతను చేకూరుస్తున్నై. మామూలుగా నాటికలు—పాత్రలు, సన్నివేశాలూ, రసనిర్వహణా మున్నగువానిమీద ఆధారపడిఉంటై. కాని శ్రీశ్రీ నాటికల్లో ఏదో ఒక ఉదాత్త భావమే అంతస్స్రవంతిగా ఉంటుంది. ఆ భావానికి శిల్పపుదుస్తులు తొడిగి నిలబెట్టడమే శ్రీశ్రీ ధ్యేయం. అతని భావవైచిత్రిని, దానికి దీప్తినిస్తున్న శిల్ప విలక్షణత్వాన్ని, వివరించడం ఈ వ్యాసలక్ష్యం.

శ్రీశ్రీ రేడియోనాటికలు 11. వీటిలో సుప్తాస్థికలు, ఒంటరిబావి, భూతాల కొలిమి-అనే మూడు, కేవలం కవితారూపమైనవి. గవేషణ, విదూషకుడి ఆత్మహత్య, గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు, గుమాస్తాకల, మరోప్రపంచం—అనే ఐదు, అభ్యుదయ భావచైతన్యం పునాదిగాగలవి. చతురస్రం, అనంతరయాత్ర, బలి—అనే మూడు నాటికలు, అలౌకికాలోచనా ప్రధానమైనవి. నిః

విలువల్ని అధిగమించిన ఊహలతోకూడి ఉన్నవి. ఈ మూడు విధాలుగా ఈ నాటికల్ని విభజించడం ప్రాధాన్య వివక్షచేతనేగాని, కవితా భావన, అభ్యుదయా లోచన, శిల్పదృష్టి మొదలైనవి సర్వనాటికలలోనూ ఆవరించుకుని ఉంటై.

# II

"సుప్తాస్థికలు" కవితాశిల్పదృష్టితో చూస్తే మొట్టమొదట పేర్కొన వల సిన రచన. ఇది గాంధీయొక్క మరణానికి ప్రజలు పొందిన దుఃఖాన్నీ, యావత్ ప్రపంచమూ పొందిన స్పందననీ తెలియజేస్తుంది. ప్రపంచమంతా స్పం దించిందన్న విషయాన్ని చెప్పడానికి కవి యిందులో చివరికి, రెండునక్షత్రాలు సంభాషించినట్లు చెప్పాడు. అనేక యోజనాల దూరానఉన్న రెండు నక్షత్రాల్లో సోదరియైన తార నిద్రపోతూ హఠాత్తుగాలేచి, తమ్మునితో గాంధీ మరణాన్ని గూర్చి చెప్తుంది. అది "హింసకీ అహింసకీ యుద్ధ" మంటుంది. నక్షత్రాలు మహాత్ముని మరణాన్ని గూర్చి మాట్లాడినట్లు చెప్పి, ఆయన మరణం సజీవ మానవ ప్రపంచాన్నే గాక, విశ్వాంతరాళ సమస్త గోళాల్ని కదలించిందని సూచి స్తున్నాడు కవి.

"నిద్రపోతున్న ఎముకలు"-అనేదాన్ని మరణానికి సంకేతంగా తీసు కున్నాడు. నాటిక ప్రారంభంలోనే "కవి" పాత్ర, శ్మశానాన్నీ, చీకటినీ, ఎము కల్నీ, వాటి బ్రతికిన దినాల తలపోతల్నీ వర్ణిస్తాడు. ఈ వర్ణన గీతపద్యాలలో, గ్రాంధిక భాషలో వ్రాయబడ్డది. ఈ వర్ణన కాగానే "ప్రకటన"లో లోకమంతా ఎవరి మరణంకోసం రోదిస్తోందని ప్రశ్న వెయ్యబడింది. కవి చెప్పిన పద్యాల్లోని శైలికీ, ఇక్కడ విషాదకంఠాల శైలికీ స్పష్టమైన భేదంఉంది. శ్మశాన వర్ణన చేసినదికవి. మహాత్ముని మరణానికి ఏడుస్తున్నది సామాన్యప్రజ. శైలిలో ఈ భేదం స్ఫురింప జెయ్యడం కవి మెలకువ సూచిస్తుంది. మొదటి వర్ణన

"అవిధరా గర్భమున మానవాస్థికా పరంపర !
సుప్త నిశ్శబ్ద సంపుటములు...."

ఈ విధంగా సాగుతుంది. విషాదకంఠాల రోదన

"ఏమని చెప్పమంటావు
ఎందుకేడుస్తున్నామో ?

ఎందుకేడుస్తున్నామో
ఏమో మాకే తెలియదు...."

ఇట్లా ప్రారంభింపబడుతుంది. భావోద్దీప్తికి రచనా విధానాన్ని జానిస చేసుకొనే పద్ధతి శ్రీశ్రీకి తెలుసు. సర్వ ప్రపంచం దుఃఖపడుతోందన్న భావాన్ని యిట్లా చెప్తాడు.

"ఒకళ్ళూ యిద్దరూ కాదు
ఒక కుటుంబం ఊరూ కాదు
ఒక నగరం ఒక రాష్ట్రం కాదు
ఒక దేశం ఒక ఖండం కాదు
సమస్త ప్రపంచం నేడు
సమగ్ర దుఃఖంతో మునిగిందయ్యా!"

సామాన్య ప్రజల నుడికారంనుండి ఉత్తమ భావదీప్తి కలిగించిన మొట్టమొదటి కవి శ్రీశ్రీ. విషాద కంఠాలు చివరికి "హిమాలయం మా హృదయ భారం, గంగానది మా కన్నీళ్ళు" అంటాయి. ఈ రెండు పోలికలలో, గాంధీమహాత్ముని భారతదేశైక్య భావనా, ప్రజా హృదయాలలో ఆయనయెడగల పవిత్రదృష్టీ, అద్భుతంగా ధ్వనిస్తున్నై. శ్రీశ్రీ కొద్దిమాటల్లో ఎంతో భావాన్ని ధ్వనింపజెయ్యగలకవి.

ఇక్కడ కవి మూడు పాత్రల్ని ప్రవేశపెట్టాడు. సంధ్య, అంధకారమూ, నక్షత్రం. ఈ మూడూ వరుసగా మృత్యువుకీ, నిరాశకీ, ప్రేమకీ సంకేతాలు. సంధ్య "ఔద్ధత్యముననే నహర్పతిన్ మ్రింగితిని" అంటుంది. ఇక్కడ అహర్పతి గాంధీమహాత్ముడు. అంధకారం

"నే బయలుదేరిన యంత
జగతి ఏమోగాని నగవే మరచిపోయి
వగపుచే తపియించు...."

అంటుంది. ఈ మరణాన్నీ, నిరాశనీ ప్రేమ జయిస్తుంది అని కవి నక్షత్రం మాటల్లో సూచిస్తాడు. నక్షత్రం

"వాగులైనా ప్రేమ
వరియించునే నిన్ను"

అంటుంది అంధకారంతో ? సకల ప్రాణుల్నీ సమానంగా ప్రేమించగల మహాత్ముని స్వభావం మనకి పంక్తుల్లో వినిపిస్తుంది. తర్వాత ఒక బృందగానంలో కవి

"ఎముకల నిద్రలో
ఇంపైన కలలు"

అంటాడు. ఈ బృందగీతిలోనూ మహాత్ముని స్వభావమే వ్యంగ్యం. ఎముకల నిద్ర మరణం. మహాత్ముడు మరణించినా అతని అనశ్వరాత్మ ఆకాశాల నాక్రమించిందంటాడు కవి. ఇంపైన కలలు—ఆ అనశ్వరాత్మకు సంబంధించినవి. ఇట్లా ఈవర్ణనలన్నీ పరోక్షంగా భావాల్ని చిత్రిస్తై. ఇక్కడ సంధ్య, అంధకారము, నక్షత్రాల మాటలూ, తర్వాత బృందగీతమూ గేయ రూపంగా, గ్రాంధికభాషలో ఉంటై. మళ్ళీ వెంటనే గాంధీని వర్ణించే ప్రజాకంఠాన్ని మామూలు మాటల్లో చెప్తాడు.

"అతడు సామాన్యవ్యక్తి
అతడు సామాన్యవ్యక్తి
తృణంకన్నా తేలిక
మేరువుకన్నా ధీరుడు...."

ఇట్లా శైలి భేదాన్ని, భావభేదానికి స్పష్టమైన సూచనగా వ్రాయడంలో శ్రీశ్రీ అసమానుడు.

ఇట్లా ఈ సుప్తాస్థికలలో ఎక్కడా గాంధీని ప్రత్యక్షంగా చెప్పకుండా, ఆయన స్వభావాన్నీ, ఆయన మరణానికి ప్రజలుపొందిన వేదననీ, ఆయన శాశ్వతత్వాన్నీ, పరమ కవితాశక్తితో, భావనావధికంగా కవి వర్ణిస్తాడు.

"ఒంటరిబావి"—ఆత్మహత్య చేసుకున్న ఒక పదేండ్ల అమాయకురాలి మీద అపవాదానికి సంబంధించిన గేయరచన. నరిసిగాడు ఆమెను బలవంతం చెయ్యబోవడంచేత, ఆమె బావిలోపడ్డదని లోకం అనుకుంటుంది. మూడు కథన కంఠాల ద్వారా కథ చెప్తాడీ నాటికలో కవి. కథ సగంవరకూ భయంగరమైన బావి వర్ణన. ఈ బావిని వర్ణించడంలో కవి పరమార్థం, అపవాదుయొక్క భయంకరత్వాన్ని స్ఫురింపజెయ్యడం. అందుకే బావిని ఎంతసేపు వర్ణించినా అసందర్భంగా కనిపించదు. నాటిక ప్రారంభమే యిట్లా ఉంటుంది—

"నోరావులించి
ఊరికి దూరానపొంచి
నీరింకిపోయి నిలుచుందొక ఒంటరిబావి !"

నోరావులించి-అని నాటికను ప్రారంభించిన శ్రీశ్రీ శిల్పరహస్యాన్ని ఆకళించుకున్నవాడు. అమాయకురాలైన ఆమెను మ్రింగివేసి అపవాదుల్ని సృష్టించింది ఈ బావి. కథలో ముఖ్యమైన భీకరపాత్ర ఈబావి. అందుకే నాటిక అంతం గూడా ఇట్లాచేస్తాడు-

"ఎందుకో ఆబావినిచూస్తే అందరికీ భయం" ఈబావి అపవాదులయొక్క భయంకరత్వానికి సూచకమనే విషయాన్నిగూడా ఒకచోట స్పష్టంగా తెలియజేస్తాడు-

"ప్రజల నోళ్ళల్లోపడి ఆకథలే
బావిరూపు తాల్చాయేమో !"

ఇది ఉత్ప్రేక్షగా కనిపిస్తూ, అపవాదుల బీభత్సాన్ని ధ్వనిస్తోంది. ఇట్లా ఆమాయకురాలి ఆత్మహత్యలోని దారుణత్వాన్ని బావియొక్క వర్ణనద్వారా సాధిస్తాడు కవి.

"భూతాలకొలిమి" హత్యచేయబడిన తనప్రియుడు పిలువగా, నిర్భయంగా శ్మశానానికి పోతూ. ఎవరాపినా ఆగని ఒక స్త్రీయొక్క వేదనను వర్ణిస్తుంది. ఒక గొంతుక ప్రశ్నిస్తుండగా, స్త్రీ కంఠం సమాధానం చెప్తుంది. ఇందులో నాయికయొక్క హృదయార్పణ స్పష్టంగా కనిపిస్తుంది. ముఖ్యంగా గేయంయొక్క నడకలోని వేగంతో ఆమె హృదయ వేగాన్ని పఠితలచేత అనుభవింపజేస్తాడుకవి-

"నిన్నరాతిరివేళ
కన్ను తెలియని చిమ్మ
చీకట్లు చీల్చుకుని
నే తిరుగుతుండగా
నమ్మండి నమ్మండి
నాకు కనిపించాడు"

ఇట్లా గేయమంతా పరుగుపెడుతుంది. అదిగాక మధ్యలో ఉండుండి-

"పోవాలిచేరగా భూతాలకొలిమి
సందు చివరా ఉన్న భూతాలకొలిమి"

అని మళ్ళీమళ్ళీ చెప్పడం నాయిక యొక్క హృదయనిశ్చయాన్ని తెలియ జేస్తుంది. ఈ పంక్తుల పునరుక్తి ఈ నాటికలోని పరమార్థం. నాయిక అదొక్కటే నిర్ణయంతో పరుగులు పెడ్తోంది. ఆమె సమస్త జగత్తునీ మఱచిపోయింది. ప్రాణాలమీద ఆశను వదిలేసింది. తనకు ప్రియుడుకనిపించి, ముద్దు పెట్టుకున్నాడని చెప్తూ, అతనికొఱకు పరుగెత్తుతుంది. ఆమె పరుగు గేయంలోని ప్రత్యక్షరంలో ఉంది.

ఇట్లా సుప్తాస్థికలు, ఒంటరిబావి, భూతాలకొలిమి–ఒక భావానికి ఉదాత్త కవితా రూపకల్పనలు. మిగిలిన నాటిక లింత స్వచ్ఛకవితా రూపాలుకాకపోయినా, ప్రతి నాటికలోనూ కవితా స్పందన అంతర్గతంగా ఉండనే ఉంటుంది. ఆ కారణం చేత, చాలా నాటికల్ని కవితా రూపకా లనవచ్చును.

## III

"గవేషణ" నాటికలో మానవుణ్ణి మృత్యుదూతలు తీసుకు వెళ్తారు. ఇతనికింకా ఆయుర్దాయం ఐదేళ్ళుండగానే పొరబాటున వాళ్ళొచ్చి అతని ఆత్మను మరో ప్రపంచపు న్యాయమూర్తి దగ్గిరికి తీసుకుపోతారు. ఆ న్యాయమూర్తి తన పొరపాటు నొప్పుకొని పంపివేస్తుంది. కాని అతను తన ఊరు వెళ్ళేటప్పటికి అతని శరీరం దహనంఔతుంది. ఆత్మరూపియై మళ్ళీ న్యాయమూర్తి దగ్గరకు పోగా, ఆమె ఒక ప్రసవిస్తున్న స్త్రీ కడుపులో శిశువు చనిపోగా, ఆ శిశువులో ప్రవేశించమని చెప్తుంది. మానవుడు ప్రవేశిస్తాడు.

ఇది మామూలుగా, ఒక్కొక్కప్పుడు యమదూతలు పొరపాటున మనిషిని తీసుకు వెళ్తారనే ప్రవాదం నుండి నిర్మించబడిన కల్పన. ఈ ప్రవాదంలో నుండి అద్భుతమైన భావన చేశాడు శ్రీశ్రీ. మానవునికీ సంబంధించిన నిజాల్ని చెప్దామనుకున్నాడు శ్రీశ్రీ. మానవత్వం చచ్చిపోలేదు. మానవుడు బ్రతికిఉన్నాడు–అన్నది కవి నిరూపింపదలచిన అంశం–అందుకే నాటికలో చిట్టచివరి మాటయిది–"నేను చచ్చిపోలేదు. నమ్మండి. నేను బతికేఉన్నాను!". మానవుని శాశ్వతత్వాన్ని గూర్చి చెప్పడానికే ఇందులో నాయకుడికి మరోపేరు పెట్టకుండా "మానవుడు" అన్నాడు కవి. మానవుడు బ్రతికి ఉన్నాడు అనే అంశం నాటిక

నిండా మళ్ళీమళ్ళీ గుర్తుచేయబడుతూ ఉంటుంది. మృత్యుదూతలు కొంతసేపు మానవుడు మరణించాడని వాదించి. చివరకు అతను బ్రతికి ఉన్నట్లుగా ఒప్పుకుని "నువ్వు జీవించే ఉన్నావనడానికి మాకేమీ సందేహంలేదు. మానవుడా! జీవించు!" అంటారు. దీన్నిబట్టి కవి నిత్యమానవతా జీవనాన్ని ధ్వనింప జేస్తు న్నట్లు తెలుస్తుంది.

ఈ మానవుడు నిత్యం జీవించడాన్నే గాకుండా, మానవుడుగా జీవించాలని కోరతాడు. మరొకబ్రతుకతని కక్కరలేదు. ఈ సత్యాన్ని గూడా చిత్రంగా చెప్తాడు కవి. మానవుని శరీరం దహనంచెయ్యబడ్డతర్వాత, అతను గబ్బిలం, కప్ప మొదలైన శరీరాల్లో ప్రవేశించాడు. కాని ఆబ్రతుకు దుర్భర మనిపించింది. అందుకే

"నాకు మిగిలిన ఐదేళ్ళూ నాబతుకునేను బతకక్క-
ఇంకో జంతువుని ఎందుకుకావాలి నేను ?"

అంటాడు. అంతేగాక మరొకమనిషి శరీరంలో ప్రవేశించడం గూడా అతని కిష్టం లేదు.

"వాడి అలవాట్లు, వాడి ఆలోచనలూ అన్నీ వాడివే. పోనీ ఎలాగో కష్ట పడి వాటినే అవలంబిస్తాననుకో. అప్పటికీ నాది అబద్ధం బతుకేఅవుతుంది." ఇట్లాంటిబ్రతుకు మానవునికక్కర్లేదు. తాను తానుగా ప్రత్యేకతతో బ్రతకాలి మానవుడు. అందుకే చివరికి, శిశువు మృతదేహంలో ప్రవేశించడాని కతడంగీక రించాడు. ఎందుకంటే శిశువుకింకా స్వభావం స్థిరపడదు కనుక.

లోకంలో చిత్రంగా చెప్పుకునే ఒక విషయం ఆధారంగా మానవతా సందే శాన్ని వ్యక్తం చెయ్యగలగడం ఈనాటికా కల్పనలోని శిల్పం. ఈ నాటికలో ఇంకా దేవతలకంటె మానవు డుత్తముడనే నిరూపణఉంది. ఒక దివ్యుడంటాడు.

"మానవుడివికాబట్టి నీకుదేవతల శక్తిమీద విపరీతమైన విశ్వాసంఉండటం సహజమే. కాని దేవాధిదేవులుగూడా పురోగమనశీలమైన కాలాన్ని వెనక్కి మళ్ళించలేరు!" అందుకే, యింకా బ్రతకవలసిఉన్న మానవుడికాలాన్ని దేవత లపహరింపలేకపోయారు. మానవుడు ఎంతోప్రయత్నంచేసి ధర్మదేవత ఎదుట నిలిచి, ఒక శిశువు దేహంలో ప్రవేశించగలిగాడు. ఇది మానవ ప్రయత్న తీవ్ర

తను తెలియజేస్తుంది. ఇట్లా ఈ నాటిక శాశ్వత మానవత్వాన్ని ధ్వనిరూపంగా తెలియజేసే ఉత్తమరచన.

"విదూషకుడి ఆత్మహత్య"—ఒక నటుని విషాద కథ. లోకాన్ని తన హాస్యంతో అమితానందపరిచి, నిజజీవితంలో అప్పులపాలై, సంసారభారం మొయ్యలేక విషం తాగి చనిపోయిన విదూషకుడు నాయకుడు. ఇది విదూషకుని కథ గనుక, చాలాహాస్యపూరితంగా ప్రారంభింపబడుతుంది. అసలు నాటికలో మూడుపాళ్ళు హాస్యమే ఉంటుంది. విదూషకుడు ఆత్మహత్య చేసుకోబోతూ వ్రాసిన ఉత్తరం మాత్రం విషాదగంభీరంగా ఉంటుంది. విదూషకుడు జీవితమంతా యితరుల్ని నవ్వించాడు; సముద్రమంత కన్నీటిని గుండెలో దాచుకున్నాడు. ఈ నాటికగూడా చాలాసేపు నవ్విస్తుంది! విదూషకుని ఉత్తరం ఒక్కటీ ఏడిపిస్తుంది. ఇది ఈ నాటికలోని శిల్పచమత్కృతి. ముందుగా ప్రయోక్త, ఆటంకం—అనే రెండు పాత్రలు ప్రవేశిస్తై. ప్రయోక్త నాటకం ప్రారంభిస్తాననడం, ఆటంకం అడ్డుతగలడం—చాలాసేపిట్లా గడుస్తుంది. చివరకి ఆటంకం "అదిగో గడియారం!" అనగానే "గడియారం!" అని విదూషకుణ్ణిపిలుస్తూ సత్యంఅనే పాత్ర ప్రవేశిస్తుంది. ఇది సంస్కృత నాటకాల్లో పాత్ర ప్రవేశం ప్రస్తావననుండి జగిగే పద్ధతిని గుర్తుకు తెస్తుంది. ఇది సంస్కృత నాటకాన్ని అనుకరించడంకాదు; అది గుర్తు తెప్పించి నవ్వించడం. సత్యం మొదలైన పాత్రలు రంగంమీద ప్రవేశించినా, ప్రయోక్త, ఆటంకం—మాట్లాడుకుంటూనే ఉంటారు. మిగిలిన పాత్రల మాటలనుండి నిజాల్ని గ్రహిస్తూ ఉంటారు. ఈ పద్ధతిలో నాటిక వ్రాయడం బాగా హాస్యాన్ని సృష్టించడానికి. హాస్యానంతరం విదూషకుడిహత్య దగ్గిరకి వచ్చేటప్పటికి కవి మెలకువ ప్రశంసనీయమైనది. ప్రయోక్త అంటాడు—

"ఇకనువ్వు మాట్లాడ్డం మానేసి రంగుకడిగేసుకోవచ్చు. వేళాకోళాల వేళ దాటి పోయింది. మరణం సమక్షంలో వినయం అవసరం!"

విదూషకుడు చనిపోతూ వ్రాసిన ఉత్తరం గొప్ప Passages లో ఒకటి. ప్రారంభమే హృదయాన్ని స్పందింప జేస్తుంది.

"మైడియర్ ఆంజనేయులూ! నేను నిష్క్రమిస్తున్నాను. (ఈ పదం నాటకంలోపాత్ర నిష్క్రమణాన్ని పఠితకి స్ఫురింపజేస్తుంది) ఇవాళ నేను పుట్టిన

రోజు: అందుచేత పోతున్నా. మరణానికి ఇవతల వేపున్నంతకాలం నేను చిరునవ్వుని ఆరాధించాను. చిన్నప్పుడు మృచ్ఛకటికంలో వేషంవేసింది మొదలుకొని మొన్నరాత్రి కన్యాశుల్కంలో బైరాగి వేషం వేసిందాకా లోకాన్ని నవ్వించడానికే ప్రయత్నించాను........" ఈ విదూషకుడు తాను బాధపడుతూ లోకాన్నినవ్వించడంలో, మృచ్ఛకటిక, కన్యాశుల్కం నాటకాల్ని స్మరించడంలో ఒక మహా రహస్యం ఉంది. ఆ రెండు నాటకాలూ, హాస్యరసంతోనిండిఉండి, లోకం యొక్క దారుణస్థితిని వ్యంగ్యంచేస్తై. శ్రీశ్రీ కన్యాశుల్కాన్నిగూర్చి రాస్తూ "అది బీభత్స రస ప్రధానమైన హాస్య నాటకం" అంటాడు. ఇది విదూషకుడి పాత్రలోని అద్భుతధ్వని. కన్యాశుల్కం నాటకమే, మృచ్ఛకటిక నాటకమే ఈ విదూషకుడు!

ఈ నాటికలోని మరో చమత్కారం ఏమిటంటే విదూషకుని ఉత్తరం చదివేసింతర్వాత, విదూషకుడు రంగం మీదికి వస్తాడు. ఇప్పుడు గొప్పహాస్యం వస్తుంది నాటికలో. చివరికి విదూషకుడు "బతికి చచ్చిపోయాను; చచ్చి బతికి పోయాను" అంటాడు తన హాస్యధోరణిలో. విదూషకుని ఉత్తరం ఒక్కదాన్నీ కన్నీరు కారేట్లువ్రాసి, మిగిలిందంతా హాస్యంగా వ్రాయడం, విదూషకుణ్ణి గూర్చిన నాటకానికి ఉచితమైన శిల్పం. ఆ విదూషకుడు దుఃఖంచుట్టూ అల్లబడిన హాస్యంతోకూడినవాడు: ఈ నాటిక విషాదపుజాబుచుట్టూ అల్లబడిన హాస్యం.

"గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు" ఒక విప్లవభావాన్ని సూచిస్తుంది. సూత్రధారుడు వచ్చి, తాము రేడియోలో "తుదిపలుకు" అనే రికార్డు నాటికను వేస్తున్నామని తెలియజేస్తాడు. ముందు రికార్డు వెయ్యగానే అది చెడిపోయినట్లు గ్రహించి, ఆపేసి ఏదో చెప్తాడు. మళ్ళీ ఇంకో రికార్డువేస్తే, అదీ చెడిపోతుంది. మళ్ళీ ఆపేసి ఏదోచెప్పి, యింకో రికార్డువేస్తాడు. ఇట్లా నాలుగైదుసార్లు జరిగిన తర్వాత, ఒక రికార్డు తిరుగుబాటు చేస్తుంది.

"హహ్హహ్హ! నేను పాడుతాననే వేశావా రికార్డు? మందమతీ! ఇంకా యిందులో పాటదాగున్నదనే నీఉద్దేశం? ఎంతకాలం ఇలాపాటలను బంధించుకున్నారు మీరంతా? పాటలన్నీ పారిపోయినై. మీరుకోరినప్పుడల్లా మీకోసం ఇక పాడవు—" అంటుంది. సూత్రధారుడు కొంతసేపు వాదిస్తాడు. చివరకు డె రెక్టరువచ్చి పొరపాటున విరిగిపోయిన రికార్డులు కుర్రాడు తెచ్చాడనిచెప్పగా,

సూత్రధారుడు తానే గొంతుమార్చి రికార్డు మాట్లాడినట్లు మాట్లాడి కాలం గడిపే శానని చెప్తాడు. ఈ నాటికలో ఉన్న గొప్పతనమంతా రికార్డును తీసుకోవడంలో ఉంది. రికార్డు మానవుడిచేతులో కీలుబొమ్మ. అతని ఇష్టప్రకారం ఒకేగాడిలో తిరుగుతూ పాటపాడుతుంది. ఈ రికార్డు సంఘంలోని దోపిడీదారులకు బానిస లైన మానవులకు సంకేతం-గుడ్డిగా ఒకే గాడిలో పోయే మనిషికి రికార్డుని మించిన సంకేతంలేదు. రికార్డుకీ, సూత్రధారుడికీ కల్పించిన సంభాషణలో కవి విప్లవ భావాల్నిగూర్చి చెప్తాడు. రికార్డు ఈ విధంగా అంటుంది—"తిరుగుబాటుచేసిన గ్రామఫోన్ప్లేట్ల నాయకుణ్ణి. పీడిత సంగీతలోకపు హక్కులను అక్కడ పెట్టండని నిలవేసి అడగడానికి వచ్చాను" ఇట్లాగే సమ్మెలనుగూర్చి, విప్లవాన్నిగూర్చి మాట్లాడుతుంది. చివరికి రికార్డులు మాట్లాడటం అసందర్భం గనుక, ఒక చమత్కార కల్పనచేసి సూత్రధారుడే గొంతుమార్చి మాట్లాడినట్లుగా చెప్పాడు కవి. ఒక్క ఉపమానంలో నుండి పెంచబడిన నాటికయిది.

"గుమాస్తాకల" శ్రీ జె. కోనేటి రావు పంతులుగారు, ఆఫీసు గొడవల్తో పెళ్ళాం బిడ్డల గోలతో మనస్సుకి శాంతి లేకుండా బాధలుపడుతూ, నిద్రా సమయంలో పొందిన అద్భుతమైన కల నిరంతరం సంసార బాధలతో సతమతమయ్యే కోనేటిరావులాంటి అల్పజీవికి కలలే ఆధారం. జాలి పడవలసిందేమిటంటే, ఆ కలలు గూడా పూర్తిగా సాగవు. మధ్య మధ్యలో పిల్లల గోల వల్లనో, ఇతర గోలల వల్లనో మెలకువవచ్చి నిద్ర చెడిపోతూ ఉంటుంది; కల గూడా దూరమౌతూ ఉంటుంది. ఈ నాటికలోని శిల్పం అంతా రెండు పాత్రల మీద ఆధారపడిఉంది. ఒకటి కోనేటిరావు మనస్సులోని భయమూ, రెండోది ఆశ. కోనేటిరావు నిద్ర పోగానే యివి రెండూ మాట్లాడుకుంటై. నిజానికి అతని వంటి ప్రతి సామాన్యుడికీ, జీవితమంటే భయమూ, భవిష్యత్తుమీది ఆశ—యివి రెండే ప్రధాన భాగాలుగా ఉంటై. ఆ రెంటినీ పాత్రలు చేశాడు కవి. ఆ రెంటి సంభాషణలో శ్రీశ్రీ చాలా మెలకువ చూపాడు. భయం ఎప్పుడూ ప్రశ్నలు వేస్తుంది; భయంచూపుతుంది; ఆశ్చర్యపోతూఉంటుంది. ఇక ఆశఅన్నీ ధైర్యంగా చెపుతూఉంటుంది. ఇట్లా ఆశా, భయ లక్షణానుగుణంగా వాటి సంభాషణ వ్రాయడంలోచాలా జాగ్రత చూపాడు కవి. కోనేటిరావు కలల్ని ఆశ చెప్తూ ఉంటుంది. నిజానికికల, ఆశాలక్షణమేగదా !

మొదటికల కోనేటిరావుని అమెరికా ఆహ్వానిస్తుంది. అక్కడ సన్మానంలో అతను మాట్లాడుతుంటే చంటిపిల్లల గోలతో లేస్తాడు. భార్యమీద విసుక్కుని మళ్ళీ గుర్రుపెట్టగా ఈసారి జర్మన్ సబ్ మెరీన్ కమాండరై యుద్ధంలో ఘన విజయం పొందుతాడు. పిల్లి పాలగిన్నెను తోసిన చప్పుడికి లేచి, మళ్ళీ పెళ్ళాం మీద విసుక్కుని పడుకుంటాడు. ఈసారి కల స్వప్నసుందరినిగూర్చి. కోనేటి రావు ప్రేమగానం చేస్తూఉండగానే, కొడుకు తెల్లారిపోయిందని లేపుతాడు. భయం "కొండెక్కి పోయింది కోనేటి నిద్ర" అంటుంది. ఆశ "కోనేటి నిద్రలో కోడి కూసింది" అంటుంది. కోనేటి మూడు కలలు కన్నాడు. ఒకటి విజ్ఞానాన్ని గూర్చి, రెండోది వీరత్వం గూర్చి, మూడోది సౌందర్యం గూర్చి. ఈ మూడు కలలు కోనేటిరావులాంటి వాళ్ళకి ముఖ్యమైనవి; జీవితంలో దొరకనివి. ప్రతి వ్యక్తీ సాధించవలసినవి. అందుకే శ్రీశ్రీ యీ మూడు కలల్నీ తీసుకున్నాడు ముఖ్యంగా. వీటిని సాధించలేకపోవడానికి కారణాల్ని గూడా నాటికలో ఆశా భయాల సంభాషణలో చెప్పాడు.

ఆశ : అతని నిజమైన జీవితం ఒక స్వప్నం. అతని స్వప్నం ఎన్నడూ సాధ్యంకాని అబద్ధం.

భయం : నాకు చాలా జాలిగా ఉంది.

నీదొంగ వేషాలు కట్టిపెట్టు. కోనేటిరావును నువ్వే ఈ దుస్థితికి తీసుకొచ్చావు.

భయం : నేనా ?

ఆశ : నువ్వుగాక మరెవ్వరు ? నువ్వతని భయానివి. తన నీడని చూచి తాను భయపడే దుస్థితిలో పెట్టావతణ్ణి.

ఆశాభయాల్ని పాత్రలుగాచేసి, కోనేటిరావు జీవిత దౌర్భాగ్యాన్నీ. దాని కారణాల్నీ ధ్వనింపజెయ్యడం ఈనాటికయొక్క రహస్యం. ఇదిగూడా బీభత్సరస ప్రధానమైన హాస్య నాటిక.

"మరో ప్రపంచం" అన్న నాటిక ఇరవై ఒకటవ శతాబ్దిలో భావి మానవుణ్ణి ఊహించి వ్రాసినది. శాస్త్రీయ విజ్ఞాన పురోగతివలన మానవుడు ఎంతో విచిత్రంగా మార్పు పొంది, కవి మానవునిలో ఆశించే భావి సద్గుణాలన్నీ

ఫలవంతమైతే, ఆ భావిమానవుని ఊహాచిత్రం మన కీనాటికలో కనిపిస్తుంది. ఈ నాటిక ఒక యువకవి మెదడులో, అందలి సుప్తచైతన్య రంగంలో జరుగు తుందని మొట్టమొదట చెప్తాడు కవి. అంటే ఈ నాటికలోని 21 వ శతాబ్ది మానవుణ్ణి కవి Dream చేస్తున్నాడన్నమాట.

21 శతాబ్ది మానవుడు ఈనాటి మానవ శరీరంతో ఉండడు. ఒక ఆకు పచ్చని గాజు బంతివలె ఉంటాడు. ఆకుపచ్చదనం శ్రీశ్రీ రచనల్లో అనేకచోట్ల కనిపిస్తుంది. ఇది పుష్టికి, సమగ్రతకి సంకేతం. ఆకుపచ్చని గాజు బంతిలా వున్న మానవుడు, కేవలం జడ పదార్థమైన బంతిలా కన్పించడు. అతణ్ణి చూచిన వాళ్ళిలా అనుకుంటారు.

1 వ గొంతుక—అదంతా ఒక పెద్ద కన్నులాగుంది.

2 ,, —కాదు. అంతా ఒక చెవి.

3 —అదే దాని....

అంటే, ఆ శరీరంలో ప్రతి అవయవంయొక్క సద్యస్ఫురణ ఉందన్నమాట! ఏ అవయవాన్ని భావిస్తే అదే శరీరమంతా ఔతుందన్నమాట. ఈ ఆకుపచ్చని గాజుబంతికి కవి "కనుపాప" అనే పేరు పెట్టాడు. అంటే మనకు భవిష్య న్మార్గం చూపే కనుపాప ఆ మానవుడు. ఆ భవిష్యన్మానవుడు భవిష్యత్తులోకి గూడా ప్రయాణం చెయ్యగలడు. అతనిలోని అంతర్యంత్రాలను కదిలిస్తే కోరిన చోటికి, కోరిన కాలంలోకి వెళ్ళిపోగలడు. అతడెప్పుడూ భవిష్యత్తులోకే వెళ్ళాడు. కాని యంత్రాలు కదిలించడంలోని చిన్న పొరపాటు వల్ల భూతకాలంలోకి వచ్చాడు. ఈ కనుపాపకి మరణంలేదు. "మేము కాలంలో జీవిస్తాము. కాలాన్ని అర్థం చేసుకున్నవాళ్ళకి మరణంలేదు" అంటాడా భావిమానవుడు. అతనికి ఆకలి లేదు. సూర్య కిరణాలనుండి శక్తిని గ్రహించి బ్రతుకుతాడు. భావి మానవులకి భాషలేదు. ఒకరి ఊహలొకరికి భాష అవసరంలేకుండా అందుతూ ఉంటై. వాళ్ళు సమష్టి మీదనే ఏ విషయమైనా అర్థం చేసుకోగలరు. సమష్టి బాధ్యత వ్యక్తిత్వం హరించనక్కరలేదని భావి మానవుడు చెప్తాడు. ఈ విధంగా శాస్త్రీయ పరిజ్ఞానం ఫలితంగా ఒక విచిత్ర భవిష్యన్మానవుణ్ణి శ్రీశ్రీ కలగంటున్నాడు.

ఈ నాటికనిండా శ్రీశ్రీ కనుపాపను చూచిన యువక కంఠాలకీ, అతణ్ణి చూడని వృద్ధకంఠాలకీ వాదన నడుపుతాడు. వృద్ధకంఠాలు వేదాంతం జీర్ణించు

కొని వెనక్కినడుద్దామని బోధించే తిరోగమనవాదులకి సంకేతం. "వెనక్కికాక పోతే మాకు భవిష్యత్తులో ఏముందిగనుక?" అంటారువాళ్ళు. యువకకంఠాలు ప్రగతివాదులు. నిరంతరపురోగమనం వాళ్ళధ్యేయం. భవిష్యత్తు వారి బంగారు కల. దానికభిముఖంగా నడుస్తామంటారువాళ్ళు. శ్రీశ్రీ, తాను మహాప్రస్థానంలో వ్రాసిన "మరోప్రపంచం" అనే మొట్టమొదటి గేయాన్ని ఈనాటికంతటా మధ్య మధ్యలో యువకంఠాలనోట పాడిస్తాడు. నిరంతర పురోగమనమే ఈ నాటిక యొక్క ప్రధానధ్వని. అందుకు "మరోప్రపంచం" గేయం బాగా సహాయపడు తుంది. శ్రీశ్రీ తానుకోరిన మరోప్రపంచం స్వరూపాన్ని ఈ నాటికద్వారా చెప్తున్నట్లున్నాడు. కాని, ఈ నాటికలో ఆ మరోప్రపంచం, కేవలం సామ్యవాద సమాజంగా చెప్పబడలేదు. శాస్త్రీయ ప్రగతికే ప్రాధాన్యమీయబడింది. సమష్టి భావాన్ని మాత్రం గ్రహించి. సర్వశక్తిమంతుడైన మానవస్వరూప చరమదశ; అన్ని రాజకీయాల్నీ, సిద్ధాంతాల్నిదాటిన ఒక మహా ఊహా మానవనిర్మాణం యిందులో భావించబడింది. ఇందులో కవి ఊహించిన ప్రతి అంశమూ ఈనాటి మానవునికలకు రూపకల్పనగా ఉంటుంది.

ఇందులో వృద్ధయువక కంఠాలవాదనలో యువకకంఠాలచేత Marching Song లాంటి "మరోప్రపంచం" గేయాన్ని పాడిస్తూ, వృద్ధకంఠాలచేత ఈ క్రిందివిధంగా వచనగేయం అనిపిస్తాడు—

"ఏయ్ టాక్సీ వెనక్కి యింకావెనక్కి
గోడ కనబడలేదా పోదాంవెనక్కి...."

ఇట్లాసాగుతుంది. తీవ్రలయబద్ధమైన "మరోప్రపంచం" గేయం యువకుల తీవ్ర స్వభావాన్ని తెలియజేస్తుంది. ఈ వచనగేయం చప్పబడి చల్లారిన వృద్ధుల నిర్వీర్యత తెలియజేస్తుంది. ఈ నాటికలన్నింటిలోనూ శ్రీశ్రీ మధ్యమధ్యలో వచ్చే గేయరచనలో చాలా శ్రద్ధవహించాడు. లయవిషయంలో ఉన్న భేదాన్ని, గ్రాంధిక వ్యావహారిక భాషా భేదాన్ని, భావంలోని భేదాలకు సముచితంగా ఉపయో గించుకొన్నాడు. ఈ గేయశైలి వినియోగం ఆలోచనాపూర్వకంగా చేసినట్లు కని పిస్తుంది. ఇది శ్రీశ్రీ శిల్పదృష్టిని తెలియజేస్తుంది. ఈ నాటికలో వృద్ధకంఠాల భాష చాలా నీరసంగా మామూలుపదాలతోకూడి ఉంటుంది. యువకంఠాలభాష తీవ్రమైన పదజాలంతో, ఆలంకారికమైన భావనతో వెలువడుతుంది. ఈనాటి ప్రపంచకల్లోలాల్ని యువకంఠాలు "ఇదీ మన ప్రపంచం!" అంటూ వర్ణించిన

రెండు పేజీల వాక్యాలు. తెలుగుసాహిత్యంలోనే ఎన్నదగినశైలికి ఉదాహరణలు. రెండుమూడు వాక్యాల్ని ఉదాహరిసాను—

"ఇదీ మన ప్రపంచం !

ధనస్వామిని రక్షించడానికి న్యాయవాదులశక్తి యుక్తులూ, రాజకీయ వాదుల నక్కజిత్తులూ, విజ్ఞానవేత్తల తెలివితేటలూ, అన్నివేళలా పారా యిస్తాయి....

ఇదీ మన ప్రపంచం !

విప్లవపద్ధతులలో తరిఫీదిచ్చే విశ్వవిద్యాలయాలు లేకపోవడంవల్ల, విద్యార్థులు పరీక్షాపత్రాల్ని పాస్‌మార్కుల ద్వీపానికి తీసుకుపోయే పడ వలుగా మాత్రమే పరిగణిస్తారు........

ఇదీ మన ప్రపంచం !

ఆపాదమస్తకంరుజాగ్రస్తమైన ఈ ప్రపంచంలో సర్వవేళలా సమాజా నికి అంతఃకరణలుగా పనిచెయ్యవలసిన కవులుసైతం, సామాజిక శరీ రంలో బ్రహ్మరంధ్రందాకా పర్యాప్తమయ్యే సుషుమ్నానాడిగా స్పందించ వలసిన కవులుగూడా స్తంభించిపోతారు...."

ఈ నాటికలో ప్రస్తుత సమాజంలోని లోపాల్ని అతితీవ్రంగా వెల్లడించినకవి, ఈలోపాలులేని సమాజస్వరూపాన్ని ఊహించకుండా ఒక్కసారి, భవిష్యన్మాన వుని ఊహాచిత్రంలోకిపోతాడు. కాని, కవి ప్రత్యక్షరంవెనుకా ఆశించిన పురో గమన భావం అంతఃప్రవాహంగా చివరవరకూ నిలుస్తుంది. "పదండిముందుకు" అన్న భావాన్ని మనహృదయంలో మేలుకొలపడమే ఈ నాటికనో కవిధ్యేయం. కళ్ళయెదుట మనంచూసే దారుణ సమాజాన్ని వర్ణిస్తూ, అతిలోకమైన భవిష్య న్మానవుణ్ణి ఊహించడం, నేలకూ నింగికీ ముడిపెట్టినట్లుంటుంది. గాని, ప్రత్య క్షరం పురోగమన తీవ్రతతో మండిపోతూ ఉండటం ఈ నాటిక విశిష్టత.

## IV

"చతురస్రం" నాటికగూడా 21వ శతాబ్దిలోని మానవుణ్ణి గూర్చినఊహాయే. కాలాన్నీ, మరణాన్నీ జయించడమూ. మానసిక స్వాతంత్ర్యాన్ని సాధించడమూ అనే విషయాన్ని తీసుకుని, కవియిందులో ఒక అద్వైత భావాన్ని స్థాపిస్తాడు.

అందుకే 1 + 1 = 1 అని పేరుపెట్టాడు. సిరి అనే పేరుగలుకప (శ్రీ అనేదాని వికృతి యిది. శ్రీశ్రీయే ఈ పేరులో ధ్వనిస్తున్నాడు) "నీవూనేనూ ఒకటే.... గణనాని కతీతభాషలో ఒకటీ ఒకటీ ఒకటే" అంటాడు. ఇట్లా అద్వైతభావాన్ని నిరూపించడం నాటిక పరమార్థం. (ఇక్కడ అద్వైతమంటే అద్వైత మతం కాదు. సర్వమానవ ఐక్యభావం) ఈ అద్వైత భావాన్నే నాటిక చివర కవి రెండునుగూర్చి పాడిన పంక్తుల్లో అక్కడక్కడ పదప్రయోగం ద్వారా సూచిస్తాడు. రెండుపదాల్ని ఒకపదంగా కుదించడం ఇక్కడి చమత్కారం.

పెలిగ్రామ + గ్రామ్యభాష = పెలిగ్రామ్యభాష

లంగా + గావంచా = లంగావంచా

ఆరుద్ర + రుద్రాభిషేకం = ఆరుద్రాభిషేకం.

ఈ పదప్రయోగ శిల్పంద్వారా రెండు ఒకటికావడం సూచింపబడుతోంది. రెండును గూర్చి కవిపాడిన పంక్తులన్నింటిలో అభ్యుదయభావన, విప్లవభావన అంతర్గతంగా ఉంటుంది. ఇది శ్రీశ్రీ నరనరాల్లో జీర్ణించినభావన. అందుకే అతని ఏ నాటికలోనైనా, ఏ రచనలోనైనా ఈ అభ్యుదయ భావనయొక్క మెఱుపు అక్కడక్కడ కనిపిస్తూనే ఉంటుంది. శ్రీశ్రీలో అభ్యుదయభావన ఒకశ్రీ; శిల్పదృష్టి మఱొకశ్రీ. 1 + 1 = 1 లాగా ఈరెండూ కలిసిశ్రీశ్రీ. సిరిపాటలో కొన్నిపంక్తులుదాహరిస్తాను-

"రెండు కళ్ళుతెఱచిన నాగళ్ళు
రెండు పిడికిళ్ళు బిగించిన కొడవళ్ళు +"

ఈ పాదాల్లో విప్లవధ్వనిఉంది. విప్లవభావనవలెనే శ్రీశ్రీలో ఒక చైతన్యమైపోయింది శాబ్దిక చమత్కృతి. శబ్దచమత్కృతిలో శ్రీశ్రీని మించినవారు కనబడరు. అతని శబ్దచమత్కృతిలో, అభ్యుదయ భావరేఖ స్పష్టాస్పష్టంగా మెఱవడం అతని విశిష్టత. ఉదాహరణకి-

"రెండు జగన్నాథ రథరథరథాధరధరాధర
రసాతల జలపాతాళాలు
రెండు భ్రమాభ్రమర భ్రమణభ్రమరణభ్రమా
వరణ బ్రహ్మవైవస్వతమన్వంతరాలు-"

ఈ పైశబ్ద చమత్కృతిలో ఒక కల్లోల విప్లవభావం అంతస్స్రవంతిగా ఉంది. శ్రీశ్రీ అధివాస్తవిక కవిత వ్రాసినా అభ్యుదయ భావరేఖ జ్వలిస్తూనే ఉంటుంది. భావకవిత్వపు మూలసూత్రాలు తెలిస్తే కృష్ణశాస్త్రిలో అర్థంకానిభాగం ఎంతబాగా అర్థమౌతుందో, అట్లాగే అభ్యుదయ కవితమూల సూత్రాలు తెలిస్తే శ్రీశ్రీలో అర్థంకాని భాగాలు అంతబాగా అర్థమౌతై.

శిల్పదృష్ట్యా శ్రీశ్రీ నాటికలన్నిటిలో మొట్టమొదట పేర్కొన వలసింది "చతురస్రం" లేదా "1 + 1 = 1" అందుకే నాటికల పుస్తకానికి ఈ పేరే ఉంచబడింది. ఈ చతురస్రానికి నాలుగు బాహువులు. కథలో నాలుగుపాత్రలు. 70 ఏళ్ళ జ్ఞానం అనే వైజ్ఞానికుడు, 50 ఏళ్ళ రాజ్యంఅనే స్త్రీ; 10 ఏళ్ళ కళ అనే అమ్మాయి; 30 ఏళ్ళ సిరిఅనే కవి. ఈ నలుగురికీ వయస్సులో ఉన్న భేదం, ఆ నలుగురికీ స్వభావాల్లోనూ సర్వవిషయాల్లో ఉన్న భేదానికి ఉపలక్షకం. కాబట్టి మొదటఇది విషమబాహుచతురస్రం. ఈ నాలుగుపాత్రల పేర్లూగూడా సాంకేతికంగా పెట్టాడు కవి. విజ్ఞానమూ, రాజకీయమూ, సౌందర్యమూ, కవిత్వమూ-ఈ నాలుగంశాలు. వీటికి ఒకదానితో ఒకదానికి పొత్తులేదు. అందుకే యిది విషమబాహుచతురస్రం. ఇది సమబాహువుగా మారడమన్నదాన్ని కవి, నలుగురినీ 30 ఏళ్ళవాళ్ళని చెయ్యడంగా భావించాడు. 1999 సం॥డిసెంబరు 31న మానవుడు చంద్రలోకం నించి అమృతం తెస్తాడు. అది ప్రపంచంలోని సర్వమానవులకీ యింజక్షన్ల రూపంతోనూ, మాత్రల రూపంతోనూ ఇవ్వబడుతుంది. మానవులంతా 30 ఏళ్ళవాళ్ళైపోతారు. విషమబాహువు సమబాహువౌతుంది. అంటే అందరిఊహలకీ సమత్వం సిద్ధిస్తుంది. మానవుడు కాలాన్ని జయిస్తాడు. కాలాన్ని జయించడమన్న భావన ఐన్‌స్టీన్‌నుండి గ్రహించబడింది. ఈ కాలాన్ని జయించిన మానవుడు, దేవుడైనట్లే. ఇది సూచించడానికి ఒక స్త్రీ పాత్రను సృష్టించాడు కవి.

"నేను దైవాన్ని, నేను సత్యాన్ని
దైవాన్ని నేను మాట్లాడుతున్నాను
మానవుణ్ణి నేను సృష్టించలేదు
మానవుడే నన్ను సృష్టించాడు"

ఈ నాటిక రెండు రేఖలమీద సాగుతుంది. ఒకటి కవి, కళ, జ్ఞానం, రాజ్యం—వీరి సంభాషణ. మరొకటి రాజకీయమైన సమావేశాలు. ఒక భాగంవారి సంభాషణ

మరొక భాగం రాజకీయం; మళ్ళా కవి మొదలైనవారి సంభాషణ; తర్వాత మళ్ళీ రాజకీయం-ఇట్లా సాగుతుంది నాటిక. రాజకీయ సమావేశం కాగానే కవి, కాలాన్ని తెలియజేస్తాడు. ఉదయాన్ని, సాయంత్రాన్నీ సూచిస్తాడు. అంటేకవి, కాలంతో నడుస్తూ కాలాన్ని సూచింప గలవాడన్న ధ్వనిఉంది. ఈ కవి కాలాన్ని సూచించే మాటలన్నీ వచన గేయ రూపంగా ఉంటై. అంటే కవియొక్క విశిష్టత వేరుగా కనిపించడానికి. చివరకి చతురస్రం సమబాహువైన తర్వాత ఇక కాల సూచనలేదు. కారణం మానవుడు కాలాన్ని జయించాడు. కాలాన్ని జయించిన విషయాన్ని కూడా కవే తెలియజేస్తాడు. రెండును గురించిన పాటగూడా కవే పాడతాడు. పైగా ఈ కవికి అమృతం తాగకముందూ 30 ఏళ్ళే. తర్వాత గూడా 30 ఏళ్ళే ఇట్లా కవియొక్క అమరవాక్కు ధ్వనించబడింది. "చతురస్రం" ప్రతి చిన్న అంశమూ శిల్పంతో తీర్చబడిన అత్యుత్తమ నాటిక.

'అనంతర యాత్ర' గూడా కాలాన్ని గూర్చిన జిజ్ఞాసా ప్రధానమైనది. ఐన్‌స్టీన్ సిద్ధాంతంచేత ప్రభావితమైంది. అందుకే నాటిక మొదట్లో ప్రకటనలో "కాలం అంతా ఒకటేగాని, అందరికీ ఒకటికాదు. జీవిస్తున్నవారి కాలం వేరు. మరణించినవారి కాలం వేరు" అంటాడు. రైల్లో ప్రయాణం చేస్తున్న సరళ, కాంతం అనే వాళ్ళిద్దరి గడియారాలూ ఆరు దగ్గిర ఆగిపోతై. అందుకు వాళ్ళిద్దరూ కాలమే ఆగిపోతుందేమోనని భయపడి అక్కడే ఉన్న రంగారావనే తత్త్వ శాస్త్రాధ్యాపకుణ్ణి ఆయన వాచీగూడా ఆరుదగ్గిరే ఆగిపోయిందా అని అడుగుతారు. ఆ వాచీ తీసి చూచేలోపల రైలు పడిపోయి ప్రమాదం జరిగి రంగారావు చనిపోతాడు. సూక్ష్మరూపంలో తిరుగుతున్న రంగారావుకి తన వాచిగూడా ఆరు గంటలకే ఆగిపోయిందేమో తెలుసుకోవాలన్న జిజ్ఞాస. కాంతం, సరళ మాట్లాడుకునే చోటికి, ఇంకా చాలా చోట్లకి తిరుగుతూ ఉంటాడు. అతని అనుమానం తీరదు. చివరికి జన్మించబోయే శిశువుల కాలంలో ప్రవేశిస్తాడు. వారితో భూలోక జీవనం కష్టమని చెప్తాడు. శిశువులు వ్యతిరేకిస్తారు. "మీరెంత తెలిసినవారైనా మేము స్వయంగా అనుభవించకుండా, మీ వ్యాఖ్యానాలతో ఎట్లా తృప్తిపడగలం తాతగారూ" అంటారు వాళ్ళు. ఇది అభ్యుదయ భావన. ఇట్లాగే అవకాశం ఉన్నప్పుడల్లా సంఘాన్ని గూర్చిన భావాలు వెలువరిస్తాడు శ్రీశ్రీ. గంభీరమైన వస్తువుగల ఈ నాటికలో గూడా, రంగారావుకి సానుభూతి సభ ఏర్పాటుచేసి, అందులో అబద్ధపు పొగడ్తలని వ్యంగ్యం చేస్తాడు. నాటిక చివరికి రంగారావు

సందేహం తీరదు. చివరి ప్రకటనలో "ఈ సందేహం తీరదు. రంగారావు యాత్ర అనంతంగా సాగిపోవలసిందే" అంటాడు కవి. అంటే, కాలం అందరికీ ఒకచోట ఆగడమనే ప్రశ్నకి సమాధానం దొరకడం అసాధ్యమన్న ధ్వని.

"బలి" నాటిక, బలిచక్రవర్తియొక్క, దేవేంద్రునియొక్క శీలభేదాన్ని నిరూపించడానికి వ్రాయబడింది. ఎంతోమంచివాడైన బలికి పాతాళవాసం, దుష్టుడైన దేవేంద్రునికి స్వర్గాధిపత్యం—అన్యాయమని స్ఫురింపజేయ్యడం కవి లక్ష్యం. నాటిక రెండుగొంతుల సంభాషణతో ప్రారంభమౌతుంది. వాళ్ళే బలి దేవేంద్రులగూర్చి, పాపపుణ్యాలగూర్చి మాట్లాడుకుని, వాళ్ళని చూడ్డానికి బయలు దేరతారు. పాతాళలోకంలో వాళ్ళకిరోదనగానం వినిపిస్తుంది. నిర్జీవి కనిపిస్తాడు. ఈ నిర్జీవిపాత్రసృష్టి ఈ నాటికకి ప్రాణం. అతడు బలి రాజధానియైన పాతాళంలో విషాదగీతిక లాలపిస్తూ ఉంటాడు. ఇతని మాటలన్నీ గేయరూపాన వ్రాయడం కవిశిల్పం. అతనంటాడు—

"మరణాన్ని పరుచుకుని
ఒంటరితనాన్ని కప్పుకుని
నిర్లిప్తతను ధరించి
నిస్పృహను వరించి
విరించిని జయించగల
విపంచి నినదించాను"

ఈ శైలిలో మాట్లాడుతున్న నిర్జీవి, కొంచెం ఆగి మామూలు మాటల్లో చెప్తాడు. ఇక్కడ కవి తన అభ్యుదయ భావాల్ని వెలువరించాడు—

"నమ్మకాలను కౌగిలించుకుని
అమ్మకాలను నమ్ముకొని
ఎవరెలా తిప్పితే అలాఅలా గిరరిరా గిరగిరా
తిరిగి తిరిగి తుదకు సొమ్మసిల్లి పడిపోతారు-
కళ్ళకి గంతలూ, మెదళ్ళకిదళ్ళూ కట్టుకుని
కనబడలేదంటారు........"

ఇట్లా చెప్పిన తర్వాత అతడు నరకలోకంలో మానవులు భావించిన భయంకర వాతావరణం లేదనీ పాపాన్ని పశ్చాత్తాపంలో ముంచి పంపేస్తామనీ చెప్తాడు. స్వర్గ

నరకాలను గూర్చిన అభిప్రాయాలను మార్చడం శ్రీశ్రీ ధ్యేయం. తర్వాత బలి చక్రవర్తిని పంపిస్తాడు. తనకు పాపాత్ముల నర్థంచేసుకోవడం, పతితులను బోధ పఱచుకోవడం యిష్టమని చెప్తాడు. తర్వాత ఒక గొంతుక పోతన రచననుండి వామన మూర్త్యావిర్భావ ఘట్టమంతా వినిపిస్తుంది. దీనిద్వారా బలిచక్రవర్తి యొక్క ఉదాత్త గుణాన్ని చెప్పడం కవిధ్యేయం. తర్వాత రెండు గొంతుకలూ స్వర్గలోకానికిపోగా అక్కడ ఇంద్రుడొక స్త్రీ నాట్యాన్ని చూస్తూ ఉంటాడు. అక్కడ కూడా నిర్జీవి కనిపిస్తాడు. కాని స్వర్గంలో అతనుచిరంజీవి. సంతోషంగా పాటలు పాడతాడు. కాని దూరాన బలిరాక వినగానే, అతనిగానంలో వేదన కని పిస్తుంది. అంటే బలియొక్క ప్రభావం అంత అనివార్యమని అర్థం. ఇంద్రుడు నాట్యం చేస్తున్న స్త్రీని బలత్కారం చెయ్యబోగా, బలి ఆమెను రక్షింపవస్తాడు. ఇంద్రుడు బలిరాగానే పరుగెత్తుకొని పారిపోతాడు. మంచితనానికి చెడ్డతనం భయపడుతుందని సూచన. చివరకు చిరంజీవి

"నాకు చిరంజీవిగా ఉండాలనిలేదు. నేనూ వస్తున్నాను." అంటాడు. అంటే దుష్టుడున్న స్వర్గంకంటె, మంచివాడున్న నరకమే గొప్పదని కవి వ్యక్తం చెయ్యదలచాడు. ఈ నాటిక మంచిచెడుల తారతమ్యాన్నిగూర్చిన జిజ్ఞాసతో సాగింది. నరకంలో నిర్జీవిగా, స్వర్గంలో చిరంజీవిగా ఉన్నపాత్ర సృష్టిలోని విలక్షణత ఈ నాటికయొక్క జీవం. ఆ పాత్ర ద్వారా కవి తన భావాలన్నీ చెప్తాడు. ఆ పాత్ర కవికే సంకేతంగా భావించవచ్చును.

ఈ నాటికలన్నిటిలో ముఖ్యంగా ఉన్న లక్షణాలు మూడు. కవితాత్మకత దటిదికాలాన్ని మొ .గూర్చి, సృష్టినిగూర్చి, మనోధర్మాల్నిగూర్చి అన్వేషణ రెండవది. అభ్యుదయ భావవ్యాప్తి మూడవది. మూడవ అంశంకంటె మొదటి రెండంశాలకే ఈ నాటికలలో స్థానం ఎక్కువగా ఉంది. పైగా, అడుగడుగునా కాలం, వేదాంతం, మొదలైన వాటిని గూర్చి నిర్వచనాలు కనిపిస్తూ ఉంటై. అదిగాక పాత్రచిత్రణలో సహజత్వంకంటె సాంకేతికత్వం ఎక్కువ. ఈ కార ణాల చేత ఈ నాటికలు జీవితానికి దగ్గరగా ఉండవు. భావనాశక్తి ప్రధానంగా ఉంటై. మనస్సులోని లోపలి పొరల్లోని అనుభూతికి సంబంధించినవిగా ఉంటై.

శ్రీశ్రీ ఎప్పుడూ సమాజం గురించే, సూటిగానే చెప్తాడు అనే భావం కొంత మందిలో ఉంది. అతడు ఎన్నో సమస్యల్నిగూర్చి, జీవిత మూలభూతమైన అంశాల్నిగూర్చి తీవ్రంగా ఆలోచిస్తాడనీ, నిబిడమైన శిల్పంద్వారా వాటిని వెలువరించడంలో మహాప్రతిభ అతనిలో ఉన్నదనీ ఈ నాటికలవల్ల తెలుస్తుంది.

## VI

శ్రీశ్రీ నాటికలు నిరుపమానమైనవి. ఒక భావాన్ని అత్యద్భుతమైన రచనా శిల్పంతో, కవితా భావనతో నాటికలుగా మలచడంలో ఉన్న అనుభూతి ఎటువంటిదో తెలియజేసేవి. ఇటువంటి నాటికారచన ఎంతో అభివృద్ధిచెందవలసి ఉండగా, ఈరీతి పూర్తిగా విస్మరింపబడ్డది. శ్రీశ్రీ నాటికలుమాత్రమే ఆ విధానానికి ఏకైక ప్రతినిధులుగా నిలిచిఉన్నై.



"పాతపదాలు, డిక్షన్, వర్ణనలు, అలంకారాలు, ఛాందస్సు, ఉపమానాలు, పద్ధతులు, ఆచారాలు, కవిత్వంలోవీ, జీవితంలోవీ ఇంక మళ్ళీ లేకకుండా వాటినడ్డి విరకొట్టాడు శ్రీశ్రీ"

—చెలం

# శ్రీశ్రీ అనువాద సరళి

—రోణంకి అప్పలస్వామి.

శ్రీశ్రీ తాను రచించిన కవితలని కొన్నింటిని అనువాదాలుగా పేర్కొన్నాడు. మరికొన్నింటిని అనుకరణలని నామకరణం చేశాడు. వీటన్నింటిని నేను కవితాంతరీకరణాలంటాను. ఆంగ్ల, ఫ్రెంచి మాతృకలకు ప్రశంసా పాత్రమైన ఉత్తమోత్తమ ప్రతీకలను తెలుగు నుడికారాన్నే మాత్రము బలి కానీయకుండా తెలుగుకవి సాధించాడు. తెలుగు భారతముగాని భాగవతముగాని అనువాదాలనిపించుకోవు. అదేవిధంగా శ్రీశ్రీ అనువాదాలు అనుకరణలు రూపాంతరాలని చెప్పడం సమంజసం. ఇతర భాషలలోని కవితా సృష్టికి సమమైన ప్రతి సృష్టి ఈతని అనువాద సరళి.

అనువాదాని కనువుగానిది కవిత్వమని కవిత్వానికొక నిర్వచనం కద్దు. పద్యాలకు ప్రతి పదార్థం చెప్పడం సార్వత్రిక మవడంచేత దండాన్వయానికి దొరకని రచన అసలు రచనేకాదని అనుకోవడం అలవాటైంది. హృదయోద్వేగం, ఆత్మానుభవాతిశయం వచనరచన కతీతంగా వుంటవి. ఏదో ఒక ఛందస్సును ఆశ్రయిస్తవి. ఈ ఛందస్సు క్రొత్తది కావచ్చును కాని వచన రచన శయ్యకు వేరుగా ఉండి తీరుతుంది.

ప్రతి భాషకు ప్రత్యేకమైన ఒక వాక్య నిర్మాణపద్ధతి వుంటుంది. ఒకే ఒక భావాన్ని ప్రకటించేందుకు ఏ రెండు భాషలలోనైనా సరే భాషా భాగానుగుణ్యము, వర్ణ సమామ్నాయము సాధ్యము కానేరవు. శబ్దధ్వని సరే మారి తీరుతుంది. రాగం అనువాద యోగ్యం కానట్టే కవిత్వం కూడా అనువాదాతీతమనే చెప్పాలి. ఛాయా మాత్రంగా భావం భాషాంతరీకరితమవుతుంది. ఉదాహరణకు ఈ క్రింది పద్య పాదాన్ని గమనించ మనవి.

'మధుపర్కమిడురీతి మకరంద బృంద
మందర గంధవహుడు ముందర మెలంగ'

ఇందలి గమన మాంద్యము, బరువు, బిగట, యమకము వేరే భాషలోనికి కొని పోవుట శక్యముకానిపని. ఉచ్ఛ్వాస నిశ్వాస ధ్వనిని 'సోహం' అన్న శబ్ద ద్వయంగా మన వేదాంతులు భావించారు. 'సోహం' వంటి పదాలను పొదిగే నైపుణ్యం కవిత్వ లక్షణం. అందులోని భావం శాస్త్ర సమ్మతమా? అన్న ప్రశ్న ఇక్కడ అనవసరం. శబ్ద సామ్యము భావం పరమ సత్యమనే నమ్మకాన్ని రేకెత్తిస్తుంది. అయితే ఈ సంస్కృత శబ్ద మిశ్రమాన్ని ఇతర భాషలలోనికి అనువదిస్తే అట్టి నమ్మకం నెలకొనదు. చెప్పవచ్చేదేమంటే సుదీర్ఘ కావ్యం కానివ్వండి, రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కానివ్వండి అనువాదంలో తద్రూప్యాన్ని కోల్పోవడం తథ్యం.

కవులు ఇతర భాషలలోని కావ్యాల్ని చదివేటప్పుడు అనువదించాలని అనుకరించాలని తహతహ పడడం సంభవిస్తుంది. శ్రీశ్రీకి ఆంగ్ల ఫ్రెంచి భాషల పరిచయం కద్దు. అందుచేత ఉత్తమోత్తమమైన కొన్ని కావ్య ఖండికలను తెలుగు కనువైనట్లు మార్చివేశాడు. ఈ ఖండికలన్నీ కేవలం స్వీయరచనలని పించే కళా కౌశలాన్ని ప్రదర్శించాడు.

మహాప్రస్థానంలో 'పేదలనే' కవిత Verhaeren రచించిన 'Les pauvres' అనే ఫ్రెంచి కవితకు అనువాదము. 'గంటలు' Poe యొక్క Bells అన్న గేయంలో ప్రకటితమైన భావాలలో కొన్నింటిని మాత్రము పొందు పరచిందని చెప్పాలి. అద్వైతమన్న అనుకరణ Swinburne రచించిన 'A match అన్న గేయమే శ్రీశ్రీ తెలుగు మాతృకకు స్వేచ్ఛానువాదమనేటంతటి హృదయ స్పందనాన్ని ప్రదర్శిస్తోంది. 'పేదలు' అన్న కవిత మొదటి చరణం ఫ్రెంచి మాతృకను దగ్గర నిడుకొని పరిశీలిస్తే శ్రీశ్రీ ప్రదర్శిత శబ్ద నైపుణ్యం తేట తెల్లమవుతుంది.

Il an est de pauvres Coeurs
Avec un eux des lacs de pleurs
Qui Sont pales Comme les pierres
D'un Cimitiere

There are poor hearts
With in them lakes of tears
Which are (pale) grey as the stones
In a grave yard.

అంతేలే పేదల గుండెలు
అశ్రువులే నిండిన కుండలు
శ్మశానమున శశికాంతులలో
చలివారిన వెలిరాబండలు

మాతృకలో కాసారాలు అన్న పదానికి బదులు శ్రీశ్రీ కుండలు అన్న పదాన్ని వాడాడు. 'శశికాంతులలో చలివారిన' అన్న భావము మాతృకలో లేదు. అంతేలే అన్న తెలుగు విరుపు కేవలం శ్రీశ్రీది. అనువాద శబ్దపాటవం మాతృక శబ్ద పాటవానికి తీసిపోదు. ఇదే సరళిలో అనువాదమంతా నడిచింది.

ఖడ్గసృష్టి సంపుటిలో ఆంగ్ల. ఫ్రెంచి, రష్యను భాషలలో నుండి పెక్కు అనువాదాలు చేర్చబడినవి. డిలాన్ థామస్‌నుండి చేసిన అనువాదాలు, మాక్నీసు పుట్టని పాప ప్రార్థన మాతృకలకు మిక్కిలి సన్నిహితంగా ఉన్నవి. అంద్రెబ్రితం కవిత Les attitudes spectrales కు అనువాదం. ఛాయాభంగిమలు – తెల్ల వెంద్రుకల రివాల్వర్ అన్న సంకలనములోనిది. ఇందులో కూడా శ్రీశ్రీ వీలయి నంత సమానాంతరంగా ప్రయాణించాడు. జీవితానికి ప్రాముఖ్యం యివ్వను' అని మొదలుపెట్టాడు. మాతృకలోని సీతాకోక చిలుకలను అనువాదకుడు పిపీలికాలుగా మార్చాడు. శయ్యను శబ్ద పాటవాన్ని పురస్కరించుకొని శ్రీశ్రీ తెలుగు భాష కనువైన పదజాలాన్ని సృష్టించాడు. 'యుద్ధ రంగం అన్న ఖండిక Guillaume Apollinaire రచించిన Zone లోని మొదటిభాగం. జోన్ అని నామకరణం చేసిన అనువాదం Zone లో ఆఖరు భాగం. Apollinaire మొట్టమొదట Surrealism అన్న పదాన్ని ప్రయోగించాడు. Zone అన్న కవిత క్యూబిస్టు కవిత్వానికి మంచి మచ్చు తునకగా పరిగణింపబడుతోంది. క్యూబిజం అంటే వస్తువును అన్నివైపులనుండి పరిశీలించడం. మాతృక పాశ్చాత్యజీవితాన్ని ప్రతిబింబిస్తుంది. శ్రీశ్రీ మన నాగరిక జీవితాన్ని కవితావస్తువుగా పరిగ్రహించాడు. Zone మొదటి పాదము ఉన్నదున్నట్లుగా చెప్పాలంటే

( చివరికి పురాణప్రపంచంతో విసుగెత్తిపోయింది నాకు ) అని తెలుగులో అవుతుంది. శ్రీ శ్రీ కుళ్ళిపోయిన ప్రపంచమని, నాకు 'బదులు నీకని' అనువదించాడు. Eiffel Tower తెలుగులో కుతుబ్ మీనార్ అయింది. ఫ్రెంచి కవి పాతను క్రొత్తదిగాను క్రొత్తను పాతదిగాను చమత్కరించాడు. పారిశ్రామిక దృశ్యాలు పురాతనమైపోయినట్లు కవి ఊహించాడు. క్రైస్తవ మతము మిక్కిలి

ఆధునికమైనట్లు Pope నాగరికత అందరిని మించినట్లు చిత్రిస్తాడు. Eiffel Tower గొర్రెలను కాస్తున్న స్త్రీవలె గోచరిస్తుంది. సెయిననది మీదవంతెనలు గొఱ్ఱెలు. అవి బాబా అని అరుస్తున్నట్లు భావిస్తాడు కవి.

శ్రీ శ్రీ అనువాదాల్లోనే కాదు. స్వీయకవితలలోను కూడ అతినవీన శయ్యలను ప్రవేశ పెట్టాడు. ఈ విషయాన్ని గుర్తించడం అందరికీ సాధ్యంకాదు. కవిత్వ మెలకువలను చదవడంలో ప్రస్ఫుటం చేయడం ఒకవిద్య. పాశ్చాత్య భాషలలోని శయ్యలను శ్రీ శ్రీ తెలుగులో సుసాధ్య పరిచాడు. ఈ సత్యాన్ని శ్రీశ్రీ కవితలను వినిపించి నిరూపించగలనని నా వినయ పూర్వకమనవి.

రష్యను భాషతో నాకు పరిచయంలేదు. అయినప్పటికి మయకోవ్‌స్కీ రచించిన "వ్లాడిమిర్ ఇల్యిచ్ లెనిన్" అన్న ఖండిక పుష్కిన్ విరచిత "చలికాలపు ఉదయం" మధురాతి మధుర రచనలని చెప్పాలి. వీటి గమన నైపుణ్యం అనన్య సాధ్యం. సమూహగానం చేయించి ఇందలి శబ్దతార్కికాన్ని, భావనాపటిమను మిక్కిలి అమోఘమైనవిగాను, నవీనమైనవిగాను రుజువుచేయవచ్చునని నేను గుండెమీద చెయ్యివేసుకొని చెప్పగలను. Salvador Dali ది ఒక శీర్షికకద్దు. Paul eluard కవితలు కొన్నివున్నవి. వీటిని నేను చర్చించ బూనుకోను. అన్నింటిలోను తెలుగునాుడిని కవి విస్మరించలేదు. తెలుగుజాతి చైతన్యం కనుగుణంగా పద చిత్రణను మలచాడు. ఇక మిగిలింది 'ఏవి తల్లీ నిరుడుకురిసిన హిమ సమూహములు' అన్నశీర్షిక. దీనికి మాతృక ఫ్రెంచి కవి Villon పదునైదవ శతాబ్దంలో ననుకుంటాను రచించిన Ballade des dames du temps jadis, అంటే పూర్వము వాసికెక్కిన స్త్రీల సంస్కరణ. బలాడ్ అంటే ఇంగ్లీషులోని ballad కాదు. శ్రీ శ్రీ ఈ గేయంలోని పల్లవిని మినహాయించి యితర నియమాలను పాటించలేదు. మనదేశ చరిత్రలో పేరువడసిన స్త్రీలను పురుషులను కూడ పేర్కొన్నాడు. ఫ్రెంచిలో పల్లవి.

Mais ou 'sont les neiges d 'antan
But where are the snows of yester year

కవితలో ఈ క్రింది చరణముంది,

O'u sont-elles, Vierge souveraine ?
Where are they, virgin sovereign ?

ఇంగ్లీషు అనువాదములో

Mary mother, where are all they ?

అని వుంటుంది. ఈ చరణాన్నాధారంగా శ్రీశ్రీ తనపల్లవిని పొందుపరచుకున్నాడు. అయితే ఫ్రెంచిలోను, ఇంగ్లీషులోను ఈ కవిత ఏ విధంగా మస్తిష్కంలో భ్రమరగానం చేస్తూంటుందో అదేవిధంగా మరువరానిదిగా తెలుగులో మలచబడింది,

శ్రీ శ్రీ తెలుగు సాహిత్యరంగంలో ప్రవేశించడంతో వ్యావహారిక భాష తిరుగులేకుండా సాహిత్య భాషగా స్థిరపడిపోయింది. ఈతని కవిత్వలో భాషా విప్లవం పరాకాష్ఠనందు కోవడమేకాకుండా భావవిప్లవం జయం గాంచిందని చరిత్రలో సువర్ణాక్షర లిఖితమయి తీరుతుంది. ఇందుకు సంబంధించిన శ్రీ శ్రీ సుభాషితాన్ని పునశ్చరణ చేయడం యీా వ్యాసానికి సరియైన ముగింపు.

మనః ప్రపంచానికి బాహ్యస్వరూపం భాష
భాషా విప్లవమే భావవిప్లవం
అందుకే ఈ ఆనంద సమయంలో
భాషలోనూ భావంలోనూ విప్లవంతెచ్చిన
మహామానవులైన
మన గిడుగు, గురజాడ, వీరేశలింగం
మహానీయులను
నా మనఃఫలకం ముందు సాక్షాత్కరింప జేసుకొని
నమస్కరిస్తున్నాను
వారిచ్చిన ఆశీర్వాదాలు
తీర్చిదిద్దిన ఒరవడులు
చిరకాలం మన ఆంధ్రావనికి
శ్రీరామరక్ష
దేవతలౌ మానవులే దీవించాలి
దేశంలో దేవత్వం దీపించాలి

# శ్రీశ్రీ మరో రూపం 1934

— నూతలపాటి గంగాధరం

ఒక దేశచరిత్రలోని అన్ని యుగాలూ స్వర్ణయుగాలుకావు. ఒక వ్యక్తి జీవితంలోని అన్ని సంవత్సరాలూ ఫలవంతమైనవికావు. ఏదో ఒక యుగం, ఏదో ఒక సంవత్సరం ఒక కొత్త చరిత్రను సృష్టిస్తుంది. అందరి దృష్టిని ఆకర్షిస్తుంది. ఆ యుగం ఆ దేశానికీ, ఆ సంవత్సరం ఆ మనిషికీ మణి మకుటాల్లాంటివి.

ఆంధ్ర సాహిత్యంలో తిక్కన, వేమన, గురజాడలు కలం పట్టిన ఘడియలు స్వర్ణఘడియలు. మళ్ళీ ఇప్పుడు శ్రీశ్రీ ఆ స్వర్ణఘట్టాన్ని ఆంధ్ర సాహిత్యానికి రుచి చూపించాడు.

ఆధునికాంధ్ర సాహిత్యచరిత్రలో శ్రీశ్రీ ఒక మణిదీపం. శ్రీశ్రీ జీవితంలో 1934వ సంవత్సరం ఒక హిమగిరిశిఖరం. అటు శ్రీశ్రీ జీవితంలోనూ, ఇటు ఆధునిక సాహిత్యచరిత్రలోనూ ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించింది-1934.

ఎవరెన్ని చెప్పినా శ్రీశ్రీకి కీర్తి తెచ్చింది మహాప్రస్థాన కవితాసంపుటి. అందులోనూ మరోప్రపంచం గీతం.

ఈ గీతం అంతవరకున్న సాహిత్య సాంప్రదాయాలనూ, విలువల్నీ, మర్యాదల్నీ తలక్రిందులు చేసింది. ఆధునికాంధ్ర సాహిత్యాన్నే ఒక పెద్ద మలుపు త్రిప్పింది. ప్రాచీన సాహిత్య సాంప్రదాయాలతో మాగి, మరోప్రపంచమే పట్టించుకోని వాళ్ళకది తోకచుక్కగా తోచింది. (తోకచుక్కను గురజాడ సంఘసంస్కరణ ప్రయాణ పతాకగా భావించాడు.) పాతతో రోత జెంది కొత్త కోసం అర్రులుసాచే వాళ్ళకది వేగుచుక్కగా తోచింది.

'మహాప్రస్థానం' కావ్యంలేకుంటే శ్రీశ్రీ లేడు. శ్రీశ్రీ లేకుండా మహా ప్రస్థానంలేదు. శ్రీశ్రీ మరొక రూపం మహాప్రస్థానం. ఖడ్గసృష్టిలో శ్రీశ్రీ కవి

త్వం పండిఉండవచ్చునుగాక–మహాప్రస్థానం అంతకు పూర్వ సాంప్రదాయాలతో చారిత్రకంగా విడిపోయి, కొత్త వెలుగును ప్రవేశపెట్టి, ప్రపంచం సుహృద్ద్వారాలు తెరిచింది. ఇలాంటి చరిత్రాత్మకమైన మార్పు ఖడ్గసృష్టి కావ్యంవల్ల సాధింపబడలేదంటున్నాను. 'మహాప్రస్థానం' కావ్యం రాయకుండా 'ఖడ్గసృష్టి' కావ్యం మాత్రమే వ్రాసిఉంటే కేవలం సన్మానాల కవిగానే చలామణియై, కవి పంక్తిలో ఒక అనామక స్థానంలో చేతులు ముడుచుకుని కూర్చుని ఉండేవాడు. కానీ, యుగకర్త గౌరవం అతన్ని వరించిఉండేది కాదు. 'ఖడ్గసృష్టి' — శ్రీశ్రీ కవితాలత కాసిన ఫలం కావచ్చుగాక, మహాప్రస్థానం ఆ లత పుష్పించిన కుసుమం.

పోతే, శ్రీశ్రీ కవిత్వానికి నేడు సంప్రదాయం ముద్ర పడిపోయింది. అలాగే ఆరుద్ర, దాశరథి, నారాయణరెడ్డి మొదలైన వాళ్లంతా మనకు సంప్రదాయ కవులైపోయారు. శ్రీశ్రీ నిజమైన కవితాకాలం మహాప్రస్థానంతోనే చెల్లిపోయింది. శ్రీశ్రీ సంప్రదాయకవిగా గుర్తింపబడి పాతిక సంవత్సరాలు పైబడుతోంది. ఈ విషయం శ్రీశ్రీకి కూడా తెలుసు. తనకు అనుయాయులు పెరిగిపోయారని తెలుసుకున్నాడు. అనుయాయులెప్పుడైతే అధికమైపోతారో ఆద్యుని కవిత్వంలోని నూతనత్వం సంప్రదాయంగా మారిపోతుంది. శ్రీశ్రీ నిత్యనూతనత్వాన్ని ఆకాంక్షించేవ్యక్తి. అందుకనే మహాప్రస్థానం తర్వాత ఆ సంప్రదాయాన్ని (పూర్తిగా కాకపోయినా) విడచిపెట్టి సర్రియలిజమనీ, అదనీ, ఇదనీ కొత్త లోకాలకోసం గాలిస్తున్నాడు. కానీ, ఏదీ మహాప్రస్థాన శిఖరాన్ని అందుకోలేక పోతోంది.

శ్రీశ్రీ యుగంకూడా చెల్లిపోయిందనే చెప్పాలి. ( శ్రీశ్రీ బ్రతికుండగానే మరో యుగమా? ఇదెక్కడి సంప్రదాయం?–అంటే, ఇదే ఆధునిక కాల తత్త్వం. వచనంలో రాసేదికూడా కవిత్వమవుతుందా? అని ఒకప్పుడు నోళ్ళు తెరిచిన వాళ్ళింకా తెరుచుకునే ఉన్నారా? ఎప్పుడో మూసుకున్నారు. అలాగే ఇదికూడా.) నేటి యువలోకంలో మరోయుగంకోసం అన్వేషణ సాగుతోంది. ఈ అన్వేషణ ఇంకా ఒక కొలిక్కిరాలేదు. అంతవరకు శ్రీశ్రీ యుగంగానే చలామణి కావలసిన ధర్మం కాలానికుంది.

శ్రీశ్రీకి కీర్తి పతాక అయిన మహాప్రస్థానంలోని గీతాలన్నీ మొత్తం 41. ఇవన్నీ 1933 నుంచి 1947 లోపల వ్రాసినవి. 1933లో వ్రాసిన గీతాలు 2;

34లో వ్రాసినవి 14: 35లో 3; 36లో 2; 37లో 8; 38లో 4; 39లో 3; 40లో 1; 41లో 2; 47లో 1. ఇదీ మహాప్రస్థానంలోని సంవత్సరాల గీతాల ప్రస్తారం.

అంటే మహాప్రస్థానంలోని 41 గీతాలూ 14 సంవత్సరాల కాలంలో వ్రాయబడినవి. 1934లోనే 14 గీతాలు వ్రాశాడు. 34కి ముందుకానీ తర్వాత కానీ తక్కిన సంవత్సరాలలో ఇన్ని గీతాలు వ్రాసి ఉండలేదు. 37వ సంవత్సరంలో మాత్రం 8 గీతాలు వ్రాసిఉన్నాడు. 14 తర్వాత పెద్ద సంఖ్య ఇదే. 34వ సంవత్సరంలో వ్రాసిన గీతాలు-మహాప్రస్థానం, ఐ, అవతారం, సాహసి, కళారవి, ఋక్కులు, బాటసారి, భిక్షువర్షీయసి, ఆకాశదీపం, అవతలిగట్టు, ఒక క్షణంలో...., శైశవగీతి, గంటలు, ఆశాదూతలు, తన కవితాలక్షణానికి లక్ష్యాలనదగిన అనేక గీతాలు ఈ సంవత్సరంలోనే వ్రాశాడు. కానీ అదికాదు ముఖ్యం. శ్రీశ్రీకి నిర్దుష్టమైన ఒక లక్ష్యం, ఒక మార్గం ఈ సంవత్సరంలోనే ఏర్పడింది. ఇదే ముఖ్యం. మార్గం నిర్మించుకున్న పిమ్మట దానిలో పయనించడమేనా కష్టం?

శ్రీశ్రీకి 1934 అనే వృక్షంనీడన నూత్న కవితా దృక్పథం ప్రబోధమైంది. శ్రీశ్రీకి చిహ్నం 1934. శ్రీశ్రీ మరోరూపం 1934. శ్రీశ్రీ ఆదినుంచి పాదిచేసి నీరుపోసి పెంచిన కృషిలత ఈ సంవత్సరంలోనే పుష్పించింది. శ్రీశ్రీ కవితా జీవితంలో ఈ సంవత్సరం ఒక్కటే ఒకఎత్తు. తక్కిన జీవితమంతా ఒకఎత్తు.

ముఖ్యంగా ఈ సంవత్సరంలో శ్రీశ్రీ రచించిన రెండు గీతాలకి ఆధునిక సాహిత్యంలోనే చరిత్రను సృష్టించే ప్రాముఖ్యత ఉంది. ఒకటి: మహాప్రస్థాన గీతిక. మరొకటి: ఆకాశదీపం. మొదటిది కవితావస్తువులోనూ, శిల్పంలోనూ, ప్రయోజనంలోనూ అఖండమైన మార్పుతెస్తే, రెండవది ఛందస్సులో విజయవంతమైన పరిణామం తీసుకువచ్చింది.

అంతవరకే శిష్టా మొదలైన వాళ్ళెవరో వచనగీతం వ్రాసిన ఆంధ్రదేశం మొదట ఈ మార్పును గుర్తించింది శ్రీశ్రీ నుంచే. అందువల్ల ఆధునిక ఛందస్సుకు వెలుగుచూపినకీర్తి ఆకాశదీపానికే దక్కింది. వ్యావహారిక భాషను స్వీకరించినట్లే నేటి కవిత్వమంతా దాదాపు వచనఛందస్సు స్వీకరించి సాగిపోతోంది. ఇది విజయవంతమైన మార్పుకాక మరేమిటి?

శ్రీశ్రీ ఈ రెండు పద్ధతులే కాక ఇంకా చాలకొత్త సాంప్రదాయాల్ని, పద్ధతులనూ మన సాహిత్యంలో ప్రవేశపెట్టాడు.

వ్యావహారిక భాషలో ప్రాచీన పద్యాన్ని నడపాలన్నా ఆయనే నడిపాడు. తెలుగు సాహిత్యంలో సర్రియలిజాన్ని ప్రవేశపెట్టాలన్నా ఆయనే చేశాడు. బూతులు తిట్టాలన్నా, ప్రాసక్రీడలు ఆడాలన్నా, కవిత్వంలో కార్టూనులు గీయాలన్నా ఒక్క శ్రీశ్రీయే చేశాడు. కానీ ఇవన్నీ ఆయనకు కీర్తి లెచ్చినవంటే వట్టి దబాయింపు మాత్రమే అవుతుంది.

ఎప్పటికప్పుడు క్రొత్తవిషయాన్ని చెప్పడం, చెప్పేదాన్ని సూటిగా, ఘాటుగా చెప్పడం; చెప్పేవస్తువూ-చెబుతున్న పద్ధతీ ప్రజాశ్రేయస్సు దృష్ట్యా చెప్పడం-ఏ కవికైనా జీవలక్షణం. ఈ లక్షణం శ్రీ శ్రీలో సంపూర్ణంగా ప్రస్ఫుటమవుతుంది. శ్రీ శ్రీలో కూడా మొదటి రెండు పద్ధతుల్లోనే ఈ లక్ష్యం విజయవంతమైంది. తరవాతి ప్రయత్నాలలో అస్తవ్యస్తమైపోయింది. మొదటి రెండు పద్ధతులకు నాంది పలికినవి మరోప్రపంచం, ఆకాశదీపం గీతాలు. ఈ గీతాల జన్మకాలం మళ్ళీ గుర్తుచేయాలా ?

పోతే, ఈ రెండుమార్పులు ఆంధ్రసాహిత్య చరిత్ర కెలా గర్వ కారణాలో చూద్దాం.

అంతవరకు కవితాగంగ ఆకాశపు దారులంట హడావిడిగా వెళిపోయేది. సామాన్య మానవుడ్ని పలకరించేదికాదు. అసలు వాడ్నిగురించి పట్టించుకునేదీ కాదు. వాస్తవానికి దూరమైన కల్పనలూ, నేలమీద కాలానని ఇతివృత్తాలూ, అంతుతేలని వర్ణనలూ. భావగరిమలేని పాండిత్యప్రదర్శనమూ, నైఘంటిక శబ్దార్థ చిత్రచాతుర్యమూ, గుక్కతిరగని వృత్తఛందః సారధ్యమూ నాటి సాహిత్యాన్ని పరిపాలిస్తుండేవి. ఈ పరిపాలనే కవిత్వాన్ని ప్రజానీకానికి దూరం చేసింది.

ప్రబంధ ప్రక్రియ తర్వాత వచ్చిన భావకవిత్వాన్ని కూడా దాదాపు ఈ దారిద్ర్యం విడిచిందికాదు. వస్తువిషయంగా ఏవో కొన్ని మార్పులు జరిగినా, అవి సామాజిక ప్రగతికి దోహదకారులేం కాకపోయాయి. వ్యక్తి ప్రణయమూ, విరహమూ వస్తువుగా చేసుకుని ఇది సాగిపోయింది. చెప్పేపద్ధతి మార్మిక ధోరణిలో సాగింది. ఈ ఉద్యమం అన్నింటా సౌందర్యాన్ని ప్రధాన లక్ష్యంగా

భావించింది. పోతే ప్రయోజనం విషయంలో ప్రబంధానికీ, ఆత్మాశ్రయ కవిత్వా నికీ అట్టే తేడా లేదనే చెప్పాలి.

వస్తువులోనూ, శిల్పంలోనూ, ప్రయోజనంలోనూ పూర్వసాంప్రదాయాలను స్వరూపస్వభావ విశేషాలన్నింటా పూర్తిగా వ్యతిరేకిస్తూ సమాజప్రగతికి మాన వుడ్ని సర్వాత్మనా ప్రబుద్ధుడ్ని చేసే లక్ష్యంతో వచ్చింది అభ్యుదయ కవిత. ఆర్. ఎస్. సుదర్శనంగారు శ్రీ శ్రీ యుగంలో వెలువడిన కవితను రాజకీయకవిత అనీ, ప్రజాకీయ కవితఅనీ రెండు పద్ధతుల్లో విభజించారు. అందరూ అభ్యుదయ కవిత అని వ్యవహరించేదాన్ని రాజకీయకవిత అన్నారు. కాళోజి, నార్ల వ్రాసే కవిత్వాన్ని ప్రజాకీయ కవిత్వ మన్నారు కవిత్వాన్ని రాజకీయపరం చేసిన సాహసం శ్రీ శ్రీకే దక్కింది.

వృత్తఛ్ఛందం శ్రీ శ్రీ నాటికే పూర్తిగా పనికిరాకపోయింది. మాత్రాఛ్ఛందం లోని పనికిరాని తనాన్ని గుర్తించడం గూడా అప్పటికే ప్రారంభమైంది. ఆ ప్రారంభం నేటికి ఒక పరిపూర్ణతను సాధించింది, మాత్రాఛ్ఛందం గూడా నేటి యువలోకం పూర్తిగా త్యజించింది. ఇది చరిత్రాత్మకమైన పరిణామమే కాని మరొకటికాదు.

వచన పద్యానికి నేటికొక సమ్యక్స్వరూపం ఏర్పడింది. దానిమీద సందే హాలూ, అపనమ్మకాలూ, అన్నీ తొలగిపోవడమే కాకుండా దాని పుష్టికోసం అన్నివిధాలా కృషిజరుగుతోంది. వచన ఛందస్సుకింత ప్రచారం రావడానికి కారణం లేకపోలేదు. నేటివైయక్తికమైతేనేమి, సామాజికమైతేనేమి–వాటియొక్క మనస్తత్వానికి ప్రతీక వచనపద్యం. నేటివ్యక్తి, అనవసర సాంప్రదాయాల్ని సహించలేడు. సహించలేనివాటిని త్యజించడంలో ఒకరిఅనుమతికోసం ఎదురు చూడడు. జీవితంలో అలసత్వాన్ని, మాంద్యాన్ని సహించలేడు. కాలాన్ని వెనక్కి నెట్టివేయాలని నేటి మానవుని ప్రయత్నం. వెనుకటి వారికంటె తన వ్యక్తిత్వం ప్రత్యేకమైనదనీ, ఇప్పటి పరిస్థితికంటె తను సాధించబోయే జీవన పరిమాణం విలువైనదనీ నమ్మేవాడు. మరొకవ్యక్తి తనమీద చలాయించే అధి కారాన్ని భరించలేడు. తన వ్యక్తిత్వం స్వఛ్ఛందంగా మలచుకోవడం అతనికిష్టం. సాహిత్యం సమకాలీన సామాజిక ప్రతిబింబమంటారుకదా! సమాజంలోని ఈ గుణాలన్నీ నేటిసాహిత్యంలో ప్రతిబింబిస్తున్నాయి. ముఖ్యంగా వచనపద్యంలో

గణాలగుణకారాలూ, యతిప్రాసల అతిక్రమింపులూ, అనవసరమైన సంస్కృతపద సమాసచాలనలూ మొదలైన సాంప్రదాయాల్ని వచనపద్యం పూర్తిగా త్యజించింది. కవితా ప్రక్రియలో గ్రాంధిక భాషకు స్వస్తిచెప్పి వ్యావహారిక భాషకు స్వాగతం పలికింది. వెనుకటికవులు రసానుగుణంగా వాడుతూవచ్చే ఛంద స్సాంప్రదాయానికీ, శిల్పవైవిధ్యానికీ జానిసత్వాన్ని ఇదిపూర్తిగా త్యజించింది. భావంలో, స్వభావంలో గతిలో, సంగతిలో అంతవరకు లేని వేగాన్ని కవిత్వంలో సాధించింది. వెనుకటి వాళ్లు తొక్కిన మార్గాన్ని తప్పించి ప్రతికవీ తనదైనటక కొత్త శిల్పమార్గాన్ని ప్రవేశపెట్టితేనే రాణించే విశిష్టమైన గుణం వచనపద్యంతో ఉంది. ఏకవి కాకవిలో ప్రత్యేక వ్యక్తిత్వాన్ని పుంజుకొని సాగిపోతున్నదది.

శ్రీశ్రీ ఎన్ని కొత్తపోకడలు పోయినా, తన తురువాతి తరానికి మార్గ దర్శకంగా నిలిచింది రెండు పద్ధతుల్లోనే! శ్రీశ్రీ అనగానే అవి రెండే మనకు గుర్తుకు వస్తాయి. మొదట మరోప్రపంచంపోకడా, తర్వాత అకాశదీపం వచన ఛందః పద్ధతి. శ్రీశ్రీ అంతవరకెంత కవిత్వం వ్రాసినా నామమాత్రంగానే ఉండి పోయింది. తనవిలక్షణమైన వ్యక్తిత్వం ఈ రెండు గీతాల వల్లనే లోకానికి వెల్లడైంది. శ్రీశ్రీ వ్యక్తిత్వం మరోప్రపంచంలో ఆకాశదీపాన్ని వెలిగించింది. ఆదీపం వెలిగింది 1934లో.

# శ్రీశ్రీ రాజకీయ దృక్పథం

మా ర్

"నేను సమున్నత కవితా శిఖరాలనుంచి
కమ్యూనిజంలోకి దూకుతాను !
కమ్యూనిజం నాహృదయం, అదివినా
నాకు ప్రేమలేదు."

—వ్లాడిమిర్ మయకొవ్‌స్కీ

ఏ రచయిత అయినా తాను నిజమనినమ్మిన విషయాలను ప్రచారంచేసి తనజాతి జనులను తనఅభిప్రాయాలవైపు మళ్ళించి ఆ ప్రకారంగా ఆచరించేట్టు చేయాలనే సంకల్పంతోనే రచనలు చేస్తాడు. తెలుగులో సోమన, ఆంగ్లంలో మిల్టన్. బన్యన్‌లు మతం ఆలంబనగా రచనలుచేసి తాము నమ్మినవిషయాలను వ్యాప్తిలోకి తేవటానికి కృషిచేశారు. వారి రచనల్లో కావ్యగుణమనేది కూడా పుష్కలంగా ఉండటంవలన వాటిని చాలాకాలంపాటు ప్రజలు ఆదరించారు. వర్తమాన సాహిత్యంలో 'మతం' వస్తువుగా స్వీకార్యమేనాఅంటే 'కాదేదీ కవిత కనర్హం' అనే అభిప్రాయంతో దాని ఆవశ్యకతానవశ్యకతలను గురించీ, ఉచితానుచితాలగురించీ ఎక్కువగా చర్చించకుండా వదలివేస్తున్నాను. అయితే ఏది ఉత్కృష్టమైంది. ఏది ప్రజాజీవితానికి ఎక్కువ సహాయకారి అనే విషయం ఉండనే ఉంటుంది.

మన తెలుగుసాహిత్యం దురదృష్టమేమోకాని మత్తులాంటి మతానికి, భావకవిత్వానికి వస్తుపీఠాన్ని కట్టబెట్టి చైతన్యకారి అయిన రాజకీయాలను మాత్రం అంటరానివన్నారు. ఈ విషయంలో కుటుంబరావుగారి అభిప్రాయం గమనించదగింది. 'సాహిత్యానికి రాజకీయాల స్పర్శ ఉండరాదనే మూఢవిశ్వాసం మొదటినుంచీ ఉన్నదికాదు. వాల్మీకీ, వ్యాసుడూ పచ్చిరాజకీయాలు రాసేశారు ;

పై పెచ్చు గెలుపొందిన పక్షాన చేరారు.'[1] అయినా ఇంకా 'నాకు ఏత్వం కాదొక తత్వం/మరికాదు మీరనే మన స్తతత్వం/కాదు ధనికవాదం, సామ్యవాదం' అంటూ దేనికీచెందని అయోమయమూ జరామయమూ అయిన తత్వంలో పడుతూనే ఉన్నారు. రాజకీయాలను దూరంగా ఉంచుతూనే ఉన్నారు. ఆధునిక సాహిత్యంలో రాజకీయాలకు శ్రీశ్రీతోనే వస్తుగౌరవం లభించిందనవచ్చు.

రచయిత ప్రతిరచనలోనూ అతడి దృక్పథం స్పష్టంగానో గౌణంగానో ప్రత్యక్షమౌతూనే ఉంటుంది. ఏ దృక్పథమూ, ఉద్దేశ్యమూ లేని రచనలుండవు- ఉంటే వాటిఅంత వ్యర్థమైనవి వేరే ఉండవు.

శ్రీ శ్రీలోనూ ఝుంఝూ ప్రభంజనాలకు సైతం సడలని ఒక దృక్పథం ఉంది. ఆదృక్పథం ఆయన ప్రతిరచనలోనూ కనిపిస్తుంది. వినోదంకోసం వ్రాసిన 'మూడుయాబైలు'లో సైతం ఆ దృక్పథం దర్శనమిస్తుంది. అదే మార్క్సిస్టు దృక్పథం.

అభ్యుదయ రచయిత అయినవాడు జీవితాన్ని, సంఘాన్ని, సాంఘిక పరిణామాన్ని సవ్యంగా, సమగ్రంగా అర్థంచేసుకొని జాతి జనులను మునుముందుకు నడిపించాలి. జీవితాన్నిగురించి ఇంతటి అవగాహన నివ్వగలది మార్క్సిస్టు దృక్పథమొక్కటి తప్ప మరేదీలేదు, మార్క్సిస్టు దృక్పథం లోపిస్తే జీవిత వాస్తవికతను తెలుసుకోలేడు. జీవితాన్ని గూర్చిన అవగాహనలేనివాడు ఇక అభ్యుదయరచనలేమి చేస్తాడు ?[2] శ్రీ శ్రీ ప్రత్యణువూ అభ్యుదయమే, అతడు అభ్యుదయ రచయిత, కాదు-జీవితాన్ని అంటే మార్క్సిస్టు దృక్పథాన్ని బాగా అర్థంచేసుకొన్న అభ్యుదయ సాహిత్య యుగకర్త.

శ్రీ శ్రీ భావాల్లోనేకాక భాషవిషయంలో కూడా మార్క్సిస్టు దృక్పథాన్నే అనుసరించాడు. గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజం నుండి మాత్రాబద్ధ ఛందస్సుల ప్రజాస్వామ్య యుగానికి ఆంధ్రసాహిత్య చరిత్ర గమనాన్ని పరివర్తనచేసిన గురజాడకు నిజమైన వారసుడు. పాతపదాలు, డిక్షన్, వర్ణనలు, అలంకారాలు, ఛందస్సు, ఉపమానాలు, పద్ధతులు, ఆచారాలు, కవిత్వంలోవీ, జీవితంలోవీ

1 సాహిత్య ప్రయోజనం (సాహిత్యమూ రాజకీయాలు) కొ. కు.

2 కుటుంబరావుతో ఇంటర్వ్యూ : సృజన-13వ సంచిక (అక్టోబర్-డిసెంబర్)

ఇంక మళ్ళీ లేవకుండా వాటినడ్డ విరగ్గొట్టి చదునైన రోడ్డువేసిన అభ్యుదయ కవుల మార్గదర్శకుడు. తన గీతాలు జాతిజనులంతా పాడుకునేవిగా ఉండాలంటే మరి వారు వాడుకునే భాషనే కావ్యస్థం చేయాలి. శ్రీ శ్రీ ఆపనిచేశాడు. శ్రీ శ్రీ ప్రతిరచనా అందరికీ అర్థమౌతుందా అంటే కాదనే చెప్పాలి, అయితే ఆయన రచనల్లో 80 శాతము అంతంతమాత్రంగా చదువుకున్న ప్రతివారికీ అర్థమౌతుంది అని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇంతెందుకు "ఓస్, ఇలాంటి కవిత్వాలు నేనూ రాయగలను"[3] అనే ఆత్మవిశ్వాసం కుర్రాడిలో సైతం కలిగిస్తుందంటే ఆయన భాష సామాన్య ప్రజానీకానికి ఎంత చేరువలోఉందో అర్థంచేసుకోవచ్చు.

శ్రీ శ్రీ రచనల్లో మార్క్సిస్టు దృక్పథం ఎంతగా కలగలసి పోయిందని పరిశీలించడానికిముందు మార్క్సిజం యొక్క మూల సూత్రాలేమిటో సూత్రప్రాయంగా తెలుసుకోవాలి. ఇది ముఖ్యంగా వర్గపోరాటం, శ్రామికవర్గ ఆధిక్యత నాస్తికత, శాస్త్రీయదృక్పథం, ఇంకాముఖ్యంగా ఆర్థిక అసమానతల తొలగింపు' లపై ఆధారపడిఉంది. ఇవన్నీ శ్రమజీవి కేంద్రితాలే.

శ్రీ శ్రీ దాదాపు ప్రతికవితలోనూ శ్రామికుణ్ణే సంకేతించి

సంఘపశూ, శ్రమైకజీవీ !
శరీర పరీవృతుడా,
ఘర్మవరష పయోదుడా,
రక్తకణ సమిష్టి కుటుంబీ,
కష్టజీవీ, కార్మికుడా, మానవుడా !
కూలీ, మాలీ, రైతూ,
గుడిసెలలో బ్రతికేవాడా,

తిరుగబడేవాడా, ప్రశ్నించేవాడా !

అంటూ వారిని గురించే వ్రాస్తాడు.

3 నా కవిత్వం-శ్రీ శ్రీ—'కళాకేళి' మార్చి '69

ఆయన కవితను అందని అందాన్నిగా భావించి, చీకటిలో ఒకడై స్రుక్కి, చివరకు చిరదీక్షా తపస్సమీక్షణలో చూచిన చిత్ర విచిత్రశ్యమంతరోచిర్ని వహం ఏమిటి ?— కడు బాధావహమైన సమ్మెకట్టిన కూలీల, సమ్మెకట్టిన కూలీల భార్యల, బిడ్డల, ఆకటి చీకటి చిచ్చుల హాహాకారం, ఆర్తారావంఘూర్ణిల్లే దృశ్యం. అంతటితో ఆగలేదు దృశ్యం. నిరపరాధులై చెరసాలల్లో చిక్కేవాళ్ళు, లోహ రాక్షసుల పదఘట్టనచే కొన ప్రాణంతో కనలేవాళ్ళు, కష్టంచాలక కడుపుమంటచే తెగించి సమ్మెలు కట్టేవాళ్ళు, ఇంకా కార్మిక ధీరుల కన్నులనిండా విలాపాగ్నులు, విషాదాశ్రువులు నిండిన దృశ్యాలెన్నో దర్శించాడు. బేరీజు వేయజాలం. ఈయన సోమరితనాన్ని, పరాన్న భుక్కులైన సోమరులను క్షమించలేడు. అందుకే "ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులారా చావండి" [4] అంటూ తీవ్రంగా ఏవగించుకున్నాడు. అందుకే ఆయన కేవలం కష్టజీవులకు, కర్మ వీరులకు నిత్య మంగళం నిర్దేశిస్తూ స్వస్తి వాక్యాలు పలికాడు; కార్మిక లోకపు కళ్యాణానికి, శ్రామిక లోకపు సౌభాగ్యానికి బాటలుతీస్తూ పాటలు వ్రాశాడు. ఈయన విరచించి వినిపించే నవీన గీతికి శరీర కష్టం స్ఫురింపజేసే సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలే భావం, భాగ్యం, ప్రాణం, ప్రణవం. ఒక్కమాటలో మార్క్సిస్టు భాషలో చెప్పాలంటే దగాపడిన తమ్ముల (Exploited Proletariat) గురించి వ్రాశాడు.

'అవగుణాల కుప్పలు, ఉత్త మొద్దురాచిప్పలు, నూతిలోని కప్పలు'* అయిన నడిమి తరగతి వారిపట్ల సానుభూతి లేదీయనకు. స్వార్థపూరిత కారణాలచేత వీరెప్పుడైనా విప్లవకారులైన శ్రామికులతో పొత్తు కలిస్తే కలువ వచ్చుగాక కానీ వీరువస్తుతః విప్లవ ప్రతీఘాతకులు.[5] బూర్జువావర్గంపట్ల తనకుగల ద్వేషాన్ని అనువాదాల్లో సైతం ప్రకటించాడు.

4 ఈ పాదాల వెంటనే నాకో విషయం గుర్తుకొస్తుంది. ఆరేడు సంవత్సరాల క్రితం రావచ్చు. ఒక కవి ఛీఛీ ఇంత క్రూర స్వభావమా, సోమరులు, చేతగానివారు అంతా చావవలసిందేనా అంటూ ఈ ధోరణిపట్ల తీవ్రమైన అభ్యంతరం తెలుపుతూ వ్యాసముఖంగా ఆవేదన వెళ్ళబోసుకొని తమ 'సర్వ మానవ కళ్యాణేచ్ఛ'ను నాకేమో ఈ లోకంలో మంచివారు మచ్చుకైనా కలికం వేసుకున్నా కానరావడం లేదు కనుక 'నరమేధం చేయాలని ఉంది' అంటూ భీషణంగా, తాండవ నృత్య సహితంగా గానం చేశారు!

5. Manifesto of the communist Party Pp 60–61

* మూడు యాభైలు

ఔనుమరి బూర్జువా వర్గమన్నా,
పోలీసు రాజ్యం
పూజారి రాజ్యం అన్నా
నాకు విపరీతమైన ద్వేషం

ఈ ద్వేషగీతం చాలా బాగుందని ఎవడైతే అనడో (అనకపోతే వాడూ బూర్జువానే మరి) ఆ దొంగతొత్తు కొడుకు మొగంమీద ఉమ్మేతాడట. ఎంత కసి, ఎంత ద్వేషం, పాల్ ఎలార్డ్ భావమే కావచ్చు. ఆ భావంతో తానెంతగా మమేకం కాకపోతే ఆ తీవ్రత, ఆ ఓజస్సు వస్తుంది.

శ్రీశ్రీ మార్క్సిస్టు దృక్పథం కొట్టవచ్చినట్లుగా కనిపించే ముఖ్యమైన గేయం దేశచరిత్రలు. ఈ గేయంలో Manifesto సారాంశమంతా వడపోసాడు. 'ఏ దేశచరిత్ర చూసినా ఏమున్నది గర్వ కారణం' మొదలు మాయలతో మారు పేర్లతో చరిత్ర గతి నిరూపించినవి' వరకు గల పాదాలు The history of all hitherto existing society is the history of Class struggles. (ఇంతవరకూ నడుస్తూ వచ్చిన చరిత్ర అంతా వర్గ పోరాటాల చరిత్ర) అనే Manifesto లోని మొదటి వాక్యానికి సోదాహరణ వ్యాఖ్య వంటివి.

'ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం. ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. సామాజిక చారిత్రక పరిణామ గమనంలో కవియొక్క స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతి శీలీ ప్రతిభాశాలీ అయితే ఈ గమనాన్ని అతడు మరింత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించుతాడు.[6] శ్రీశ్రీ తన 'దేశచరిత్రలు'తో ఈపనిచేశాడు. ఇదొక్కటే కాదు. నీడలు, చేదుపాట, జగన్నాథుని రథ చక్రాలు వంటి గేయాలతో పేద శ్రామికులను

మనదీ ఒక బ్రదుకేనా ?
కుక్కలవలె నక్కలవలె !
మనదీ ఒక బ్రదుకేనా ?
సందులలో పందులవలె !

6 గురజాడ – శ్రీశ్రీ పుట 46

అని తమ్ము తాము ప్రశ్నించుకొనేట్లు చేయడమేగాకుండా వెనుకదగా ముందు దగా / కుడి యెడమల దగాదగా / అనే లౌకిక వాస్తవాన్ని కూడా గ్రహింపజేశాడు. బలహీన వ్యక్తులనూ, జాతులను పీడించే బలవంతుల, ధన వంతుల దౌర్జన్యాలూ పన్నాగాలూ ఇకపై సాగవు అని హరీంద్ర గర్జన చేశాడు.

ఈ సందర్భంలోనే శ్రీశ్రీ ప్రపంచకార్మికులంతా ఒకటే, అందరిదీ ఒకే జాతి అని చాటిన విషయంకూడా మనం గమనించాలి.

చీనాలో రిక్షావాలా,
చెక్ దేశపు గని పనిమనిషీ,
ఐర్లాండున ఓడ కళాసీ,
అణగారిన ఆరులందరూ

చారిత్రక యదార్థతత్వం
చాటిస్తా రొకగొంతుకతో [7]

ప్రపంచకార్మికులంతా ఏకమైతేనే ధనిక స్వాముల దౌర్జన్యాలను, మనీ (ప్రీవీ)పర్సు మహారాజుల మిథ్యావాదాలను తుదముట్టించగలరు. జాతీయత అనేది బహుప్రమాదకరమైన విషయం.[8] అట్లాంటి పరిపూర్ణ అవగాహన ఉండ బట్టే 'సరిహద్దులెరుంగని సకల జగజ్జనుల'ను సంబోధిస్తాడు; అందుకే 'నాయింటి పేరు ప్రపంచం, ప్రజలే నా కుటుంబం' అంటాడు.

మార్క్సిజం సంపూర్ణంగా గతితార్కిక భౌతిక వాదంపై ఆధారపడి ఉంది. ఇది పూర్తిగా నాస్తికమైందేకాక అన్నిమతాలకూ వ్యతిరేకి.[9] శ్రీశ్రీ కవితల్లో నాస్తిక ధోరణి పుష్కలంగా కనిపిస్తుంది. చూడండి—

7 The working men have no country (శ్రామికులకు ఒక దేశమంటూ ఉండదు) - Mainfesto P.76

8 Nationalism in India - R. Takore

Nationalism is a great meuace. It is the particular thing which for years has been at the bottom of India's troubles.

9 On Religion - Lenin P.17

ఈశ్వరుడొకడే సత్యం
ఇతర సమస్తం మిథ్యట
ఇంద్రియాలద్వారా మన
కీ సత్యం తెలియదంట
విశ్వాసం తప్ప మనకి
వేరే సాక్ష్యం లేదట

అంటూ 'సదసత్సంసయం' మొదటి భాగంలో అనంతంగా టకారాలతో వెటకారం చేస్తాడు. శ్రీశ్రీలోని శాస్త్రీయ దృక్పథం, నాస్తికతక్లుప్తంగా చెప్పలేం. 'సదసత్సంశయం' రెండవ భాగంలో ఈ రెండూ పెనవేసుకొని దర్శన మిస్తాయి. గజేంద్రమోక్షంకథలోని నీతిని సరియైన సరికొత్త కోణాల్లో చూపు తాడు. అసలు దేవుడనేవాణ్ణి సృష్టించడం రాచకపురోజుల్లో సమాజం ఎగుడు దిగుడుగా ఉండటము సమర్థించడానికీ, పాలకవర్గాధిక్యం నిలపడంకోసం మనిషిని తగ్గించి అభూతమైనవాణ్ణి, ఉగ్గడించడానికీ జరిగిందంటాడు. జన్మం చర్మం సంప్రదాయం, ఇప్పటి సమాజం నెరపే అసమానతలు పనికిరావంటాడు. 'సమష్టిసూత్రం మాత్రం సరైనవిధానం' అంటాడు.

బూర్జువావర్గం ఎప్పుడూ మతాన్ని, ఆచారాన్ని తాము శ్రామికవర్గాన్ని దోపిడి చేయడాన్ని సమర్థించుకోవడానికే వినియోగిస్తుంది.[10]—

"అన్యాయం! అన్యాయం!" అని మేమంటే
"అనుభవించాలి మీకర్మం" అంటాడు.
"ఘోరం ఇది, దారుణం ఇదం"టే
"ఆచారం! అడుగుదాటరాదం"టాడు.

ఈ పాదాల్లో శ్రీశ్రీ బూర్జువా ధోరణులను చిత్రించడంతోపాటు, మతాలు ప్రచారంచేసే కర్మ, ఆచారం అనే వ్యర్థపదాలను అధిక్షేపిస్తున్నాడు.

సమస్యా పరిష్కారానికి అస్తిత్వమే సందేహాస్పదమైన 'కలడోలేడో'ల సహాయమర్థించడు శ్రీశ్రీ

10 On Relgion – Lenin. P.17

మెదడన్నది మనకున్నది
అదిసరిగాపనిచేస్తే
విశ్వరహఃపేటికా వి
పాటన జరగక తప్పదు

అని ప్రతివ్యక్తికీ ఆత్మ విశ్వాసాన్నీ, ఆత్మబలాన్నీ సరఫరా చేస్తాడు.

సృష్టిలోని వస్తుసముదాయమంతా సమష్టి ఆస్తి. అది ఏ ఒక్క వ్యక్తో చేజిక్కించుకోవడం అన్యాయం. అందుకే అసలు వ్యక్తిగత ఆస్తినే రద్దు చేయాలనేది కమ్యూనిజం మూలసూత్రం.[11]

ఐశ్వర్యం అందరిదీ
అందుచేత అందులోన
సామాన్యుడు తనవాటా
తనకిమ్మని కోరుతాడు

అన్నీ ఒక్కడికి బదులు
అంతమందికి అన్నీ !

అంటాడు. ఆ అవగాహన కలవాడు కాబట్టే అంతా కలసిచేసినవస్తు సముదాయమంతా ఒక్కడే ఎత్తుకుపోతే చూచి ఊరుకోలేడు. తనుకలలుకనే 'భవిష్యదుజ్జ్వల ధర్మయుగం'లో ఉత్పత్తిసాధనాలు శ్రామికులచేతుల్లో ఉండటమేకాక పారిశ్రామిక వ్యావసాయిక సహసమానాభివృద్ధి, ప్రతి కుటుంబానికి ఒకనివాసగృహం, ప్రతి వ్యక్తిచేతికీ ఒక పని కలుగుతుందంటాడు.

శ్రీశ్రీలో కనిపించే మార్క్సిస్టు దృక్పథం చూపడానికి ఇంకా ఎన్నైనా నిదర్శనలు చూపవచ్చు. అరువులిచ్చి కరువుతెచ్చి, రుణంపెట్టి రణంతెచ్చే పెట్టుబడిదారీ విధానంపట్ల వ్యతిరేక ధోరణి, ఎల్లడలా ఎగరేసిన ఎఱ్ఱని జండాలూ,

11 Mainfesto Pp. 66-67 — The theory of communists may be summed up in a single sentence: Abolition of Private Property (కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ఒక మాటలో చెప్పాలంటే వ్యక్తిగత ఆస్తిని రద్దుపరచడం).

లెనిన్‌ను గురించి మయకోవ్‌స్కీ గొంతుతో గానం చేయటమూ దేన్ని వ్యక్త పరుస్తవి ? 'పాడిచేస్తామని చెప్పిన మన కాంగ్రెసువారు తడి రాష్ట్రాలన్నిటిని "పాడి" చేస్తున్నారు' అని హేళనచేస్తే ఆయన దృక్పథం స్పష్టం కాకపోవచ్చు. 'మున్నుడి'లో తనంతటతానే 'బోల్షివిక్కు' నని చెప్పుకున్నాడు.

శ్రీశ్రీ రాజకీయ దృక్పథం జ్వాల (28 మార్చి, '69) కిచ్చిన ఇంటర్వ్యూలోనూ, ప్రగతి వారపత్రిక (మే, జూన్, జూలై, '69)లో ఆయన ఇచ్చిన జవాబుల్లోనూ స్పష్టంగా కానవస్తుంది.

జ్వాలలో ఆయన విప్లవమంటే సాయుధ విప్లవమేనని భారతదేశంలోని పెద్దపులికూడా కమండలం పట్టుకొని హిమాలయాలకు పోలేదంటూ చమత్కారంగా వివరించాడు. మావో ఆలోచనా విధానం మౌలికంగా సరియైనదేననీ, ఆ ఆలోచనా విధానాన్ని కమ్యూనిస్టులు నీళ్లలో చేపలమాదిరిగా ప్రజల్లో కలిసిపోయి విరివిగా ప్రచారంచేయాలన్నాడు. గజ్జల మల్లారెడ్డి శంఖారావానికి రాసిన ముందుమాటలోనూ (వృశ్చిక సంతానంపై మందలింపు) ఈ ధోరణే స్పష్టమవుతుంది. రష్యా సామ్రాజ్యవాద ధోరణులు చూపుతున్నదేమోనని కూడా అనుమానం వెలిబుచ్చాడు. ఈ అభిప్రాయాలద్వారా మనకు శ్రీశ్రీలోని తీవ్రవాద ధోరణి స్పష్టంగా గోచరమౌతుంది. ఈయనకు గాంధీజీ సిద్ధాంతాలు మనల్ని వెన్నెముకలేని జంతువుగా చేశాయని నమ్మకం. అహింస ఒక ఆశయంమాత్రమే. ఆశయం సిద్ధించడానికి కత్తి కావాలిమరి అంటాడు. అందుకే ఆర్థిక సమానత్వాన్ని సాధించడానికి తన షష్ఠిపూర్తికి యువకులకు 'కత్తినే కానుకగా బహూకరించడం నా అభిమతం' అంటాడు.

శ్రీశ్రీలో ఒక బలహీనత కనిపిస్తుంది. సాయుధ విప్లవం సమర్థిస్తాడు. శ్రీకాకుళంవెళ్ళి పీడిత గిరిజనులను ఉత్తేజపరుస్తానంటాడు. సిద్ధాంతరీత్యా తీవ్ర విభేదాలు వచ్చినపుడు అతకడమనేది ఉండదని ఒక పక్క అంటూనే అందరు కమ్యూనిస్టుల్నీ సమానంగా గౌరవిస్తానంటాడు. 'రష్యా, చైనా, క్యూబా, అల్బేనియా ఈ దేశాల్లో దేన్ని తిట్టినా సహించలేనం'టాడు. విస్పష్టమైన ఆశయాలూ అభిప్రాయాలతోపాటు ఇట్లాంటి ఊగిసలాడే బాల్య చేష్టలు వాంఛనీయంకాదు.

నిజంగా గొప్పవాడైన కళాకారుడూ, రచయిత విప్లవ సంబంధియైన బహుప్రధానమైన అంశాల్లో కొన్నింటినైనా ప్రతిబింబించాలి.[12] శ్రీశ్రీ తన రచనల్లో దాదాపు అన్ని అంశాలనూ ప్రతిబింబించాడు.

తన కవితాఖడ్గంతో జగన్నాథ రథచక్రాలను భూమార్గం పట్టించి దగా పడిన తమ్ములందరితో అంటున్నాడు :

ఈలోకం మీదేనండి !
మీ రాజ్యం మీరేలండి.

12 On Literature & Art Lenin. P. 28

# గురజాడ వారసుడు శ్రీశ్రీ

నవీన్

ఏ సాహిత్యంలోనైనా ఒక గొప్పరచయిత ఉద్భవించి ఆ సాహిత్యాన్ని ఎంతో ముందుకి తీసుకుపోవాలంటే ఆ సాహిత్యం ఇదివరకే కొంత అభివృద్ధి చెందిఉండాలి. పూర్తిగా వెనుకబడిన సాహిత్యంలో అకస్మాత్తుగా ఒక గొప్ప రచయిత ఉదయించటానికి అవకాశం లేదు. ఏ రంగంలోనైనా అభివృద్ధి అన్నది ఒక పరిణామ క్రమంలో సాగుతుంది. అలాగే సాహిత్యంలో కూడా. తెలుగు సాహిత్యం నన్నయ్యనుండి నేటివరకు ఒక పరిణామక్రమంలోనే అభివృద్ధి చెందుతూ వస్తున్నది.

కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావులతో తెలుగు సాహిత్యంలో ఆధునిక యుగం ప్రారంభమైంది. సమాజపరంగా ఆంధ్రులచరిత్రలో కందుకూరి వీరేశలింగంతో ఆధునిక యుగం ప్రారంభమైతే సాహిత్యపరంగా గురజాడ అప్పారావు ఆధునికయుగం ప్రారంభమైంది. అయితే గురజాడ అప్పారావు ఆధునిక యుగానికి ఒకమార్గాన్ని చూపించిపోయాడు. గురజాడ ప్రారంభించిన మార్గంలో చాలాదూరం పయనించి, ఎన్నో కంటకాలను తొలగించి, ఆమార్గాన్ని చాలాకాలం వరకు నిలచేలా కట్టుదిట్టంచేసి దాన్నొక జాతీయ రహదారిగా నిర్మించిన వాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ అనే ఒక మహారచయిత రావటానికి తగినట్లుగా తెలుగు సాహిత్యంలో పునాదులు వేసినవాడు గురజాడ అప్పారావు. తెలుగు సాహిత్యంలో గురజాడకు వారసుడు శ్రీశ్రీ. శ్రీశ్రీకి గురజాడను గూర్చి తెలియకపూర్వం విశ్వనాథ సత్యనారాయణ ప్రభావంలో కొట్టుకుంటున్నాడు. గురజాడనుగూర్చి తెలుసుకున్నాకగాని శ్రీశ్రీ ఆ ప్రమాదంలో నుంచి బయటపడలేదు.

ఆమధ్య ఒక సభలో విశ్వనాథ సత్యనారాయణ "ఈ శ్రీశ్రీ వచ్చి ప్రతివాడి చేతా కవిత్వం రాయిస్తున్నాడు" అని శ్రీశ్రీ ఏదో పెద్దనేరం చేసినట్లుగా

అన్నాడు. కాని శ్రీశ్రీ ఈ మాటను పెద్ద కాంప్లిమెంట్‌గా తీసుకున్నాడు. ప్రతి వాడూ కవిత్వం రాయాల్సిందే. కవిత్వమంటే అదేదో తలనెరిన పండితులకు సంబంధించిన వ్యవహారం అనుకున్నన్నాళ్లు సామాన్య ప్రజాబాహుళ్యానికి కవిత్వంతో సంబంధం ఏర్పడదు. సామాన్య ప్రజాబాహుళ్యానికి కవిత్వానికి ఒక విడదీయరాని బంధం యేర్పడితేనే ఆ కవిత్వంవల్ల నిజమైన సాంఘిక ప్రయోజనం సిద్ధిస్తుంది.

కవిత్వాన్ని సామాన్య ప్రజల్లోకి తీసుకుపోయింది శ్రీశ్రీ. ఈనాడు ఎక్కడ చూసినా కవితా సంకలనాలు వెలువడుతున్నాయి. ఊరూరా. వాడవాడలా సాహిత్యవ్యాసంగం వెల్లివిరుస్తోంది. ఒకనాడు కవిత్వమంటే రాజులకు, జమీందార్లకు మాత్రమే ఆస్వాదనీయమని, పండితప్రకాండులు మాత్రమే అది రాయటానికి అర్హులనీ అనుకునేవాళ్లు. ఆర్థిక రంగంలో సాగిన ఫ్యూడలిజమే సాహిత్యంలోనూ సాగింది. సాహిత్యంలోని ఈ ఫ్యూడలిజాన్ని మళ్ళీ లేవకుండా నడ్డి విరగ్గొట్టినవాడు శ్రీ శ్రీ. శ్రీ శ్రీ ఈనాడు సాధించిన ఈ మహావిజయానికి మొదలు బలమైన పునాదుల్ని వేసిపోయినవాడు గురజాడ అప్పారావు. ఈనాడు తెలుగు సాహిత్యం శాఖోపశాఖలుగా విస్తృతమవడానికి కారణం ఒకప్పుడు గురజాడ వేసిన ఆ కట్టుదిట్టమైన పునాదులే.

కవిగా శ్రీశ్రీ పరిపక్వం చెందాక, కవిగా తనలక్ష్యమేమిటో స్పష్టంగా నిర్దేశించుకున్నాక గురజాడను తనగురువుగా, తననాయకునిగా, తనమార్గదర్శకునిగా స్వీకరించాడు.

శ్రీశ్రీ తన సొంతగొంతును వెతుక్కుంటున్న రోజుల్లోనే గురజాడను చదివాడు. గురజాడను చదవటంలోనే శ్రీశ్రీ తననుతాను తెలుసుకున్నాడు. తన మార్గమేమిటో శ్రీశ్రీకి స్పష్టమైపోయింది. గురజాడ చూపించిన దోవలో వెడితే తన గమ్యాన్ని చేరగలనన్న దృఢవిశ్వాసం అతనిలో కల్గింది.

గురజాడలోని ముందు చూపుని, విశాల దృక్పథాన్ని చక్కగా గుర్తించి ప్రచారంచేశాడు శ్రీశ్రీ. గురజాడ చూపించిన మార్గంలో వెడితే తెలుగు భాషను, తెలుగుసాహిత్యాన్ని ఎంతో వేగవంతంగా ఎంతో ముందుకు తీసుకెళ్లవచ్చునని గుర్తించాడతడు." అడుగుజాడ గురజాడది, అదిభావికిబాట, మనలో వైధవ్యాయత్వం మరపించేపాట" అనిగానం చేశాడు.

ఆధునిక సాహిత్యానికి విప్లవనాయకుడుగా గురజాడను తానెందుకు గుర్తించాడో వివరిస్తూ శ్రీశ్రీ నాలుగు కారణాలను పేర్కొన్నాడు. ఈ నాలుగు కారణాలను శ్రద్ధగా గమనిస్తే సాహిత్యపరంగా శ్రీశ్రీ గురజాడకు వారసుడని స్పష్టమైపోతుంది.

గురజాడ ఆధిక్యానికి శ్రీ శ్రీ చెప్పిన మొదటికారణం యిది.

"ఏ కవికైనాసరే అతనిచుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. సామాజిక, చారిత్రక పరిణామగమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలీ అయితే అతడు ఈ గమనాన్ని మరింతవేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకు నేను నమస్కరిస్తున్నాను." గురజాడ తర్వాత తెలుగు సాహిత్యంలో శ్రీశ్రీ చేసినపనికూడా అదే. సామాజిక పరిణామాన్ని విప్లవపంథాలో మరింత వేగవంతంగా నడిపిన మహాకవి శ్రీశ్రీ. గురజాడ సామాజిక పరిణామాన్ని విప్లవపంథాలో పడవేసి పోవడం వరకే చేశాడు. ఒక పోలిక చెప్పాలంటే స్టీవెన్సన్ ఆవిరి ఇంజన్‌ను కనిపెట్టి ఆధునిక ప్రయాణసాధనాలకు మూల పురుషుడైతే ఇంజన్లను నేటి రాకెట్ ఇంజన్లదాకా తీసుకుపోయారు స్టీవెన్సన్ తర్వాతి శాస్త్రజ్ఞులు. గురజాడ స్టీవెన్సన్‌లాంటి వాడైతే శ్రీ శ్రీ రాకెట్ ఇంజన్లను సృష్టించినవాడు.

గురజాడ ఆధిక్యానికి శ్రీశ్రీ చెప్పిన రెండో కారణం గురజాడలోని ముందు చూపు. 'మంచిగతమున కొంచెమేనోయ్' అని చెప్పిన గురజాడలోని సాహస వంతమైన ముందుచూపు శ్రీశ్రీని ఆకర్షించింది. గ్రీక్ రోమన్ సంస్కృతి వేపు మళ్ళిన టి. ఎస్. ఎలియట్లను, వేదకాలంవేపు వళ్ళిన మన విశ్వనాథ సత్యనారాయణలను ఉద్దేశించి "ఆపీనుగులు మనలాగే ఏడుస్తూ ఉండేవారు. మనకంటె అధ్వాన్నంగా ఉండేవారు." అని అనగల్గిన గురజాడ అప్పారావు శ్రీశ్రీకి నాయకుడయ్యాడు. అప్పారావులోని ఈ ముందుచూపుని, భవిష్యత్తుమీది ప్రగాఢ విశ్వాసాన్ని శ్రీశ్రీ తన స్వంతం చేసుకున్నాడు. తన చూపు ఎప్పుడూ భవిష్యత్తు మీదే ఉంటుందని శ్రీశ్రీ ఎన్నోసార్లు చెప్పుకున్నాడు. మనిషి ఇంతవరకు సాధించిన విజయాలకంటె ఇకముందు సాధించబోయేవే ఎక్కువ అని చరిత్ర రుజువు చేస్తున్నది. ఈ ఆరోగ్యకరమైన శాస్త్రీయదృక్పథాన్ని శ్రీశ్రీ గురజాడలో చూశాడు.

గురజాడ ఆధిక్యానికి శ్రీశ్రీ చెప్పిన మూడో కారణం గురజాడ తెలుగు సాహిత్యంలో ప్రారంభించిన వ్యావహారిక భాషోద్యమం. గురజాడ వ్యావహారికాన్ని వచనంలో, ముఖ్యంగా 'కన్యాశుల్కం'లో విజయవంతంగా ప్రయోగించి వ్యావహారిక భాషలోని సొగసును, పటిష్ఠతను, సరళతను అందరికీ చూపించాడు. కాని కవిత్వంలో గురజాడ వ్యావహారికాన్ని ఉపయోగించినా చెప్పుకోదగ్గ విజయాన్ని సాధించలేకపోయాడు. ఆయన మాత్రా ఛందస్సులో వ్యావహారిక భాష అంతగా చోటు చేసుకోలేకపోయింది. కాని కవిత్వంలో వ్యావహారికాన్ని విరివిగా, విజయవంతంగా ప్రవేశపెట్టి ఈనాటి వచన కవితకు దారి తీశాడు శ్రీశ్రీ. గురజాడ అప్పారావు రాయతలపెట్టిన 'కళింగదేశ చరిత్ర'ను గ్రాంథికంలో రాస్తేనే ప్రచురిస్తామని ఆనాటి ప్రచురణ కర్తలు–విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వారు– కోరితే "నాది ప్రజల ఉద్యమం— దానిని ఎవరిని సంతోషపెట్టడానికీ వదులుకోలేను" అని జవాబిచ్చాడట.

వ్యావహారిక భాషోద్యమాన్ని ప్రజల ఉద్యమంగా స్వీకరించిన గురజాడ శ్రీశ్రీకి సరియైన నాయకుడయ్యాడు. గురజాడ కాలంలో మొగ్గగానే ఉన్న ఆ ప్రజల ఉద్యమాన్ని వికసింపజేసి ప్రజా బాహుళ్యానికి, సాహిత్యానికి ఒక బలమైన సాన్నిహిత్యాన్ని యేర్పరచినవాడు శ్రీశ్రీ. ఈనాడు సాహిత్యం రాయటమైనా, చదవటమైనా ప్రజలకు మంచినీళ్ళ ప్రాయమై పోవటానికి గురజాడ తర్వాత శ్రీశ్రీ కారకుడు.

గురజాడ ఆధిక్యానికి శ్రీశ్రీ చెప్పిన నాలుగో కారణం గురజాడలోని సార్వజనీనత. "తక్కిన వాళ్ళంతా తెలుగు దేశంలో యోధాను యోధులైతే ఒక్క గురజాడ మాత్రమే ప్రపంచంలో ఎప్పటి ప్రామాణ్యాలకైనా నిలవగల సార్వజనీనతను సాధించినవాడు" అన్నాడు శ్రీశ్రీ. సరిగ్గా ఆ సార్వజనీనతే శ్రీశ్రీలోనూ ఉంది. జాతి, మత, దేశ, కాలాలకు అతీతమైన ఒక విశాల మానవత్వ దృక్పథాన్ని శ్రీశ్రీ గురజాడనించే నేర్చుకున్నాడు.

ఇలా గురజాడలోని మౌలికమైన సాహితీ సాంప్రదాయలను శ్రీశ్రీ తన స్వంతం చేసుకొని తెలుగు సాహిత్యాన్ని ఎంతో పరిపుష్టం చేశాడు. అందుకే నరకంలో శ్రీశ్రీని చూసినపుడు "నువ్వింకా కొంతకాలం మన తెలుగు దేశంలో ఉండాల్సింది" అన్నాడుట గురుజాడ. కొంతకాలమేమిటి. చాలకాలమే

ఉన్నాడు. గురజాడ ఊహామాత్రంగానే దర్శించిన ఒకమహా ఉద్యమాన్ని నిజం చేశాడు. గురజాడ కన్న కలల్ని పండించాడు. గురుజాడ చేయెత్తిచూపిన మార్గాన్ని తరతరాలవరకు చెరిగిపోని ఒకజాతీయ రహదారిగా నిర్మించాడు. తెలుగు సాహిత్యాన్ని శాఖోపశాఖలుగా విస్తృత పరచాడు. అందరూకవిత్వం చదివేలా, కవిత్వం రాసేలా చేశాడు. ఈనాడు తెలుగుదేశం గురజాడ గొప్పతనాన్ని గుర్తించిందంటే అందుకు కారకుడుశ్రీశ్రీ. అయితే తెలుగుదేశం గురుజాడకు తగినంత గౌరవం ఇవ్వటంలేదన్న అసంతృప్తి శ్రీశ్రీలో ఇంకాఉంది. "సృజన" పత్రిక కిచ్చిన ఇంటర్వ్యూలో ఈనాటికైనా తెలుగుదేశం గురజాడను తగినంతగా గౌరవిస్తోందని మీరనుకుంటున్నారా అన్న ప్రశ్నకు జవాబిస్తూ శ్రీశ్రీ అన్నాడు– "తెలుగు దేశంలో గురజాడకు రావాల్సినంత గౌరవం ఇంకా రాలేదు. ఆ మధ్య విశాఖపట్నంలో నాకాంస్య విగ్రహాన్ని నిలుపుతామని కొందరు స్నేహితులు నాతో అన్నారు. కాని గురజాడకు లేకుండా కాంస్య విగ్రహం నాకక్కర్లేదన్నాను.

తన నాయకుని పట్ల ఇంత గురిఉన్న వారసులు చాలా అరుదుగా కన్పిస్తారు.

# మహాకవి

— ఎస్. వి. ఎస్. రావు

నవ్యాంధ్ర సాహిత్య సారధియైన శ్రీశ్రీకి హేమంతంతో అరవై ఏళ్లు నిండినా అతని కవితాకుమారి యింకా పదునాఱు వసంతాల సీమంతినిగా శోభించడమే మహాకవి అనడానికి నిదర్శనం. సంప్రదాయవాదులు కూడ ఆధునిక యుగంలో అగ్రగణ్యుడని గుర్తించడంతోపాటు, శ్రీశ్రీ కవిత్వ తత్త్వంపై ఎన్నో వ్యాసాలు, సమీక్షలు యిదివరకే వచ్చాయి. అందుచేత నాబోటి అనుచరులు, ఆరాధకులు అభినందించడంకన్న చెయ్యగలించేదేమీ లేదు. కాని యిటీవల వెలువడిన శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారి వ్యాస సంపుటిపై చెలరేగిన వాదోపవాదాలు శ్రీశ్రీ సాహిత్యంపై అపోహలను, అపార్థాలను గమనించవలసిన బాధ్యత తీరిపోలేదని ఋజువు చేసాయి. ఆంధ్ర సాహిత్యంలో శ్రీశ్రీ స్థానాన్నిగూర్చి సరియైన అవగాహన అభ్యుదయ దృక్పథానికి గీటు రాయిగా పరిగణించవచ్చు.

"శ్రీశ్రీ చేసింది పాతదన్న ప్రతిదాన్నీ ధ్వంసం చెయ్యడంకాదు. పాతననుసరిస్తూనే ఒక మహానూతనత్వాన్ని స్థాపించడం. విప్లవమంటే Total Change అని రా.రా. భావం అనిపిస్తుంది" అంటారు అద్దేపల్లి వారు (సంవేదన – 1969 జనవరి సంచిక). నన్నయ్యతో ప్రారంభమైన వెయ్యి సంవత్సరాల సాహిత్య చరిత్రలో శ్రీశ్రీ అపూర్వమైన విప్లవాన్ని సాధించడం గుర్తించకపోతే అతని కవిత్వంపై ఎలాంటి చర్చలైనా వ్యర్థమనే భావించాలి. అంటే నా ఉద్దేశం తిక్కన, శ్రీనాథాది ప్రాచీన కవులకన్నా శ్రీశ్రీ ప్రతిభావంతుడని సూచించడంకాదు. పూర్వాంధ్ర సాహిత్యంలో విశ్వస్థాయిలో కూడ గణనీయమైన కవులు ఉదయించినా వారి కృషిని భారతీయ సాంఘికవ్యవస్థ క్రుంగదీసింది. కావ్య ప్రయోజనం మనోరంజనంతో ధర్మప్రబోధమని మన ప్రాచీనులు గుర్తించినా ఆనాటి ధార్మిక చింతన పాలక వర్గానికి ప్రోద్బలమివ్వడానికి ఉపయోగపడిందికాని సంఘసంస్కారణకి మార్గదర్శిని కాలేకపోయింది.

భర్తృహరివంటి ప్రతిభావంతులుసైతం రాజుల అక్రమానికి, ధనికవర్గం ఆధి క్యతకు వైరాగ్యాన్ని మాత్రమే ప్రతిక్రియగా సూచించగలిగేరు. వర్ణాశ్రమ ధర్మంపేరుతో వర్గసమాజం సహస్రాబ్దాల పర్యంతం వర్ధిల్లింది. అతిప్రాచీన కాలంలో ప్రజాస్వామ్యం ఛాయలు గోచరించిన సంస్కృత సాహిత్యం వెలుగు చూసిన కాలానికే అవన్నీ అంతరించి 'నావిష్ణుః పృధీవీపతిః' అన్న సూత్రంపై నిరంకుశ పాలన సుస్థిరమయింది. ఈనాటికికూడ కొనఊపిరితో కొనసాగు తున్న యీ జడాత్మక దృక్పథంవల్ల పాశ్చాత్య సంపర్కం ఏర్పడేవరకు సాహి త్యాన్ని సాంఘిక విమర్శనా వేదికగా సరిదిద్దగల అవకాశం లభించలేదు. పాశ్చాత్య సాహిత్యం Juvenal వంటి కవుల కాలానికే Criticism of life గా పరిణమించడం వారి శాస్త్రీయదృక్పథానికి నిదర్శనం. అందువల్లనే మిల్టన్‌నుండి ఆడెన్ వరకు ఆంగ్లకవులు కాలానుగుణ్యమైన సాంఘిక ప్రబోధానికి కారకు లయ్యారు. ఆధునిక యుగంలోనైనా రచయితల బాధ్యతను నిర్వచించినందుకు శ్రీశ్రీ ప్రశంసనీయుడు.

కవిత్వానికి రీతికన్న భావం ప్రధానమని గుర్తించక, ఉత్తమ కవి మొదటిది అతను 'మహాశిల్పరచనా ప్రవీణుడై ఉండాలి' అనీ 'శ్రీశ్రీ పాత పదాలు డిక్షన్, ఛందస్సులు వదలలేదనీ, సాంప్రదాయం అనుసరిస్తూనే విప్లవం తెచ్చాడని' నిర్ణయించడం సమంజసంకాదు. కావ్య ప్రయోజనాన్ని, స్వభావాన్ని పూర్తిగా మార్చివేయడమని గ్రహించాలి. అయితే శ్రీశ్రీకి గురజాడవంటి మార్గ దర్శకులు లేరనికాదు. కాని శ్రీశ్రీ కవిత్వం పరిపక్వత చెందడానికి కారణాలు శిల్పసంపద, కవితాప్రతిభతోపాటు తోడ్పడిన మరోఅంశం ప్రధానంగా సాంఘిక సమస్యలపై నిర్దుష్టమైన అవగాహన. రాజకీయ నాయకులకన్నా మిన్నగా సాంఘిక వ్యవస్థను అర్థంచేసుకుని ఉత్తమ కవిగా శ్రీశ్రీవలె భాసిల్లినది Brecht వంటి ఏ కొద్దిమందో మాత్రమే. కవుల విషయంలో 'తన కాలంలో సారభూతమైన భావతరంగాల సంగమస్థానమై ఉండాలి' అంటే చాలదు. సమ కాలీన భావాలను కవిత్వంలో ప్రతిధ్వనింప చేయడం ప్రథమేతర రచయితలకు కూడ సులభసాధ్యమే. మహాకవికి నిర్వచనం సమకాలీన భావచైతన్యాన్ని సృష్టించడం. Voltaire, Goethe, Ruskin ప్రభృతులను యీ సందర్భంలో ఉదహరించవచ్చు. అద్దేపల్లి వారు ఉపోద్ఘాతంలో సూచించిన 'మహాకవిలోని రెండవ లక్షణం ఒక మహాచైతన్యానికి ప్రతినిధికావడం' అన్న అభిప్రాయం

యీ భావాన్ని పూర్తిగా వ్యక్తం చెయ్యదు. ప్రతినిధి అనడంలో అస్పష్టత ఏర్పడుతుంది. మార్క్సిస్టులు కూడ యీ విషయంలో వ్యక్తి ప్రాధాన్యతను గుర్తించవలసి ఉంటుంది. శ్రీశ్రీ కవిత్వంలో ఛందస్సు, ధ్వని, రసం, అలంకారం యిత్యాదులు కనిపించడంలేదా అని ప్రశ్నించవచ్చు. కాని ఉత్తమ కవిత్వానికి లక్షణాలైన యీ అంశాలు అభ్యుదయ కవులలో మాత్రం స్ఫురించకేం చేస్తాయి? అంతమాత్రాన్న శ్రీశ్రీని సాంప్రదాయవాది అనడం, యివి గీటురాళ్లుగా అంచనా కట్టడం భావ్యంకాదు. భారతీయ అలంకార శాస్త్రం ఉత్కృష్టమైనదని గౌరవించడం వివాదాంశంకాదు. కట్టమంచివారు యీ విషయంలో తొందరపడ్డారని మరో సందర్భంలో సూచించాను. ఆ నాటిస్థితిగతుల దృష్ట్యా గట్టిగా విమర్శించడం అవసరమే అనే వాదన అటుంచి భావాన్ని స్పృశించకుండా అలంకారాలపై కొనసాగిన ఎకడెమిక్ చర్చలు సాహిత్యానికి గుదిబండలుగా తయారుకావడం మధ్యయుగంలోనే. ఆదిలో అలంకార శాస్త్రం కొంతవరకు ఆరోగ్యవంతమైన సృజనాత్మక కృషివల్లనే నిర్మించడం జరిగింది.

భావ ప్రపంచంలో మార్పును తీసుకురావడంతో పాటు రచనా శిల్పంలో కూడ శ్రీ శ్రీ విశిష్టత గుర్తింపబడి యీనాడు వచన కవిత్వం విశేషగౌరవం సాధించుకున్నా 'గణ బద్ధాలు కృత్రిమ ఛందస్సులనీ మాత్రా ఛందస్సు స్వాభావికము లైనవనీ' ఉద్ఘాటనలు జరుగుతున్నాయి కాని రా.రా. సూచించినట్లు శ్రీ శ్రీ స్వయంగా యిచ్చిన వివరణ పరిశీలిస్తే భావానికీ, శిల్పానికీగల అన్యోన్యత సులభ గ్రాహ్యమవుతుంది. "గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజం నుండి మాత్రా బద్ధ ఛందస్సుల ప్రజాస్వామ్య యుగానికి ఆంధ్రసాహిత్య చరిత్ర గమనాన్ని పరివర్తన చేసినవాడు గురజాడ" అన్నాడు శ్రీ శ్రీ ముత్యాల సరాల పీఠికలో. ఛందస్సులో రాజకీయాల ప్రసక్తి దేనికని ప్రశ్నించవచ్చు అమాయకులు. కాని వర్గ సమాజంలో ప్రజా వాఙ్మయానికి, ప్రభువుల అండలో జరిగే సంస్కృతికీ అగాధమైన అఖాతం ఏర్పడడానికి, కారణం గణితశాస్త్ర సూత్రాలపై అసంఖ్యాకమైన ఛందస్సులను సృష్టించడం. భారతీయ అలంకార శాస్త్రంలోని విశిష్టత, బలహీనత ఛందో శాస్త్రంలో కూడ ప్రతిబింబిస్తాయి. ప్రజా ఛందస్సులను జయదేవుడి నుంచి మన శివకవుల దాకా స్వీకరిస్తూనేవచ్చారు కాని ఆధునికయుగంలో శ్రీ శ్రీ అపూర్వమైన సమన్వయాన్ని సాధించాడు.

శ్రీశ్రీ భావపరంపరను చర్చించడం స్థలాభావం వల్ల సాధ్యం కాక పోవచ్చు యీ వ్యాసంలో, కాని "తక్షశిలా పాటలీపుత్రం....చారిత్రక విభాత సంధ్యల మానవకథ వికాస మెట్టిది" అనే జిజ్ఞాస వైజ్ఞానికుడిగా యిటీవల వెలువడ్డ వాగ్వాదం దృష్ట్యా నన్ను కదిలించింది. వైజ్ఞానికప్రగతి సాంఘిక వ్యవస్థకు దూరంగా 'స్వచ్ఛంగా' ఉంటుందా అనేది మొదటిప్రశ్న. వాటి అనుబంధాన్ని శ్రీరామమోహన రావుగారు దరిమిలాను గుర్తించినా అవి పురోగమనానికి అవసరమైన నాగరికతకు ప్రథమదశ లనడం సమంజసమా ? అనేది మరోప్రశ్న. వీటికి ప్రతిగా "మానవుడు ఏదేశంలో ఏమి సాధించినాడో తెలిపేదే చరిత్ర అని యీ పాదాలకు అర్థం" అన్న రా.రా. గారి వివరణ సంతృప్తికరమా అనికూడ పరిశీలించాలి. శ్రీ. శ్రీ. భావం ఏమిటి ? రా.రా. గారి అభిప్రాయాన్ని మన యూనివర్సిటీ పెద్దలుకూడ నిరభ్యంతరంగా ఆమోదిస్తారు. Toynbee వంటి చరిత్రకారులు ప్రత్యేక కారణాలు ఊహించినా యీనాటి సాంఘిక శాస్త్రజ్ఞులు, చరిత్రకారులు ఆర్థిక కారణాలే చారిత్రక పరిణామాన్ని నిర్ణయిస్తామని అంగీకరిస్తారు. విక్టోరియా యుగంలో చరిత్ర మహాపురుషుల ప్రజ్ఞాఫలితమనీ, వివిధ దేశాల అంతరాత్మల సంఘర్షణ అని సూచించిన అభిప్రాయాలకు కాలదోషం పట్టింది. వర్గకలహాన్ని, విప్లవాన్ని మాత్రమే పండితమ్మన్యులు నిరాకరిస్తారు. మానవ జాతి చరిత్రను సరిగ్గా వివరించగల ఏకైక సిద్ధాంతమైన మార్క్సిజం ప్రాతిపదికపైనే శ్రీ శ్రీ 'దేశచరిత్రలు' రచించినట్లు సామన్య పాఠకుడుగూడ గుర్తించగలడు. "నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" అని సూచించిన మొదటి ఖండికలోనే ఆభావం స్పష్టంచేశాడు. "ఒకవ్యక్తిని మరొక్క వ్యక్తి— ఒక జాతిని వేరొకజాతీ—పీడించే సాంఘిక ధర్మం—యింకానా ? యికపై సాగదు" అని ఉద్ఘాటించాడు మరోచోట. ఇక్కడ జాతుల ప్రస్తావన సంకుచిత దృక్పథాన్ని తెలియజేస్తుంది. కాని సమకాలీనమైన వలసదేశాల స్వాతంత్ర సమరం దృష్ట్యా మన్నించవచ్చు. ఆనాటి రాజకీయ నాయకులకు కూడ స్వరాజ్యం వచ్చినంత మాత్రాన సామాన్య ప్రజానీకానికి ఆవగింజంత ఉపకారం జరగబోదన్న దూరదృష్టి లోపించింది. లేకపోతే "కష్టపడి ఆర్జించిన స్వాతంత్రం గద్దలు తన్నుకుపోవడం" జరిగేదికాదు. స్వరాజ్యం మూటవిప్పితే ఏమీలేదనీ శ్రీ శ్రీయే గుర్తించాడు తదనంతరం.

ఇకపోతే ప్రాచీన నాగరకత కుదాహరణలైన హరప్పా, మొహంజదారో లలో సాంఘిక వ్యవస్థ ఎలాంటిదైనా వైజ్ఞానిక వికాసము, సాంఘిక పురోగమనం జరగడం వాస్తవంకాదా అని శ్రీ అద్దేపల్లి వంటి విమర్శకులు ప్రశ్నించవచ్చు. కానీ మొట్టమొదట గుర్తించవలసిన విషయం ఏకాలంలోనైనా వైజ్ఞానిక ప్రగతి పాలకవర్గం అవసరాలకి మాత్రమే పరిమితమయి ఉంటుంది. నేటి అణ్వాయుధాలు ఎలా ఉద్భవించాయి? అథవా ఎలాంటి ప్రయోజనమైనా సిద్ధించినా అనుభవించేది కూడా పాలక వర్గమే. చంద్రమండలంపై అడుగుపెట్టిన యిరవయ్యో శతాబ్దంలో కూడ అసంఖ్యాకమైన సామాన్య ప్రజానీకం పాతరాతి యుగంనాటి జీవన విధానానికే బందీలుకావడం చూస్తునే ఉన్నాం. శాస్త్రజ్ఞుల అంచనా ప్రకారం విశ్వవ్యాప్తంగా మానవజాతి కనీసావసరాలు తీర్చగల సామాగ్రి అందుబాటులోనే ఉంది. అడ్డువచ్చేదల్లా రాజకీయ నాయకులే. అందుచేత వర్గ సమాజంలో వైజ్ఞానిక ప్రగతి కుంటుపడక తప్పదు. ఇంతెందుకు బెర్నాల్ వంటి శాస్త్రజ్ఞులు, వెబ్లెన్‌వంటి ఆర్థిక శాస్త్రవేత్తలు వర్గసమాజం వైజ్ఞానిక ప్రగతికి ప్రబల శత్రువని కూడ నిరూపించారు. ఉదాహరణకు మనదేశంలోనే అతి స్వల్పవ్యయంతో సామన్యులకు గృహవసతి కల్పించగలనని ఓ మహనీయుడు సవాల్ చేశాడు. కాని పెద్దలంగీకరించ వద్దూ? ఈ భావాలన్నీ శ్రీ శ్రీ సూచించాడా? అని ఎదురుప్రశ్న వేయవచ్చు. కాని కవిత్వాన్ని ఆపాత మధురమే కాక ఆలోచనామృత మనడానికి అదేకారణం.



# విప్లవపథ నిర్దేశకుడు

— ఎ. బి. కె. ప్రసాద్

తెలుగు వర్ణమాలలోని ఒకే ఒక అక్షరంతో నామాది శ్రీమంతుడేగాక, నామాంత శ్రీమంతుడు కూడా నైన శ్రీశ్రీ 'త్రివిటీ', కవితా వ్యాసంగానికి కూడా అలవడ్డంలోనే ఆయన గొప్పదనం అంతా వుందా ? !

ఆనాటినుంచి ఎందరెందరో రాస్తున్నారు. మరెందరో కూస్తున్నారు. ఆ అందరి రాత–కూతల్లో లేని ఎత్తిపోతలు అశేష పాఠకులు శ్రీశ్రీలోనే ఎందుకు చూడగల్గుతున్నారు ? అస్వాదించగలుగుతున్నారు ? ఆనందించ గలుగుతున్నారు ?

"అభ్యుదయం" కూడా "సోషలిజం" లాగానే విపరీతంగా చెలామణిలోకి రావడంతో నిజమైన అభ్యుదయం ఎవడిదో తెలియకుండా పోయే ప్రమాదం సాహితీరంగంలో కూడా ఏర్పడింది.

"అభ్యుదయం" అంటూ చేపట్టి మధ్యలోనే అడుగు జారి కొందరు పాలి పోయి, కూలిపోతున్నారెందుకు ? తూలిపోకుండా శ్రీశ్రీ అలా నిలబడ గలుగు తున్నాడెందుకు ?

కొందరు భావిస్తున్నట్లు, శ్రీశ్రీ ఎంతటి అభ్యుదయవాదైనా, ప్రాచీన సాహిత్య, అలంకార శాస్త్రాల్ని బాగా అధ్యయనం చేసి, ఎళువు సుళువులన్నింటినీ తెలుసుకోవడమే, నేడు ఆయన నిలబడ్డానికి ప్రధాన కారణమా ?

మరి గతాన్నంతా పుక్కిటబట్టి కూడా కొందరు మార్గానికి రాలేక పోతున్నారెందుకని ?

దేశం ఎన్నెన్నో సంక్షోభ దశలలో ప్రయాణిస్తున్నా, కొందరిలో ఎక్కిం చినా ఎక్కని తీవ్రత, శ్రీశ్రీ కలానికే ఎక్కుతోందేమిటి ? !

ఏమిటి కారణం? ఎక్కడుందీ బిస? పేరులోవుందా? పెన్నులో వుందా?

పెన్నులోనే వుంది. ఆ "నిబ్బు" గబ్బు ఆలోచనలో చేయదు. అది ప్రజా బంధువు, రక్త సింధువు.

ఉండంతలోనే కొండంత భావాన్ని యిమడ్చడానికి చేసే ప్రయత్నంలో దాని స్పృహే వేరు. స్పర్శే వేరు.

ప్రజలనే స్పర్శాజ్ఞానం అతని కలానికుంది. చరిత్ర అనే లోచనాలు ధరించిన కలమది. గతి తార్కిక దృష్టిని అలవర్చుకున్న గంటం అది. ఆస్తి అనే హక్కునుంచి అది మాట్లాడదు. "దేశమంటే మట్టి కాదు, మనుషులన్న" గురజాడను శ్రీశ్రీ తన "అడుగుజాడ"గా ఎంతగా భావించాడో, "పరస్పరం సంఘర్షించే శక్తులలో"నే చరిత్ర పుడుతుందని, ఉన్నవాడికి-లేనివాడికి మధ్య ఒరపిడి ఆ ఘర్షణతో గాని రద్దుగాదన్న మార్క్సియన్ తత్త్వమూ అంతగానూ తలకెక్కించుకొన్నవాడు!

ఆ ఎక్కిన "కైపు" ఆనాడు ఎలావుందో, ఈనాడూ అలాగేవుంది. కొందరిలో మాదిరి అది దిగిపోలా. పెగా, అది గుణకారం పొందుతోంది!

"మహా ప్రస్థానం"లోని మరో ప్రపంచం, దేశచరిత్రలు, పతిజ్ఞా, రథ చక్రాలు—నేటికీ ఎలా కాలాతీతమైన కళాఖండాలో, "ఖడ్గసృష్టి"లోని ఖడ్గసృష్టి, శరచ్చంద్రిక, సామాన్యుని కామనలో కూడా అంతే.

అంతకన్నా విశేషం—యిక్కడ వివరాలు చర్వితచర్వణం గాకుండా చెప్పు కోవాలంటే ఇటీవల కాలంలో "జ్వాల", "ప్రజారథం" పత్రికలకిచ్చిన ఇంట ర్వ్యూలు, ఇవి, విప్లవకవిగా శ్రీశ్రీ మనోభావాలు ఎంతటి జ్వరోగ్రతలో నేడు ముందుకు సాగుతున్నాయో స్పష్టం చేస్తాయి!

వర్తమాన భారతంలో ఎవడి స్థానమేమిటో ఆయనకు బాగా తెలుసు. రాజకీయార్థిక పరిణామాల్ని పసిగట్టలేని 'పసి'వాడు కాడాయన. ఆయన పసి తనమల్లా— పాత పుణ్యంతో పేరుకు మాత్రం బ్రతుకుతూ కొంతమందిలా తప్పించుకు తిరగలేకపోవడమే! అందుకే యితరత్రా అనేకమంది "అభ్యుదయ

కవులు" వెనకబడుతూంటే, ఈయన ఉన్నకొద్దీ యువకు డవుతున్నాడు — భావాల్లో !

గత యుద్ధకాలంలో, కవులంతా చెల్లాచెదరై పోతే లూయీ ఆరగాన్ ఒక్కడే నిలబడి దేశంలో మహావిశ్వాసాన్ని ప్రకటిస్తూ గీతాలు రాశాడు. విపరిణామాలు లేకపోయినా కొందరు మనవాళ్ళు నిలచేటట్లు లేరూ !

కాని శ్రీశ్రీ నేడొక ప్రత్యేక పరిస్థితితో కూడా నిలబడ్డానికి ప్రయత్నిస్తున్నాడు, నిలబడుతున్నాడు ! సత్తావుంటే ముందు ఆకలి దప్పులులేని, నిరుద్యోగం లేని సొంతఎర్రరాజ్యాన్ని తెలుగు గడ్డమీద నిర్మించుకుందాం రాండి, అంటున్నాడు ! భారతదేశంలో అనేక "వియత్నాం"లను ఊహిస్తున్నాడు.

కమ్యూనిస్టుల మనుకొంటున్నవాళ్ళకు కూడా లేని నేతృత్వ శక్తిని ఆయన ప్రసాదిస్తున్నాడు! రాజకీయకవి కాంచనిచోటు, ప్రజాకవి కాంచుతున్నాడు!

ఇక్కడ మనసులోమాట చెప్పుకోవడం మంచిది. ఆయనతో ప్రయాణించ దలచినవారు గొంతు కలపాలి. లేనివాళ్ళు మూతులు బిగ్గట్టుకోవాలి. ఇక కోతలు మాత్రం పనికిరావు ! శ్రీశ్రీ తానుగా ఈ మాటలు చెప్పడు—అయినా శ్రీశ్రీ అంటే ప్రేమను కనబరుస్తున్నవాళ్లందరికీ ఇదో "టెస్టే." !

ప్రతిసాంఘిక విప్లవానికి ముందు మహత్తరమైన భావ విప్లవం వస్తుందని ఆయనకు తెలుసు. అందుకనే ఆయన, ఫ్యూడల్‌యుగంపోయి, ప్రజాస్వామిక యుగం రావడానికి అభ్యుదయసాహిత్యం తోడ్పడ్డట్లే, సామ్యవాదరాజ్యం రావడానికి సామాన్యుడికి మరింత సన్నిహితంగా జరిగి ఉప్పు నందించే సాహిత్య సృష్టిని అభిలషిస్తున్నవాడు. అటువైపు ప్రయాణించమని ప్రోత్సాహిస్తున్నవాడు.

అందుకే "సౌలభ్యం" కవితలో యింకా సాధించాలని ఆయన చెప్పడం. తనకవిత స్థూలంగా అసంఖ్యాక సామాన్యప్రజల ప్రయోజనాల్ని ప్రతిబింబించినా, కావలసినంతగా అది ప్రజాయత్తం కాలేదన్న బాధ ఆయనకువుంది. "దిగంబర కవుల్ని" ప్రోత్సాహించడంలో బహుశా అయనదృష్టి యిదే. ఈ విషయంలో ఆయనకు ప్రేమపాత్రుడైన టి. ఎస్. ఇలియట్ చెప్పిన ఒక సత్యాన్ని మనం యిక్కడ గుర్తుంచుకోవాలి :—

"The followers of a revolution develop the new poetic idiom in one direction or another; they polish or perfect it; meanwhile the spoken language goes on changing, and the poetic idiom goes out of date"

[*"The Music of poetry"*: *Selected Prose*: *P*: *58*]

ఆ సౌలభ్యం— ప్రజలలో కలసి మెలసి తిరుగుతూ, పరిశీలనాశక్తితో సాధించాలంటాడు శ్రీశ్రీ. చౌకబారు ప్రచారంకోసం "దిగంబర కవులు" ఆ రిక్షా వాడిచేత, ఈ కుష్ఠు అమ్మాయిచేత తమ కావ్య సంపుటాలను ఆవిష్కరింప జేయించుకొన్నారని కొందరు అంటున్నారని చెపితే, "నేటి మన కవుల్లో ఆ సాహసం ఎంతమందికుంది" అని ఎదురు సవాలు చేశారు శ్రీశ్రీ!

ఆయన, "చౌకబారు"తనాన్ని చూసేది యిందులోగాదు— జాతీయ దురహంకారంలో! చౌకబారు జాతీయవాదంకోసం "పెన్ను పెట్టిన చేత్తోనే గన్ను పట్టు" మనే పెద్దమనుషులున్న ఈ దేశంలో, నిజమైన 'నేషనలిజా'నికి ఆయనిచ్చిన నిర్వచనం కూడా గొప్పదే. 1961లో బెజవాడలో జరిగిన సాంస్కృతిక మహా సభలకు ప్రారంభోత్సవం చేస్తూ మహోపన్యాస రచన చేశాడు. అందులో అంటాడు:-

"Nationalism is a legitimate pride so long as it does not petrify into sabre – rattling Chawinism"!

ఈయనది ప్రోగ్రెసివ్ నేషనలిజంగాని, రియాక్షనరీ నేషనలిజం కాదు.

రచయితలు, కవులు అయినవాళ్ళు యిది గుర్తుంచుకోవాలి. వంటబట్టించుకోవాలి.

అసలు దృష్టి అనేది, వక్రమార్గం పట్టకుండా వుండాలిగాని, హిమాలయాల్లాటి సత్యాలను చాటగలరు కవీ, రచయితా. కళింగ యుద్ధానంతరమే అశోకుడు శాంతించాడని పదే పదే చెప్పడం, బాధలు పడుతున్న భారత ప్రజలకు కూడా ముక్తి అలాటి దీక్షతోనే సాధ్యమని చెప్పడం! ప్రజల్ని పీడిస్తున్న భారత "పులుల్ని" ఆయన వట్టి చీపురుపుల్లలతో సాగనంపలేరని బోధించడమూ అందుకే!

రష్యన్ మహావిప్లవానికి ముందు గోర్కీ అలాటి ప్రోద్బలమే అందించాడు జనతకు.

చైనావిప్లవానికి ముందు మహారచయిత లూసన్ అదే బోధించాడు తన ప్రజలకు.

ఫ్రాన్స్‌లో జాపోల్‌సార్డ్, అదే చేస్తున్నాడు. లూయీ ఆరగాన్ అదే చేశాడు.

స్పెయిన్‌లో పికాసో అదే చేశాడు. చిలీలో పాబ్లో నెరూడాదీ, అదే మార్గం.

ఇక్కడ శ్రీశ్రీ మార్గమూ అందుకు భిన్నంకాదు !

ఆయన ఆశీస్సులు అందిస్తున్న దిగంబర కవులదీ, అంతకన్నా భిన్నం కాజాలదు !!

ప్రజాహృదయాలను కదిలించి, వారి హృదయాలలో స్థానాన్నేర్పరచుకో గలిగిన తరువాతనే, "తాటితోనేదబ్బనం" అన్నట్లుగా, కవితాగౌరీశంకర శిఖ రారోహణకు అర్థం, పర్థం ! నేలవిడిచి సాముచేయనివాడే, నేలమీదపామునుపట్టి, పల్లార్చగలుగుతాడు!

ఆ సాముగరిడీలలో పల్టీలు కొట్టినాసరే — గ్రీస్‌వీరుడు 'అచిలస్' మాదిరిగా నేలతల్లిని (ప్రజను) మరిచిపోకూడదు. విహంగంలా ఆకాశతలంలోనే విహరిస్తూ కూర్చోకూడదు. తురంగంలా జనతకు అంకెకురాకుండా గెంతనూ కూడదు.

ఇదే నేటి శ్రీశ్రీ ప్రబోధం. ఆయనతో మరోసారి మాట్లాడిన తరువాత రాస్తున్నానీమాటలు.

వెనక "కరుణశ్రీ" ఒక సందర్భంలో అన్నమాటలు శ్రీశ్రీ పట్లకూడా వరిసాయి :-

"ఈ జన వశీకరణాద్భుత శక్తిచూడగా
ఆతని పేరులోగలదా ! ఆయన గంటములో నున్నదో !"
ఈ రెంటింటినీ విడదీయడం కష్టమే !
అవును—
ఆ పేరులోనేవుంది బిస !
ఆ పెన్నులోనేవుంది పస !!

# వ్య  గా శ్రీశ్రీ

— వరవరరావు

నాకున్నంత పరిచయంతో శ్రీశ్రీ వ్యక్తిత్వం అంచనావేయాలని నేను చేసే ప్రయత్నం సాహసమే. శ్రీశ్రీని చిన్ననాటినుంచి, ఎదిగాక, కవిగా ఎదిగాక, సినిమాలోకంలో చాల సన్నిహితంగా తెలిసినవారు తెలుగు దేశంలో చాలమంది వుండి వుంటారు. మనిషిగా | వ్యక్తిత్వం నేను ఎట్లా అర్థంచేసుకొన్నానో నా పరిశీలన రాసాను.

శ్రీశ్రీలో చాల ఉరవడి వున్నది. ఇది ఆయన స్వభావంలో వున్నది. మాట, శబ్దప్రయోగం రెండింట్లోకూడ చాలావేగం. అయితే ఆయనలో ఆలోచన కన్న ఆవేశం చాలా వేగంగా వస్తుంది కనుక వుపన్యాసం యివ్వాల్సివస్తే ఐదు నిముషాలు మాట్లాడి డిబేట్‌లో హైస్కూలు విద్యార్థివలె నిలబడిపోతాడు.

ఆయనకు కమ్యూనిజం, కమ్యూనిస్టుపార్టీ అనే మాటలు సమ్మోహనాస్త్రాల వంటివి. తనను Leftist అనిపించుకోవడం ఆయనకు చాల యిష్టం. కార్లో కూర్చునేప్పుడు మీరెటువేపు కూర్చుంటారు అని అడిగితే Left is right అంటాడు. ఆ మాట వాడాల్సిన సందర్భం ఎక్కడొచ్చినా అవకాశం జారనివ్వడు. నెహ్రూ మొదలుకొని నక్సలైట్లవరకు – వారిలో యీ కమ్యూనిస్టు తత్వం వున్న దన్న కారణంవల్లనే ఆయనకు అభిమానం. యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వాలు, కేరళ, బెంగాల్ ఆయనకు ఎక్కడలేని ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని ఆశనూ యిస్తాయి. వియత్నాం సంగతి సరేసరి. శ్రీకాకుళ గిరిజన పోరాటంమీద హృదయంలో ఎంతో సానుభూతి. 1961లో హైదరాబాదులో ఒక సభలో చెప్పనే చెప్పాడు – 'నాబుద్ధి రష్యాలో హృదయం చైనాలో వున్నవి. రష్యాది కడుపు నిండిన బేరం చైనాది కడుపు మాడిన కసి.' అని. మావో మొదలుకొని గాంధీ, ఇందిరలదాకా, స్విన్‌బర్న్ మొదలుకొని నన్నయ దిగంబరకవులదాకా అందరి పట్లా ఆయనకు అభిమానమే. ఒక విధంగా శ్రీశ్రీకి ఖచ్చితమయిన likes and

dislikes లేవు. స్థూలంగా రైటిస్ట్ విధానాలపట్ల నిరసన లెఫ్టిస్ట్ విధానాలపట్ల అభిమానం వున్నా యీ దేశంలోవున్న కమ్యూనిస్టుపార్టీలలో ఏ పార్టీ చెప్పిందయినా ఒప్పుకుంటాడు. దీనికి కారణం ఆయనకు హేతుబద్ధంగాకాక సెంటిమెంటల్‌గా 'నవయవ్వనం'లో కమ్యూనిస్టు అనే మాటపట్ల ప్రొగ్రెసివ్ అనే మాటపట్ల కలిగిన మమకారం. దానికితోడు శ్రీశ్రీ చాల మొహమాటస్తుడు.

'జ్వాల' పత్రికవాళ్ళు శ్రీకాకుళ గిరిజన పోరాటాన్ని శ్రీశ్రీ సమర్థించాలి అన్న ధోరణిలో యింటర్వ్యూచేస్తే ఆ ప్రశ్నలతోనే ఉత్తేజంపొంది శ్రీకాకుళం పోతానన్నాడు సినిమాలు వదిలి.

హైదరాబాదు యింటర్వ్యూలో ఒకవేళ ఎన్నికల్లో నిలబడాల్సివస్తే మీరు ఏ పార్టీ టికెట్టు మీద నిలబడుతారు అని అడిగితే 'ఇండిపిండెంట్‌గా, వావిలాం గోపాలకృష్ణయ్యవలె'అని అన్నాడు 'మీకు సరియైన రాజకీయఅవగాహనలేదు. మీరు బయటికి రావాలి' అని జ్వాలాముఖి పిడికిలి బిగించి గట్టిగా అంటే 'అవును' అని అమాయకంగా పసిపిల్లవానివలె వొప్పుకుంటాడు.

శ్రీశ్రీ చాల అమాయకుడు. పసిపిల్లవానిలోవున్న నిర్మలత్వం ఆయనలో వున్నది. చలంగారు మాతో అన్నారు. 'కృష్ణశాస్త్రి సండూరి సుబ్బారావులను చూస్తే వీళ్ళేనా యింత గొప్ప కవిత్వం రాసి యింత విరహాన్ని సృష్టించినవారు అనిపిస్తుంది. శ్రీశ్రీని చూసినా అట్లాగే అనిపిస్తుంది కాని ఆయనలో పసిపిల్లవానిలోవుండే నిష్కల్మషత్వం వున్నది. అందుకే సినిమాల్లోకి పోయినా శ్రీశ్రీ చెడిపోలేదు – (ఆర్థికంగా భౌతికంగాకాదు)' అని.

అన్నింటికన్న మించిన గుణం, చాల అరుదైందీ, ఆశ్చర్యాన్ని కలిగించేది – శ్రీశ్రీకి బొత్తిగా పోజ్‌లేదు. ఫోటోకొరకు పోజ్ పెట్టినప్పుడు కూడ ఆయనకు బొత్తిగా అలవాటులేని పని ఏదో చేయడానికి కష్టపడుతున్నట్టనిపిస్తుంది. ఈర్ష్యాసూయలు లేకపోవడంలో తెలుగు దేశంలో శ్రీశ్రీతో పోల్చదగిన కవి లేడు. అయితే శ్రీరంగం నారాయణబాబు విషయంలో శ్రీశ్రీ నట్టు పడకుండా మాట్లాడడు.

ఎంత ఆలోచించకుండా మాటయిస్తాడో, అంత ఆలోచించకుండా మాట తప్పుతాడు. పండితుల్లో, వృద్ధుల్లో, అధికారాలు హోదాలుగలవారిలో, డిగ్నిటీ గల వారిలో, అకాడామీలలో రేడియోలో కవిసమ్మేళనాలలో శ్రీశ్రీ వెలేసినట్లుగా

వుంటాడు. ఆడియన్స్‌లో వున్నట్లుగా వుంటాడుతప్ప వేదికమీద వున్నట్లు వుండడు. కాని తక్కువ మందివున్న యిష్టాగోష్ఠిలో, యువకుల్లో, ఆయనను నిజంగా అబిమానించే వారి మధ్యన, సంభాషణలో ఆయన బుద్ధి మంచినీళ్ళకు చేప ఎక్కినట్లు కాలం గడిచినకొద్దీ పదునవుతూ వుంటుంది. అయితే ఆవేశగుణ ప్రధాని గనుక ఒక్కోసారి ఎంత అద్భుతంగా, సీరియస్‌గా మాట్లాడుతాడో ఒక్కోసారి అంత పేలవంగా, లైటర్‌మూడ్‌లో మాట్లాడుతాడు. 'నేను మహా కవిని. వీళ్ళంతా నన్ను మహాకవిగా చూస్తున్నారు. నేను జాగ్రత్తగా జవాబులు చెప్పాలి' అన్న స్పృహలేక పోవడమన్నది ఆయన నిరాడంబర స్వభావం నుంచి వచ్చిందే. ఆయనలో ఎన్ని బలహీనతలున్నా ఆయనను సన్నిహితంగా చూసినవాళ్ళు ఆయనను అభిమానించకుండా ఉండలేకపోవడానికి కారణమిదే.

అయితే శ్రీశ్రీ రాతలకూ, ఆయన జీవితానికీ పొంతనలేదు. ఇది అంద రికీ తెలిసిందే. చాలమందికి తెలియంది. తెలియక తప్పుపట్టేది ఎక్కడ అంటే - ఆయన తక్కిన కవులవలె నిజాయితీ లేకుండా రాయలేదు. నిజాయితీ ఉంటే ఆచరణలో ఎందుకు లేదూ అంటే ఆవేశపరుడు కాబట్టి, దుర్బల హృదయంగల వాడు కాబట్టి.

శ్రీశ్రీ నాస్తికుడూకాడు, ఆస్తికుడూకాడు. రావణాసురుడు రాసాడనిచెప్పే శివుని మీద స్తోత్రం ఆయనకు చాలయిష్టం. ఆయన యింకా 'సదసత్సం శయం'లో వున్నాడు. అయితే మానవ విజయంమీద, సైన్స్‌మీద, సామా న్యునిమీద చాల విశ్వాసం. శబ్దంమీద, శబ్దశక్తిమీద చచ్చేంత మోజు. చాల చిత్రమయినా వాస్తవమయిన విషయమేమిటంటే 'మరోప్రపంచం, దేశ చరిత్రలు, ఖడ్గసృష్టి' రాసిన శ్రీశ్రీ దైనందిన జీవితంలో హేతువాదికాదు. కుటుంబరావుగారి ప్రతి మాటలో, రాతలో కనిపించినట్లుగా హేతువాదదృష్టి శ్రీశ్రీలో కనిపించదు. కవికావడమే యిందుకు కారణమయితే శ్రీశ్రీ వ్యక్తిని కదిలించకపోవడమే మంచిది.

ఆయన కవిత్వమే యువతరం వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దుతుంది.

# యుగకర

సి. రాఘవాచారి

శ్రీరంగం శ్రీనివాసరావుగారి సాహిత్య సమాలోచనమంటే దాదాపు గత రెండు శతాబ్దాల ఆంధ్ర సాహిత్య పరిణామ పరిశీలన అనడంలో అతిశయోక్తి లేదేమో? సాంఘిక పరివర్తనతో బాటు సాహిత్య ప్రపంచములో కలిగే సహజ పరిణామాన్ని సహృదయతతో పరిశీలించవలసిన బాధ్యత సాహితీ ప్రియులపైనా ముఖ్యంగా విమర్శకులపైనా వుంటుంది. సృజించబడే సాహిత్యాన్ని పరిశీలించి ఆయా రచనల వైశిష్ట్యాన్ని నిర్ణయించవలసిన విమర్శకునికి నిష్పాక్షికత ఎంతో అవసరం. సంఘ చైతన్యము మానవునిలో భావోద్దీపనము కలిగించుతుంది. తిక్కన దేనినైతే "కవితావేశమ"ని పేర్కొన్నాడో, Shelley దేనినైతే "poetic inspiration" అన్నాడో అది ప్రాథమికంగా సాంఘిక భావ చైతన్యంపై ఆధారపడియుంటుంది. కాబట్టి ఒకకవి రచనల్ని గురించి చర్చించడంలో దేశ కాల పాత్రలను సమన్వయం చేసుకోడం అవసరం. ఆ దృష్టితో చూచినప్పుడు శ్రీశ్రీ ఒక వ్యక్తిగా గాక వొక వుద్యమంగా గోచరిస్తాడు. భావ కవులపై వైయక్తిక స్వీయ మానసిక ధోరణుల కారణంగా చలంగారన్నట్లు తెలుగు కవిత్వానికి తన ప్రయోజనం తానే చెప్పుకోవలసిన గతి పట్టిన దశలో శ్రీశ్రీ తన మహాప్రస్థానం గేయంద్వారా కవితాదర్శాల్ని పునః ప్రతిష్ఠించి భావి కవులకు మార్గదర్శకుడయ్యాడు. అభ్యుదయ కవిత్వం కొందరి యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా వొక వుద్యమంగా ముందుకు సాగిపోతున్న యీ తరుణంలో దాని మూల పురుషుడయిన శ్రీశ్రీ కవిత్వాన్ని జాగ్రత్తగా పరిశీలించడం యెంతో అవసరం.

దేశకాల పరిస్థితుల కనుగుణంగా కవిత్వంలో మార్పు నాహ్వానించే వాళ్ళలో శ్రీశ్రీ ప్రముఖుడు. బహుశా ప్రథముడు. ఆయన దృష్టిలో కవిత్వం, ఉబుసుపోక కల్పించుకొన్న hobby కాదు.

కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ
పెను నిద్దుర వదిలించేదీ

గురజాడ, గిడుగుల వ్యావహారిక భాషావాదాన్ని సమర్థించి కావ్యభాషగా వీరు వ్యవహార భాషను గ్రహించారు. ఆయన దృష్టిలో, తెలుగులో గ్రాంధికభాష కేనాడో కాలదోషం పట్టిపోయింది. భాష విషయంలో శ్రీశ్రీ భావకవులందరికన్నా స్పష్టమైన పంథా నవలంబించి, వ్యావహారిక భాషలో కవిత్వం చెప్పటం సాధ్యం కాదన్న ప్రమాదం ప్రబలంగా వున్న రోజుల్లో ప్రతికూలురు సైతం ఆశ్చర్య పడేటట్లు గేయాలు వ్రాసి దాని విశిష్టతను ప్రకటించారు. ప్రపంచ భాషల్లో ముఖ్యంగా ఆంగ్లంలో కవిత్వాని కుపయోగించేది, ఆయా కాలాల్లో వ్యవహారంలో వున్న భాషయే. ఏ కారణంచేతనైనా కొన్ని పదాలు వ్యవహారంనుండి లుప్త మవడమో, మారడమో సంభవించినా, ఆంగ్ల కవులు వారి సమకాలీన వ్యావహారిక భాషనే వుపయోగిస్తారు. Shakespeare భాష మనకు తెలియకపోయినా ఆయన సమకాలీనులకు మాత్రం తెలుస్తుంది. "సెన్సీ" అనే తన కావ్యానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో Shelly యిలా అంటాడు.

I entirely agree with those modern critics who assert that, in order to more men to true Sympathy, we must use the familiar language of men. But it must be the real language of man in general and not that of any particular class to whose society the writer happens to belong.

సుప్రసిద్ధ ఆంగ్ల విమర్శకుడు A. C Bradely దానిపై వ్యాఖ్యానిస్తూ అన్నమాటలు కూడా గమనార్హం. ఆయన యిలా అన్నాడు.

The ideal of the style of tragic drama with the nineteenth of twentieth century should surely be, not to reproduce with modifications, the style of Shakespeare, but to do what Shakespeare did to idealise, without deserting, the language of contemporary speech.

ఎన్నడో శతాబ్దాల క్రితం ఏర్పరచుకొన్న నియమాలకోసం, కవిత్వం ఎవరికీ అర్థంగాకుండా వుండే విధంగా వ్రాసే అలవాటుపడ్డ మనకు యీ మాటలు

వింతగా వుండొచ్చు. కవిత్వభాషకూ, వ్యావహారిక భాషకూగల వైరుధ్యాన్ని తొలగించిన తెలుగుకవి శ్రీశ్రీ.

భాష తర్వాత శ్రీ శ్రీ భావకవులతో భేదించింది కావ్యవస్తువు విషయంలో. పాశ్చాత్యుల ప్రభావ మీయనపై తత్వతః ఎక్కువ. భావకవులది ప్రధానంగా తాత్వికంగా భారతీయదృష్టి. కాని వారి తర్వాతి కవులలో చాలమందికి మార్క్సు సిద్ధాంతం మీద నమ్మకం ఎక్కువ. అన్ని సమస్యలను గతి తార్కిక భౌతిక వాద దృక్పథంతో అధ్యయనం చేయడంలో వీరు రెండవ ప్రపంచయుద్ధంనాటి "Left wingers" అనే ఆంగ్లకవుల కోవకు చెందినవారు. చరిత్ర, సాహిత్యం మొదలగు మానవమేధో వికాస కారకములగు కళలన్నీ మానవుని పురోగమనానికి అంకితం చేయడం వీరిమతం. వీరి గోత్ర ప్రవర్తకుడు శ్రీశ్రీ కవిత్వంలో పై చెప్పిన లక్షణాలన్నీ విస్పష్టంగా గోచరిస్తాయి. ఆ నవ్య దృక్పథానికి నాడే నినాదముల లాంటి అభ్యుదయ కవిత్వలక్షణాలన్నీ మహా ప్రస్థానంలో కనపడుతాయి.

కావ్యవస్తువు విషయంలో శ్రీశ్రీ అభిప్రాయాలు విస్తృతంగా వివాదాలకు గురిఅయినవి

కుక్కపిల్లా
అగ్గిపుల్లా
సబ్బుబిళ్లా
హీనంగా చూడకు దేన్నీ
కవితా మయమేనోయ్ అన్నీ

తలుపుగొళ్లెం
హారతి పళ్లెం
గుఱ్ఱపు కళ్లెం
కాదేది కవితకనర్హం

Ronald Botrall అనే ఆంగ్లకవి భావకవుల కవితావస్తువులైన Nightingales, Anangke, a sunset or the meanest flower were for merly the potentialities of Poetry. అని చెపుతూ వాటికి బదులుగా సంక్లిష్ట సాంఘిక జీవనంనుండి తను 'Power house stacks, griderribs, provide a case' అంటాడు. దీని వలన తేలే సారాంశమేమంటే, కవిత్వ హృదయము

నుండి కవితావేశంవున్నప్పుడు ఏ వస్తువైనా కవితా ప్రపంచంనుండి బహిష్కరించబడవలసిన అవసరం వుండదు. అనుకరణానువాదకుల కంకితమైన ఆంధ్ర కవితాలోకం పురాణగాధల్నే తిరిగితిరిగి వ్రాయటమే అలవాటు చేసుకొంది. కాని క్రొత్తదేదీ ఆలోచించుకొనలేక పోయింది. వాస్తవ విషయాన్ని అటుంచి కల్పిత గాధల్ని స్వీకరించడాన్నే "కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము" లంటూ మనవారు నిరసించారు. సామాన్యుల్ని సాహిత్యమునుండి బహిష్కరించారు. ఐతే శ్రీ శ్రీ తన కవిత్వంలో వాళ్ళకి స్థానం కల్పించాడు. చరమరాత్రి సంపుటిలోని "కవి సన్మానం" అనే కథలో నారాయణబాబుతో యిలా అంటాడు. "మనం ఎవరూ అక్కరలేదని పారవేసిన వాటినే కథా వస్తువులుగా ఏరుకుంటాము. సంఘంలోనూ యింతే. అందరూ నిరాకరించిన రౌడీలు, కేడీలూ మనకు ఆధ్యాత్మక బంధువులు. వాళ్ళ కథల్లోంచి మహా భారతం పిండి, వాళ్ళ జీవితంలో రామాయణం చదువుతాం." అందుకనే ఆయన కవిత్వం "లోహ రాక్షసుల పదఘట్టనచే కొనప్రాణంతో కనలేవాళ్ళు, కష్టం చాలక కడుపు మంటనే తెగించి సమ్మెలు కట్టేవాళ్ళు అనాథులంతా, అశాంతులంతా" తీవ్రధ్వనితో వినిపించిన విప్లవశంఖారావం, సంఘంలో హేయంగా చూడబడేవారి తరపున వకాల్తా పుచ్చుకొని తన కవిత్వానికి "వ్యథార్తజీవిత యదార్థదృశ్యం" పునాదిగా చేసుకొని "భావి వేదముల జీవనాదముల జగత్తుకంతా" స్పష్టంగా తెలియజేసి సాహిత్య ప్రపంచములో సామాన్యుల ప్రాతినిధ్యం సాధించడానికి శ్రమించిన వాడు శ్రీశ్రీ. Two Leaves and a bid" అను నవలకు వ్రాసిన పీఠికలో ముల్కరాజ్ ఆనంద్, కూలీలను ప్రధానపాత్రలుగా తీసికొని నవల వ్రాయడమనే సాంప్రదాయానికి తానే ఆద్యుడనని చెప్పుకొనడమే కాకుండా, శరత్, ప్రేమ చందు, బంకించంద్రఛటర్జీల పాత్రలన్నీ జమిందారీ, భూస్వామ్య మధ్య తరగతి కుటుంబాల నుండి స్వీకరించినవని ప్రకటించారు. అల్లే భోగలాలసులైన వారిని రసిక శిఖామణులుగా చిత్రించే ఆంధ్రసాహిత్య సాంప్రదాయపు సంకెళ్ళ నుండి విడివడి, శ్రీశ్రీ తన కవిత్వంలో శ్రమజీవుల్ని ప్రతిష్ఠించి విప్లవకరమైన మార్పులను తీసుకొచ్చారు. తాజ్‌మహలు నిర్మించిన చక్రవర్తిగారిని గూర్చిగాక, "నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీల" గురించి ఆలోచించారు. పల్లకిలోని ప్రభువును గూర్చి గాక అదిమోసే బోయీలను గురించి ఆయనకు చింత. ఈ విధంగా

ఆయన రచనల్లో ఎక్కడ చూచినా "నిరుపేదల ఆర్తనాదాలు, సమ్మెకట్టిన కూలీలు, లాకౌట్ ప్రకటింపబడిన ఫ్యాక్టరీలు" కనబడుతుంటాయి.

శ్రీశ్రీ మార్క్సిస్టు భావాలు కలవాడనన్నది జగద్విదితమే గాబట్టి దౌర్జన్యం, దోపిడీల గురించి ఆయనకున్న అభిప్రాయాలు సర్వ సామాన్యంగా వర్గ స్వభావ సంబంధాలపైనా, ఉత్పత్తి శక్తుల విభజనపైనా ఆధారపడి వుండడం సహజం. "వాడు" అనే గేయంలో

"పొద్దు పొడిచి పొద్దు గడిచేదాకా
ఎద్దుల్లాగా పనిచేసి అందరం కలిసి చేసిన
దానిని ఒక్కడే ఎత్తుకుపోతుంటే" అది అన్యాయం దారుణం అన్నాడు.

ఆర్థిక అసమానతను ఆధారం చేసుకొని కులికే ధనవంతుల వర్గ ప్రకృతిని "వ్యత్యాసం" అనే గేయంలో బాగా చిత్రీకరించాడు. పరాన్నభుక్కుల సంబరాల్ని పరిహసిస్తూ "వడ్డించిన విస్తరి మీ జీవితం" అంటాడు. వారి స్థానాన్ని కాపాడడానికే న్యాయస్థానాలు. రక్షకభటవర్గాలు, చెఱసాలలు, ఉరికొయ్యలు ఏర్పడ్డాయని పెట్టుబడి దారీ సమాజంలోని ప్రభుత్వ స్వభావాల్ని బహిరంగం చేశాడు. శ్రమజీవుల్ని గురించి వ్రాస్తూ "సంధ్యా జీవులం" సందేహ భావులం. అన్నీ సమస్యలే సందేహాలే మాకు" అని వారితో తాదాత్మ్యాన్ని ప్రకటించాడు. వర్గ వైధుర్యాన్ని బట్టబయలు చేస్తూ "మనమధ్య కంచు గోడ"లున్నాయంటాడు.

దేశచరిత్రలనే ఖండికలో ఆయన చారిత్రక భౌతికవాద దృష్టితో ప్రపంచ చరిత్రను సమీక్షించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే "నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం." అతనికి కనపడేవి నియంతల విజయోత్సవాల సంబరాలు కాదు. భీభత్సరస ప్రధానమైన పిశాచగణ సమవాకారం". సామ్రాట్టుల పన్నీటిజల్లుల స్నానాలు కావు. సామాన్యుల కన్నీళ్ళ ప్రవాహాలు. ఆయన దృష్టిలో గత చరిత్రంతా

"అజ్ఞానపు టంధయుగంలో
ఆకలిలో, ఆవేశంలో
తెలియని ఏ తీవ్రశక్తులో
నడిపిస్తే నడిచిన మనుషులు

చెంఘిజ్‌ఖాన్ తామర్లేనూ
నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ" మొదలగు నరహంతకుల చెప్పు చేతలకు లోబడగా

"అంతా తమ ప్రయోజకత్వం
తామే భువి కధినాధులమని" నిర్మించిన కృతిమచట్టాలను స్థాపించిన సామ్రాజ్యాల సోది. ఈ గొడవలో పడ్డ చరిత్రకారులకు, సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుల సాహసమెట్టిదో, తెలుసుకోడానికి తీరికెక్కడిది ? కోట్లకొలది సైనికుల జీవితాల్ని గురించిన భోగట్టా ఎప్పుడూ సమాధానం దొరకని ప్రశ్నార్థకం. చరిత్రకారులుకూడా కవులవలెనే గతంలో సామాన్యుల్ని తమ ప్రపంచంనుండి వెలివేశారు. రాజులవెంట తిరిగే భట్రాజులు వ్రాసిన జయగీతికల్ని ఆధారం చేసికొని చరిత్ర రచించారు. శాస్త్రీయ వైజ్ఞానిక దృక్పథం లోపించిన చరిత్ర అతిశయోక్తులతో కూడిన కావ్యమైంది- అలెగ్జాండర్‌ను గూర్చి యిప్పటికీ ప్రపంచంలో వున్న చరిత్రలన్నీ అతని ఆస్థానంలోవున్న తాబేదారీ చరిత్రకారుల వ్రాతల్ని, ముఖ్యంగా మెగాస్తనీస్‌ని ధృవపరిచేవే. జీలం నదివరకు దిగ్విజయం చేసిన అలెగ్జాండర్ హఠాత్తుగా మరలి స్వదేశానికి వెళ్ళడానికి కారణాల్లో వొకటి సైనికుల సహాయ నిరాకరణమని అంటారు. అంతదాకా వచ్చి యిక మేము యుద్ధం చేయమని సమ్మెచేసే సైనికుల్ని యీ యిరవయ్యో శతాబ్దంలో సైతం క్షమించరే. మరి అలెగ్జాండర్ యెందుకని వూరుకున్నట్లు ? ఈ ప్రశ్నలకు చరిత్ర సమాధానం చెప్పదు. ఈలాంటి చరిత్రను నిరూపించటానికి మార్క్సిస్టు కానక్కరలేదు. జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు "పురుషోత్తముడు" అనే ఖండికలో

గ్రీకు చరిత్రకారు లెవోకట్టుకథల్ రచియింప దానికే
తోకలు చేర్చి వ్రాసిరి బానిస భారతీయ చార్వాకులు

అని అన్నారు. కాకపోతే శ్రీశ్రీ యేమో ఆ చారిత్రక బానిసత్వం భారతీయుల ప్రత్యేకతే కాదనీ, అది ప్రస్తుత పరిస్థితుల్లో ఏ దేశచరిత్ర కారుడన్నా అంతేనని అన్నారు. చరిత్రకర్థం "ఏ యుద్ధం ఎందుకు జరిగెనో ? ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో ? తారీఖులు, దస్తావేజులు" కాదు. దాని సారం "రాణులు ప్రేమ పురాణం, ముట్టడి ఖర్చులు" గాదు. ఒక వ్యక్తిని మరొక వ్యక్తి "పీడించే నియంతృత్వం కానీ, ఒక జాతిని వేఱొకజాతి" పాలించే జాత్యహంకారంగానీ "ఇంకానా! యికపై సాగ"దంటాడు. చారిత్రక యదార్థ తత్వం, "హాటెన్‌టాట్,

జూలూ, నీగ్రో"లూ చాటిస్తారంటూ వలస వాదాన్ని నిరసిస్తాడు. ఈ గేయం 1938 లో వ్రాయబడ్డది. ద్వితీయ సంగ్రామాన్ని ప్రారంభించిన "నాజీ జాత్యహంకారాన్ని ఎదిరిస్తూ, 'జూ'ల మూక వుమ్మడి హత్యలకు Concentration Campe క్రౌర్యాలకు ఆవేశం చెందిన కవి హృదయం యీ గేయం ప్రతిపాదంలో కన్పిస్తుంది. ఆ కవితోద్రేకమే అతణ్ణి మానవతావాదిగా చేసింది. "ఇతిహాసపు చీకటి కోణం"లో దాచిన సత్యాన్ని వెలికిదీసే భగీరథ ప్రయత్నం, చరిత్రగతిలో మానవకథ వికాసమెట్టిదో చదవాలన్న కుతూహలము ఆ గేయంలో ప్రత్యక్షమౌతాయి. ఆగేయం మన తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు చరిత్రకొక నూతన నిర్వచనాన్ని, నవీనభావాన్ని రూపొందించింది.

కవిత్వంలో గమనించదగ్గ ముఖ్యమైన అంశం ఆయన మానవతావాదము. మానవత్వంలో అచంచలమైన విశ్వాసంతో భవిష్యత్తులో గాఢ నమ్మకంతో, ప్రస్తుత సమాజంలోని కల్మషాన్ని యేవగించుకొని "మరోప్రపంచం" కోసమని ఆరాటపడే వుద్విగ్న భావుకతతో ప్రారంభమయిన ఆయన మహాప్రస్థానం "బాధా సర్పద్రష్టులను ఓదార్చుతూ, దగాపడిన తమ్ములకు ధైర్యం చెప్పి, స్వాతంత్రం, సమభావం సౌభ్రాత్రం, సౌహార్దం పునాదులై" జగమంతా శాంతి కాంతి వెల్లివిరిస్తుందనే ఆశతో ముగుస్తుంది, ఆయన వూహించే "మరోప్రపంచం" Utopia" కావచ్చు. ఆ మాటకొస్తే భవిష్యత్తును గురించిన ఆశయాలన్నీ "Utopia"లే. మానవుడీవిషయాన్ని గమనించికూడా ఏనాడూ వర్తమానం కంటే భవిష్యత్తు బాగా ఉంటుందన్న ఆశల్ని, ఆశయాల్ని వదులుకోలేడు. "గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్" అని వర్తమానాన్ని అసహ్యించుకొని భవిష్యత్తును అయోమయంగా చిత్రించడం నిరాశావాదం. దాన్నే యింకా సాగదీస్తే Misanthropism కూడా అవుతుంది. సాంఘిక జీవనంతో తమ చైతన్యము సంస్కారము కలవనప్పుడు, మేధావులు నిరాశావాదులుగానో, Mysties గానో మారే ప్రమాదముంది. కాని శ్రీశ్రీ మాత్రం తన మానవతావాదాన్ని ఎప్పుడూ మరువలేదు. అతను ప్రథమంగా మానవుడు, తరువాత ఒక దేశస్థుడు. కాబట్టి అతడు మానవుణ్ణి ఏదేశానికి సంబంధించినా, మానవునిగా ప్రేమించడం ముఖ్యాశయంగా పెట్టుకున్నాడు. "మానవుడా" అనే గేయంలోఅన్ని జాతులకు చెందినవాళ్లూ, అన్ని భాషలకు చెందిన వాళ్ళూ, ప్రియతములని చాటి అతని మానవతా వాదాన్ని సార్థకం చేసుకున్నాడు. అతని మానవుడు "అవి

భ క్త కుటుంబి, ఏకర క్తబంధం" అతడాస్ట్రేలియనైనా మానవుడే, ఆసియా వాడైనా మానవుడే. అలా అతడు భౌగోళిక, రాజకీయ సంకుచితత్వాల కతీతుడు. "తెల్లని, నల్లని, ఎర్రని, పచ్చని" రంగైనాసరే మానవ సంఘంలో అందరూ సమానులే. అలా అతడు జాతి విద్వేషాహంకారాల కతీతుడు. "సంఘపశూ" అనే సంభోదనలో Man is a Social animal అనే సత్యాని కుదించాడు. ఘర్మవర్షపయోధుడా "అని శ్రమ ప్రాధాన్యాన్ని. "భావధునీ" అనటంలో Man lives not by bread alone" అనే వాస్తవాన్ని స్ఫురింప జేసాడు. నిరంతరం మరో ప్రపంచంలోని మంచికోసం అన్వేషిస్తూ సాగిపోయే మానవుని మహా ప్రయాణానికి శ్రీశ్రీ మహాప్రస్థానం, గచ్ఛద్వ్యాఖ్య, ఇదంతాఖర్మ అని కొట్టివేసే Escapist ధోరణులను తీవ్రంగా విమర్శించడానికి ఆయన వెనుదీయకనటానికి, "మిథ్యావాది" అనే ఖండిక సాక్షి. శ్రీశ్రీకి గల వసుధైక కుటుంబమనే ఆశయాలకి ప్రతీకగా యిట్లా ఎన్నైనా చూపవచ్చు. "విశ్వమానవ సౌభ్రాత్రమనేది అభ్యుదయ కవిత్వ లక్షణాలలో ప్రధానమైన"దని డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారు అన్నమాట అక్షరాలా నిజం. ఈ ఆశయాలే అతని "గర్జించు రష్యా" అనే గేయానికి ప్రాతిపదిక సోపానాలు.

శ్రీశ్రీ ఆంగ్ల కవిత్వాన్ని క్షుణ్ణంగా చదివినవాడు. ముద్దుకృష్ణగారు "వైతాళికులు"లో పరిచయం చేసినట్లు "స్కెచ్ నుండి జాయ్స్" వరకుగల ఆంగ్ల కవిత్వ ప్రపంచంలోని పోకడలను బాగా ఆకళింపు చేసుకొన్నవాడు. కాబట్టి సహజంగా వారి భావాల ప్రభావం ఎక్కువగా వుంది. దాన్ని ఆయనే గుర్తించి వారికి కృతజ్ఞత తెలుపుతూ స్విన్‌బర్న్ మహాకవికి అను గేయం సైతం వ్రాశాడు. ఒకరినుండి నేర్చుకొనడాన్ని హీనంగా చూడని మనస్తత్వం కాబట్టి, తాను అనువాదం చేసిన, అనుకరణం చేసిన ఫ్రెంచ్ కవులకు, ఆంగ్ల కవులకు కృతజ్ఞత లాయా సందర్భములలో తెలియజేశాడు. "పేదలు" అనే గేయం అనువాదమైనప్పటికి ఎంత చక్కగా వుందో చూడవచ్చు

అంతేలే పేదలగుండెలు; అశ్రువులే నిండినకుండలు
శ్మశానమున శశికాంతులలో । చలి బారిన వెలిరాబండలు.
"అంతేలే, పేదల చేతులు । శ్లథశైశిర పలాశరాతులు
విశుష్కములు । పరిపాండురములు
విదిలించెడు విషాదహేతులు"

విషయ వైవిధ్యానిబట్టి శైలీ, చందస్సూ మార్చి హృదయానికి హత్తు కొనేటట్లు చెప్పడం శ్రీశ్రీ ప్రత్యేక విశిష్టత. కరుణరసాన్ని పోషించడానికి పైది నిదర్శనం కాగా బీభత్సరస పోషణకి

ఇదేమి ! లోకం హిరణ్యనేత్రుని – పదాఘాతమున ప్రతిధ్వనించగ
కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు – గదాఘాతమున గజగజలాడగ
జాతిజాతి నిర్ఘాతపాతనం – ఘాతహేతువై, కాలకేతువై
మిహిరవాజితతి – ముఖవధనుర్ధృతి

అనే చరణాలు వుదాహరణం. పై పాదాల్లో ఛేకానుప్రాసముంది. ఐతే అతనికి ఛందస్సూ, అలంకారాలూ, యతిప్రాసలూ, నియమాలుగా" అనుస రించటమంటే అయిష్టం. "దేశచరిత్రలు" అనే గేయంలో యతిప్రాసలు లేవు కాని భావశబలత మిక్కుటం. భావరాహిత్యాన్ని నియమ నిబంధనలతో కప్ప డానికి వ్యతిరేకి. అయితే యతిప్రాసలు లేనంత మాత్రాన భావరాహిత్యాన్ని సహించడు దాన్ని "యతిప్రాసల్లేని బాధపడటం" అంటూ నిరసించాడు.

శ్రీశ్రీ దేశభక్తిగూర్చి, రాష్ట్రాభిమానాన్నిగూర్చి అపవాదువుంది. అతని అంతర్జాతీయత, విశ్వజనీనతల నర్థంచేసుకొనక పోవడం వలన కలిగే దురభి ప్రాయం అది. ఆంధ్రరాష్ట్రం వచ్చినపుడు ఆనందించి

"శిశువుకుదక్కని స్తన్యంలాగా ప్రవహిస్తున్నాయి గోదావరినీళ్ళు" అని విచారించి తనరాష్ట్రం పరిశ్రమలతో పాడిపంటలతో విలసిల్లాని కోరడం కన్న యింక రాష్ట్రాభిమానం ఏముంటుంది? ఇంకొక భావకవికూడా వెలిబుచ్చాడు తన రాష్ట్రాభిమానాన్ని క్రింది పాదంలో

బ్రహ్మదేశంబు నీపంట పండినచేను
మధ్యరాష్ట్రంబుల నీమాటచెల్లు"నని

ఈ మాటలు మనం మధ్యప్రదేశ్‌లో అంటే కలిగే సన్మానము వూహించు కోవచ్చు. భావసమైక్యతకు విచ్ఛిన్నం కలిగే విధంగా యితరుల్ని తిట్టడమే రాష్ట్రాభిమానమంటే శ్రీశ్రీకి రాష్ట్రాభిమానంలేదు.

కారల్ మార్క్సు కళ్ళద్దాలు తగిలించు కొన్నందుకు ఆయ నేమీ విచార పడటం లేదు. ఎందుకంటే ప్రతికవీ ఏదో ఒక కళ్ళద్దాలు తగిలించుకొన్న వాడే – ఒకడు బౌద్ధమూ, మరియొకడు ద్వైతమూ అలాగే అద్వైతమూ

తుదకు శ్రీశ్రీ 'మహాకవి' అనదలచుకోలేదు. ఎందుకంటే కొందరు దాన్ని సవర్ణదీర్ఘసంధి చేయవచ్చు.

# విమర్శకుడుగా శ్రీశ్రీ

— చేకూరి రామారావు

సాహిత్య రంగంలో రెండు మూడు శాఖల్లో కృషిచేసిన వ్యక్తికి ఒక శాఖలో వచ్చినంత పేరు మిగతాశాఖల్లోరాదు. దానికి ప్రధానకారణం ఒకశాఖలో వచ్చినగుర్తింపు మిగతా శాఖల్లోకృషిని కప్పివేస్తుంది. క్రిస్టోఫర్ కాడ్వెల్ పద్యాలు, డిటెక్టివ్ నవలలుకూడా రాశాడని అందరూఎరగరు. అట్లాగే శ్రీశ్రీని కవిగా ఎరిగినంత విమర్శకుడుగా ఎరగరు.

శ్రీశ్రీ నిజానికి సాహిత్యవిమర్శ అంతయెక్కువ చెయ్యనిమాట నిజమే. రాశితక్కువైనా విలువైన సాహిత్యవిమర్శ చేసిన కొద్దిమందిలో శ్రీశ్రీ ఒకడు. ఆయనసాహిత్య విమర్శని మూడు భాగాలుగా విభజించవచ్చు 1. గురజాడ వేమనలమీద రాసినవ్యాసాలు, 2. ముత్యాల సరాలమీదివ్యాసం, 3. పుస్తకాలకు ఉపోద్ఘాతాలు.

పట్టాభి ఫిడేల్ రాగాల డజనుకు, ఆరుద్ర త్వమేవాహానికి, రమణారెడ్డి అంగారవల్లరికి, విశాలాంధ్రవారు అచ్చువేసిన ముత్యాలసరాలకూ, మల్లారెడ్డి పుస్తకాల్లో ఒకదానికి అట్టవెనకా ఒకదానికి లోపలారాసినవి—శ్రీశ్రీ ఉపోద్ఘాతాల్లో పేర్కొనదగినవి. ఈ ఉపోద్ఘాతాల్లో శ్రీశ్రీ చేసిన సాహిత్యవిమర్శకంటె వెలిబుచ్చిన అభిప్రాయాలే ఎక్కువ. వీటిల్లో కవులప్రతిభను గుర్తించిన శ్రీశ్రీ నైశిత్యాన్ని మెచ్చుకుంటూనే అక్కడక్కడ అతిశయోక్తులు రాశాడేమో అనిపిస్తుంది. ఆరుద్రప్రతిభను ఈనాడు ఎవరూ శంకించరు. కాని శ్రీశ్రీ కవిత్వానికి ఆరుద్రకవిత్వం Substitute కాగలదని కూడా ఎవరూఅనుకోరు. ఇక శ్రీశ్రీ కవిత్వం రాయక్కర్లేదని ఆరుద్ర పుస్తకంలో శ్రీశ్రీ చెప్తే అదిఆయన కొత్తను ఆహ్వానించగల మంచిమనసును సూచిస్తుందిగాని ఆయన సాహిత్యాన్ని అంచనా వేసేపద్ధతిని సూచించదు. అట్లాగే మల్లారెడ్డి గేయాల అట్టవెనక శ్రీశ్రీ లేఖ కూడా. అది చాలాగొప్పలేఖ. అది మొదట విశాలాంధ్రలో అచ్చయినపుడు

కొందరికి అర్థంకాలేదు కూడా. ఒక కొత్తగొంతుకను సహృదయంతో ఆహ్వానించే శ్రీశ్రీ యే కనిపిస్తాడక్కడ. తను ప్రారంభించిన కార్టూన్ కవిత్వాన్ని తనతోదాదాపు సమానంగా రాయగల మల్లారెడ్డిని చూసి ముగ్ధుడై spontaneous గా రాసిన లేఖ. దాని నిజాయితీని సందేహించాల్సిన పనిలేదు. కాని శ్రీశ్రీ కీర్తిని తస్కరించగల శక్తిమంతుడు మల్లారెడ్డి అని ఇంతవరకూ రుజువుకాలేదు. కార్టూన్ కవిత్వం శ్రీశ్రీ కవితావతారాల్లో ఏకదేశం మాత్రమే. అది మల్లారెడ్డికి సర్వస్వమై కూర్చుంది. మల్లారెడ్డి శంఖారావానికి రాసిన పీఠికలో శ్రీశ్రీ ఇంకా స్త నిర్మోహమాటంగా కనిపిస్తాడు. మల్లారెడ్డి "సొంతంచేసుకొన్న కవితా శిఖరాలను" పేరుపెట్టి చెప్పక పోయినా ఆయన ఉదాహరించిన ఖండికల పేర్లను బట్టి మనం గ్రహించవచ్చు. అంతే కాక 'బుక్కులు, వృశ్చిక సంతానం' వంటి ఖండికలను గురించి చెప్తూ శ్రీశ్రీ తన కోపాన్ని దాచుకోలేదు. "రష్యాని ఎవరేనా తిడితే నాకెంత కోపం వస్తుందో అలాగే చైనానుతిట్టినా కోపంవస్తుంది" అని స్పష్టంగా వెల్లడించాడు. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలురావటం అభ్యుదయ వాదులందరు బాధపడాల్సిన విషయం. అదే శ్రీశ్రీలో కనిపిస్తుంది. కాని మల్లారెడ్డి బుక్కులు, వృశ్చిక సంతానం అనేగేయాలు ఒక కమ్యూనిస్టు రాయదగినవి కావు. కొన్నాళ్ళకిందట చైనా వాళ్ళని తిట్టటమే ఫ్యాషన్‌గా చెలామణి అయిన కాలంలో వచ్చిన రణభేరి వంటి సంకలనాల్లో చేర్చదగిన గేయాలవి. ఇట్లాంటివి 'కుందుర్తి, నారాయణరెడ్డి, తిలక్' వంటి కవులు రాస్తే ఎవరూ పట్టించుకోరు. వాళ్ళు దేశభక్త కవులు. ఈ విషయంలో తన సత్యాగ్రహాన్ని వెల్లడించాడు శ్రీశ్రీ. అందువల్ల శ్రీశ్రీ రాసిన పీఠికల్లో శంఖారావానికి రాసిన పీఠిక విశిష్టమైనది. కవి ప్రతిభను మెచ్చుకుంటూనే తన resentment ని వెల్లడించాడు. అతిశయోక్తులు లేని పీఠికకూడ ఇది.

శ్రీశ్రీ రాసిన ఒకే ఒక టెక్నికల్ వ్యాసం 'ముత్యాలసరం'. ఇది చాలా కాలం కిందటే (1935 ?) ఉదయినిలో అచ్చయింది. ముత్యాలసరం ఛందస్సునీ, అదివాడిన కవులపద్యాల్ని విపులంగా పరిశీలించిన వ్యాసం ఇది. ఆధునిక కవిత్వంలో మొదటిసారిగా ముత్యాలసరాలు వాడిన గురజాడ మొదట మూడు పాదాల్లో 14 మాత్రలూ, 4వ పాదంలో 7 మొదలు 14 వరకూ ఉంటయ్యని మాత్రమే చెప్పాడు. కేవలం పాదంలో మాత్రల గరిష్ఠ సంఖ్యే ప్రమాణంగా తీసుకుంటే ముత్యాలసరం లక్షణం కనిపించదు.

అంతేలే పేదలగుండెలు
అశ్రువులే నిండిన కుండలు
శ్మశానమున శశి కాంతులలో
చలి బారిన వెలి రాబందలు

అన్నగేయంలోనూ పాదానికి 14 మాత్రలున్నై. కాని ఇది ముత్యాలసరం కాదు. దానికి కారణం ఈ 14 మాత్రలు గణాలుగా విభక్తమైన తీరు వేరు. ముత్యాల సరంలో ఇవి 3 + 4 + 3 + 4 క్రమంలో విరగాలి. ఈ సంగతి గురజాడ అప్పారావుకు తెలీదనలేం, కాని ఎందుకో చెప్పలేదు. శ్రీశ్రీ ఉదహరించిన వసు చరిత్రలోని వృషభగతిరగడ ఆ విధంగా విరుగుతుంది.

నాలుగో పాదంలో 7 మొదలు 14 మాత్రలవరకూ ఉండవచ్చునన్న గురజాడ లక్షణం కూడా అసమగ్రమే. గురజాడ రచనల్లో నయినా నాలుగో పాదంలో 9 మాత్రలు గాని 12 మాత్రలుగాని వాడినవే ఎక్కువగా ఉన్నై. ప్రాచీనుల యక్షగానాల్లో 14వ పాదంలో 9 మాత్రలు వాడినవి కూడా కనిపిస్తై.

మేలుకొనవే చంద్రశేఖర
మేలుకొనవే ఇంద్రవందిత
మేలుకొనవే ఫాలలోచన
నీలకంఠహరా.

పైది కంఠీరవరాజు యక్షగాన కృతుల్లోది (నిడదవోలు వెంకటరావు గారు సేకరించారు.)

శ్రీశ్రీ ముత్యాల సరం నడకను సరిగ్గానే గ్రహించాడు. 4 మాత్రల గణ స్థానంలో జగణం పరిహరించక పోతే నడక దెబ్బతింటుందని కూడా చెప్పాడు. కాని మూడు మాత్రలస్థానంలో లగాన్ని అంగీకరించాడు. లగ ప్రయోగంవల్ల ప్రౌఢత్వం సిద్ధిస్తుందని కోకిలమ్మ పెండ్లిలోనుంచి ఉదహరించాడు.

చివురులూ కొమ్మలా చివర
గుబురులూ గుబురులా చివర
పూవులూ నాలుగూ వైపుల
బుగులు కొన్నాయి.

మాత్రా ఛందస్సుకు గతి ప్రధానమైంది. పై పద్యంలో 3–4–3–4 గణాల విరుపులే కనిపించనప్పుడు ముత్యాలసరంగా అంగీకరించటం కష్టం. ఇక ప్రౌఢ ప్రయోగ మెక్కడ? పై పద్యంలో మొదటి రెండు పాదాల్లో 5 + 5 + 3 ఈ పద్ధతిలో మాత్రాగణాలున్నై. పైదీ ముత్యాల సరంగా అంగీకరిస్తే ఈ కింది పద్యమూ ముత్యాలసరవే, అనాలి.

అత్యంత మాధురీ భరిత
మానాటె కలగన్న చరిత్ర
మానిమే షపుస్వప్నకాల
మేనాటికిని మరువజాల.

ఇది మధ్యాక్కరను మాత్రా ఛందస్సుల్లోకి మలచి ఈ వ్యాసకర్త చేసిన ప్రయోగం. ఇంద్ర గణాలకు బదులు 5 మాత్రల గణాలు వాడటంవల్ల వచ్చిన మాత్రాపద్యం ఇది. దీన్ని ముత్యాల సరం అనటానికి వీల్లేదు. అందువల్ల జగణంతోపాటు లగం కూడా పరిహరిస్తే గాని నడకకు బిగువురాదు. ముత్యాల సరాలను ఎక్కువగా వాడిన శివశంకర శాస్త్రి, వట్టికొండ రంగయ్యవంటి కవులు లగాన్ని పరిహరించారు.

శ్రీశ్రీకి 'లగం' 'జగణం' వంటి విలోమగమన శీలమైన గణాలంటే ప్రీతి. 'జగణం' వల్ల నడక కుంటుపడటం శ్రీశ్రీ గ్రహించాడు గాని, 'లగం' విషయం కన్సెషన్ ఇచ్చాడు. శ్రీశ్రీ రచనల్లో జగణాల ప్రాచుర్యం ఎక్కువ. ముత్యాల సరాల్లో జగణాలు వాడలేదు. గాని లగాలు వాడిన ఘట్టాలు చాలా ఉన్నై. 'పవితల్లీ' అనే గేయంలో (జగద్గురు శంకరుండెచ్చట) లేని దానికి తానే చేసిన అనుకరణ 'ప్రజాస్వామ్యపు పెళ్ళికోసం' అనే చోటకాని వీటిని గమనించవచ్చు. లగం పరిహరించట మొక్కటే పద్యం నడకకి గ్యారంటీ ఇయ్యదు కాని, సహాయపడుతుంది. ముత్యాల సరం జగణంతోపాటు లగాన్ని కూడా ఇముడ్చుకో లేదని ఈ వ్యాసకర్త అభిప్రాయం.

ఇక నాలుగో పాదంలో మాత్రం సంఖ్య తగ్గటాన్ని గురించి శ్రీశ్రీ చెప్పింది సరైందే గాని అసమగ్రం. నాలుగో పాదంలో సాధారణంగా తొమ్మిది మాత్ర లుంటయ్యనీ, ఒక్కోసారి 8 కూడా ఉండవచ్చని రెండుదాహరణలు చూపించాడు. ఏమైనప్పటికీ అక్కడ కూడా 3 + 4 మాత్రాక్రమ విభజన ముఖ్యమనీ సూచిం

చాడు. మాత్రా ఛందస్సులన్నిటికీ సరిపోయే ఒక సాధారణ సూత్రానికిది ఒక ఉదాహరణ మాత్రమే. సరిమాత్రా సంఖ్యాకమై, రెండు సమదళాలుగా విభజించ దగిన ఏమాత్రా పద్యంలోనైనా అర్ధపాదంమీద గురువు వేసి గతి భేదాన్ని కల్పించవచ్చు. ఈ పద్ధతిలో వివిధ ఛందస్సుల్లో విద్వాన్ విశ్వం చేసిన ప్రయోగాలున్నై. అట్లాగే సరిపాదాల్లో మాత్రాసంఖ్య తగ్గించి కూడా గతి భేదాన్ని చూపించవచ్చు. అప్పుడు రెండు పాదాల్ని కలిపి ఒక పాదంగా భావించినా భావించవచ్చు. ముత్యాలసరాన్ని అట్లా వాడితే మానిని, కవిరాజ విరాజితంవంటి వృత్తాల నడక వస్తుంది. నన్నయ భారతంలో శకుంతల కథలో ఈ వృత్తాల్ని పరిశీలించవచ్చు. ఇక మాత్రా ఛందస్సులు ముఖ్యంగా పాడుకో టానికి ఉద్దిష్టమైనవి గనుక చివరి గురువు స్థానంలో లఘువువేసినా గురుతుల్యమే. అంటే శ్రీశ్రీ ఉదహరించిన నాలుగో పాదం 8 మాత్రలున్న పద్యంలో 9 మాత్రల్నే లెక్కబెట్టాలన్నమాట.

ఇట్లా అర్ధ పాదంమీద గురువు వేసిన ముత్యాలసరాన్ని రెట్టించి ఒకే పద్యంగా చేస్తే కన్నడుల భామినీషట్పది అవుతుంది. అంటే నాలుగో పాదంలో అర్ధపాదంమీద గురువున్న తెలుగు ముత్యాలసరం కన్నడ భామినీషట్పదిలో సగానికి సమానమన్న మాట. త్రిశ్రగతి, చతురశ్రగతి, ఖండగతిలో నడిచే మాత్రాపద్యాలను కూడా పై పద్ధతిలో నడిపిస్తే, కన్నడంలోని కుసుమ, శరాది షట్పదుల అర్ధభాగానికి సరిపోతై. వీటిని గురించిన విపులమైన చర్చ ఈ వ్యాస కర్త పదేళ్ళకిందట 'అభ్యుదయ'లో రాసిన వ్యాసాల్లోఉంది.

మాత్రాఛందస్సుల గురించి ఈ విషయాలు చెప్పటం శ్రీశ్రీలో లోపాలు ఎన్నటంకోసంకాదు. ముత్యాలసరం అర్థంచేసుకునే పద్ధతి మిగతా మాత్రా ఛందస్సుల్ని అర్థంచేసుకోటంతో ఎట్లా ముడిపడి ఉందో చూపించటమే పై పరి శీలన ఉద్దేశం.

శ్రీశ్రీ చేసిన ముత్యాలసర పరిశీలనలో చెప్పుకోదగింది గురజాడ తరు వాత కవులు ముత్యాల సరంలో తెచ్చిన మార్పులు. పైన చెప్పినవేగాక కవి కొండల వెంకటరావుగారు శివరాత్రిప్రభలోనూ, దాన్ని అనుసరించి శ్రీశ్రీ జయభేరి ఖండికలోనూ అట్లాంటివే మిగతా కవుల రచనల ఉదాహరణల్లో కని పించేవి పరిశీలించ దగినవి. 14 మాత్రల ముత్యాల సరాన్ని 7 మాత్రల

పాదాలుగా విభజించటం పెద్ద మార్పుకాదు. పాదాలను విభజించి రాయటమే తేడా. తరువోజను ద్విపద చెయ్యటంలాంటిది. రగడల్లోకూడా ఇట్లాంటి పద్ధతి ఉంది. కాని పాదాల్ని హ్రస్వీకరించటంబదులు మాత్రలను పెంచి దీర్ఘీకరించటం వల్ల విశేషమైన నడకవస్తుంది. అదే కవికొండల, శ్రీశ్రీలు చేసిన అందమైన ప్రయోగం. దీన్నికూడా ఇంతకుముందు చెప్పిన పద్ధతుల్లో ఒకదాని విస్తరణే.

నేనుసైతం
ప్రపంచాగ్నికి
సమిధనొక్కటి ఆహుతిచ్చాను.

ఈ పైత్రిపాత్తులో మొదటి రెండు పాదాలు ప్రామాణిక ముత్యాల సరపు పాదార్ధ ప్రమాణం కలవి. అవిరెండుకలిపి ఒకటిగా రాసినా ఇబ్బందిలేదు. కాని మూడో పాదంలో శ్రీశ్రీ 15 మాత్రలు లెక్కపెడతాడు, మొదటి రెండు పాదాల్లాంటి 7 మాత్రల దళంమీద 8 మాత్రల అధికదళమన్నమాట. కాని దీన్ని శ్రీశ్రీ చెప్పినట్టుగాకాక ఆ అధికభాగాన్ని 9 మాత్రల దళంగా లెక్కపెట్టటం సబబు. ఎందుకంటే ఈ అధికభాగం ప్రామాణిక ముత్యాల సరంలో 9 మాత్రల నాలుగో పాదానికి సమానం. చివర లఘ్వాభాసమైన అక్షరం మాత్రా ఛందస్సం ప్రదాయం ప్రకారం ఉచ్చారణలో గురువే.

ముత్యాలసరం వ్యాసంలో నిష్పక్షపాతంగా నిర్మొహమాటంగా శ్రీశ్రీ ఒకమాట చెప్పాడు. గురజాడ అప్పారావుగారు ముత్యాలసరాన్ని మెలకువతో నిర్వహించలేదని శ్రీశ్రీ చేసిన పరిశీలన అక్షరాలా నిజం. టెక్నిక్ విషయంలో గురజాడతరవాతకవులతో ముఖ్యంగా తన వారసుడైన శ్రీశ్రీతో సరితూగ లేడు. ఆ వ్యాసం చివరే శ్రీశ్రీ కవిత్వం, సంవిధానం అనే constants +, - అనే variablesతో చేసిన విభాగం ప్రకారం మూడో విభాగంలో చేరుతుంది. అంటే + కవిత్వం, - సంవిధానంఉన్న పద్ధతి గురజాడదన్నమాట. శ్రీశ్రీ ఈ మాట స్పష్టంగా చెప్పలేదుగాని ఆయన ఇదే ఉద్దేశించి ఉంటాడని మనం ఊహించవచ్చు.

ముత్యాలసరం కవులు వాడిన టెక్నిక్‌ను గురించికూడా కొద్దిగా చెప్పాడు.

(a) వివిధ సారస్వత నదీనద

(a) విమలజలముల నోలలాడుచు

(b) అనిశమానందాధి గమమున

(b) నలరుదములక్ష్మి

అన్న పద్ధతి శివశంకరశాస్త్రి పద్యాల్లో శ్రీశ్రీ చూపించాడు.

కవి అభిరుచిననుసరించి ఇంకా ఎన్నో పోకడలు పోవచ్చు ముత్యాల సరంలో. అన్ని పాదాల్లోనూ అనునాసిక ప్రాసయతిలేసి, run on verse లాగా నడిపించి అందాలు తియ్యవచ్చు. ఉదాహరణకు ఈ మూడు పద్యాల్ని గమనించండి.

1. ఎంత సేపట్లుంటినో ఏ
వింత కలలను కంటినో నా
వంతలన్నీ తీరెనంచును
సంతసించితిని.

2. ఏ పురాభవ పుణ్యఫలమో
నీపదమ్ముల నీడదొరికెను
ఈ పదమ్ములు కూర్చిపాడుట
నీ పదార్చనకే.

3. పాటలా అవి బ్రతుకుబాటల
పాటులో నా ఎడద పొలమున
బాటలో కన్నీటిసంద్రపు
పోటులో కాక.

ఇప్పటికే దీర్ఘమైన చర్చను పై పద్యాల్లో టెక్నిక్‌ని వివరించటం కోసం ఇంకా పొడిగించ దల్చుకోలేదు. పాఠకులే విశ్లేషించుకోవచ్చు. శ్రీశ్రీ వ్యాసం నెపంతో ముత్యాలసరం గురించి ఈ వ్యాసకర్త తనకున్న కొన్ని అభిప్రాయాల్ని వెల్లడించటం పూర్తిగా సమంజసం కాక పోయినా క్షంతవ్యమే. టెక్నికల్ విషయాల మీద గొప్ప విమర్శలు రాయగల నిష్పక్షపాతుడైన, ప్రతిభావంతుడైన విమర్శ

కుడుగా శ్రీశ్రీ ఈ ముత్యాలసరం వ్యాసంలో కనిపిస్తాడు. కాని శ్రీశ్రీ అట్లాంటి వ్యాసం ఇంకోటి ఎక్కడా రాసినట్టు కనపడదు.

ఇక శ్రీశ్రీ ప్రతిభను ఉత్తమ సాహిత్య విమర్శకుడుగా నిలబెట్టేది పై వ్యాసం కన్నా ముఖ్యమైనవి గురజాడమీద రాసిన రెండువ్యాసాలు. ఇవి రేడియోలో ప్రసారితమైనై. తరవాత పరిశోధన సంచికలోను అచ్చయినై. వాటినే మనసాహితీ వాళ్ళు (తరవాత విశాలాంధ్రవాళ్ళు) శ్రీశ్రీ గురజాడ మీద రాసిన వ్యాసాల సంపుటిలో చేర్చారు.

గురజాడను అర్థం చేసుకోవలసిన సరియైన పద్ధతిని మొదటిసారిగా సూచించి రమణారెడ్డి, రామచంద్రారెడ్డివంటి గురజాడ విమర్శకులకు శ్రీశ్రీ మార్గదర్శి అయ్యాడనటం ఆ విమర్శకుల ప్రతిభను కించపరచటంకాదు. ఉత్తమ సాహిత్య విమర్శకుడికి కావలసిన నిశిత పరిశీలన, దాన్ని వ్యక్తీకరించే బలమైన వచన శైలి శ్రీశ్రీ వ్యాసాల్లో కనిపిస్తై. గతాను గతికంగా శతాబ్దాల తరబడి నలిగిన దారి వదలి కొత్త దారిని తొక్కటమే గురజాడ గొప్పదనమని శ్రీశ్రీ స్పష్టం చేశాడు. నిజానికిది తన లక్షణం కూడా. అందుకే గురజాడ గొప్పదనాన్ని గ్రహించాడు, సాహసాన్ని అభినందించాడు. అంతకుముందు వచనమున్నా నిజమైన అర్థంలో ఆధునిక వచనాన్ని ప్రవర్తింపజేసినవాడు గురజాడ. కన్యాశుల్కం, వ్యాసాల్లో వ్యావహారిక శైలి వాడి ఆధునిక వచనాన్ని అందించాడు గురజాడ. గురజాడని ఇంత నిశితంగా పరిశీలించిన శ్రీశ్రీ గురజాడ వచనంలో ఒక ముఖ్యమైన లోపాన్ని– బహుశా గ్రహించినా– వదిలేశాడు. గురజాడ రాసిన వ్యావహారికం లోపభూయిష్టమైనది. గ్రాంధికపుశైలీవిన్యాసం తరచుగా కనిపిస్తుంది. నిజానికది ఆ కాలపు రచయితలందర్లోనూ ఉంది. అందుక్కారణం వ్యావహారిక భాషను గురించి, సరసమైన దృష్టి ఉన్నా సమగ్రమైన అవగాహన లేకపోవటం. ఈనాటికీ చాలా మందిలో ఈ అవగాహన లేదంటే గురజాడని మనం తప్పుపట్టాల్సిన పనిలేదు. అంతదాకా ఎందుకు? శ్రీశ్రీ రాసిన ముత్యాలసరం అనే వ్యాసంలోనే బోలెడు గ్రాంధిక ప్రయోగాలునై్న! క్రొత్త, త్రొక్కించిన, వ్రాశారు, ప్రయోగించాడు వంటి రూపా లావ్యాసంలో ఎన్నో ఉనై్న. కన్యాశుల్కాన్ని వదిలేస్తే తక్కిన గురజాడ రచనలు మనం ఈనాడు రాస్తున్న వ్యావహారిక శైలికి చాలా దూరంగా ఉన్నయ్యని మనం గురజాడని అంచనా వేసేటప్పుడు మరిచిపోగూడదు.

గురజాడ కథల్లోనూ వ్యాసాల్లోనూ రాసింది ఆ కాలపు వాడుక భాషకూడా కాదు. రాతలోకొచ్చేసరికి తప్పించుకోలేకపోయిన సాంప్రదాయపు ప్రభావమది. శ్రీశ్రీ రాసిన ముత్యాల సరం వ్యాసానికి గురజాడ మీద రాసిన మిగతా వ్యాసాలకే బోలెడు తేడాఉంది, శైలి విషయంలో.

గురజాడను సాహిత్య రంగంలో తొలి విప్లవకారుడుగా గుర్తించాడు శ్రీశ్రీ. కందుకూరి, తిరుపతి వేంకట కవులు, రాయప్రోలు గురజాడ కంటె గొప్ప వాళ్ళుగానే ఒప్పుకుంటూ, సాహిత్య పరిణామాన్ని ఒక్క అడుగు ముందుకు వేయించినందువల్ల వీళ్ళకంటే గురజాడ అధికుడైనా డంటాడు. ఆయన మాట ల్లోనే సాహిత్య పరిణామంలో ఈ నలుగురికీ గురజాడ అప్పారావుకీ ఉన్నతేడా సామాజిక వ్యవస్థలో సంస్కరణ ప్రియత్వానికీ విప్లవ నేతృత్వానికీ మధ్యఉన్న భేదం వంటిదే." Reformist కీ Revolutionary కీ ఉన్న తేడా. ప్రాచీన లక్షణాల్ని పట్టించుకోకుండా, ఆధునిక జీవితాన్ని గురించి సజీవ పాత్రల్ని సృష్టించి వ్యావహారిక శైలిలోనే సంభాషణలను రచించిన గురజాడది విప్లవ మార్గమే. అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించు నాటి ఆంధ్రుల మహోజ్వల చరిత్రను పాడుకొని మురిసిపోయే రోజుల్లో మంచి గత మున కొంచెమేనోయ్, మందగించకముందు అడుగెయ్ అన్నవాడు revolutionary కాక ఇంకేమౌతాడు. ఏదో మతమంటూ ఉండాలని బ్రహ్మ సమాజాన్ని వరించిన రోజుల్లో దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుళ్లారా ? మీ పేరేమిటి ? అన్నవాడు నిస్సందేహంగా విప్లవకారుడే. ఇది గమనించని దిగంబర కవులు గురజాడది, నవీన ఛాందసవాదమనీ, శ్రీశ్రీ revolutionary కాదని అనటం. సమాజ పరిణామ క్రమాన్ని, అందులో కవి స్థానాన్ని సరిగ్గా అర్థం చేసుకోక పోవటమే. (చూ. "దిగంబర కవులతో ఇంటర్వ్యూ" జ్యోతి, జనవరి 1970).

గురజాడ తెచ్చింది కమ్యూనిస్టు విప్లవంకాదు. బూర్జువా విప్లవమని అర్థంచేసుకున్ననాడు గురజాడ విప్లవాన్ని సరిగ్గా అర్థంచేసుకోగలుగుతాం. తెలుగు సాహిత్యాన్ని ఫ్యూడల్ బంధాల్నుంచి విముక్తనుచేసి బూర్జువా సమాజంవేపు నడిపించాడు. "గణబద్ధచ్ఛందస్సుల ఫ్యూడలిజంనుంచి మాత్రాబద్ధ చ్ఛందస్సుల ప్రజాస్వామ్యయుగానికి ఆంధ్ర సాహిత్య చరిత్ర గమనాన్ని పరివర్తనం చేసిన వాడు గురజాడ" అని శ్రీశ్రీ అన్నదాంట్లో అర్థం ఇదేనని ఈ వ్యాసకర్త అభి

ప్రాయం. ప్రజాస్వామ్యం బూర్జువా ప్రజాస్వామ్యమనే శ్రీశ్రీ అభిప్రాయం కావాలి. తెలుగు సాహిత్యంలో సోషలిస్టు విప్లవం తెచ్చినవాడు శ్రీశ్రీయేనని ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు.

గురజాడ ఆధిక్యానికి కారాణాలు వివరిస్తూ శ్రీశ్రీ 1. విప్లవపథగమనం 2. భవిష్యత్తుమీద విశ్వాసం, 3. సజీవమైన వాడుక భాష ప్రయోగం, 4. సర్వజనీనత, సార్వకాలికత అని నాలుగు కారణాలు చెప్పాడు. మొదటి రెండూ స్పష్టమే. మూడోది కన్యాశుల్క పరిమితిలో అంగీకరించవచ్చు. నాలుగోది మాత్రం ఈ వ్యాసకర్త అంగీకరించలేదు. ఇతరదేశాల పాఠకులు గురజాడ కవిత్వాన్నికాని, నాటకాన్నికాని ఆనందించి మెచ్చుకుంటున్నారన్నదానికి సరి అయిన దాఖలా కావాలి. సర్వకాలికతఅనేది ఇంకా సంశయాస్పదం. ఇదైనా కన్యాశుల్కం వరకు అంగీకరించవచ్చేమో. గురజాడ దేశభక్తి గేయాన్ని ప్రజాశక్తి గేయాల్లో కత్తిరించి వాడుకోవటం ఈ వ్యాసకర్త సంశయానికి ఒక ఆధారం. ఇకదీన్ని భగవద్గీతతో పోల్చడం అసంమంజసమూ, అనుచితమూకూడా. "ఒక కాలానికీ, ఒక స్థలానికీ పరిమితంకాని సందేశం ఇచ్చేది" అనటం కేవలం అతిశయోక్తి. శ్రీశ్రీ కవిత్వం కూడ ఈ పరిమితిని దాటి నిలుస్తుందో లేదో చెపలేం. అసలా అవసరం కవిత్వాని కంతముఖ్యమా అనేది ఇప్పుడు తేలే విషయం కాదు.

శ్రీశ్రీకి పరిశీలనకు తగిన వ్యక్తీకరణకూడా ఉందని పైన చెప్పబడింది. అందుకు వ్యాసాలు రెండూ, ముత్యాలసరాలకు పీఠిక మొత్తం ఉదహరించదగినవే అయినా కొన్ని విశిష్టమైన ఉదాహరణలు ఇస్తే ఇంకా త్వరగా గ్రహించవచ్చు.

రామప్పంతుల్ని మంచంకింద దాచి గిరీశంతో మధురవాణి మాటాడుతూ 'రామ-అన్నప్పుడు రామప్పంతులు తనపేరు బయట పెడుతున్నదేమోనని భయపడుతాడు. అక్కడ గురజాడ ప్రతిభను వివరిస్తూ శ్రీశ్రీ రాసిన వాక్యం: "ఇక్కడ గురజాడ మహాకవి కాలాన్ని రెండు మూడు క్షణాలపాటు ఆగమని ఆజ్ఞాపించాడు."

"సామాజిక పరిణామానికి విప్లవపంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను."

"భూతకాలం మీద ఇలియట్‌కున్న అభిమానాన్ని అర్థంచేసుకుంటూనే భవిష్యత్తుమీద గురజాడకున్న విశ్వాసానికి నేను నివాళు లెత్తుతున్నాను."

"పావురంలాగా ప్రశాంతంగా రవళిస్తూనే సింహంచేసే క్ష్వేళాధ్వనిని స్ఫురింపజేసుంది

ఇట్లాంటి వాక్యాలు ఎన్నో చూపించవచ్చు. ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు, అన్న వ్యాసంలో మొదటి పేరాలో ప్రతివాక్యమూ బలమైన వచనానికి, శ్రీశ్రీ వచనశైలిలో ప్రత్యేకతకీ నిదర్శనం. శ్రీశ్రీ గురజాడ కథా గేయాల్లో పూర్ణమ్మ గేయానికి కల విశిష్టత సరిగ్గా గ్రహించాడు. (ముత్యాలసరాలు పీఠిక.)

కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి చేరెను మేని పసల్
హంసల చేరెను నడకల బెడగులు
దుర్గను చేరెను పూర్ణమ్మ.

అనేది ఉదాహరించి "ఒక మహాకావ్యాన్నిచదివి ముగించిన అనుభూతి ఈ చరణంలో మనకి లభిస్తుంది" అంటాడు. ఈ పై stanza పూర్ణమ్మ గేయంలో చివరిది. ఇక్కడ మనకి కలిగే అనుభూతి శ్రీశ్రీ చెప్పిన Cinematographic వర్ణనవల్ల వచ్చిందనిపించదు. నిజాని కిక్కడున్న Cinematographic పద్ధతి ఏమిటో ఈ వ్యాసకర్త ఊహకు అందటంలేదు. శ్రీశ్రీయే ఇంకోచోట 'రసన' అనే ఒక కొత్త Theoretical conceptని సూచించాడు. శ్రీశ్రీ మాటల్లో "ఏక కాలంలో అనేకరసాలను ఉప్పొంగింపజేసే" (చూ. రాచకొండ విశ్వనాథశాస్త్రి ఆరు సారా కథలకు మొదటిమాట) పద్ధతి ఇది. దీన్నికొంచం విస్తరింపజేస్తే పై గురజాడ పూర్ణమ్మలోని పై పద్యంలో విశేషం అర్థమవుతుంది. ఏక కాలంలోనే వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని సూచించగల పద్యం ఇది.

ప్రస్తావన వచ్చింది కాబట్టి ఇక్కడోమాట చెప్పుకోవాలి. సాహిత్య విమర్శకి 'రసన' అనే కొత్త ప్రమాణాన్ని సూచించి సాహిత్య సిద్ధాంత కర్తగా కూడా శ్రీశ్రీ తనప్రతిభను నిరూపించుకున్నాడు. దేశభక్తిగేయంలో ఏకకాలంలో ప్రభుసమ్మితంగానూ, కాంతాసమ్మితంగానూ మానవత్వాన్ని ఉపదేశించిందని చెప్పి తన 'రసన'కు సరూపమైన ప్రమాణంతో విమర్శించాడు. అట్లాగే విశ్వనాథశాస్త్రిగారి "గవర్నమెంటుకి పాపం పిచ్చెక్కిందికదూ, ఎలా ఉందో

ఏమిటో చూద్దాం పదండి" అనే వాక్యం ఏకకాలంలో నవ్వూ ఏడుపూ తెప్పించి నయ్యనటం 'రసన' సిద్ధాంతానికి సాక్ష్యం.

శ్రీశ్రీ సాహిత్య విమర్శలో చివరిగా పరామర్శించ దల్చుకుంది ఆయన వేమన పద్యాల్లో టెక్నిక్‌ను గురించి చెప్పింది. (అది వ్యాసమో, ఎవరికో ఇంటర్వ్యూనో గుర్తులేదు. కాని తుమ్మల వెంకట రామయ్యగారు నడిపిన 'అభ్యుదయ'లో పదేళ్ళ కిందట అచ్చయింది).

ఉప్పు కప్పురంబు ఒక్క పోలికనుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ.

అనే వేమన పద్యంలో dialectical materialist technique ఉందంటాడు శ్రీశ్రీ. మొదటి పాదంలో thesis, రెండో పాదంలో antithesis మూడో పాదంలో synthesis ఉన్నై కాబట్టి ఇది dialectical materialist technique అని శ్రీశ్రీ వివరణ. మొదట గ్రహించాల్సింది ఇందులో materialism ప్రసక్తిలేదు. ఇక dialectics ఉందా లేదా అనేది విచారించాలి. ఎంగెల్సు మాటల్లో "Dialecties, however, is nothing more than the science of the general laws of motion and develepment of nature, human society and thought." (See Frederick Engeles "Anti Duhring," Progress Publishers, Moscow 1969, Pp. 168 – 169) ద్రవ్యాత్మకమైన మార్పు, గుణాత్మకమైన మార్పు ఒకదాని కింకొకటి హేతువు కావటం, Negation of the negation వంటి కొన్ని సూత్రాల ననుసరించి ప్రకృతి పరిణామాన్ని, సమాజ పరిణామాన్ని వివరించే ఒక శాస్త్రం dialictics. Antithesis ఈ సూత్రాల ననుసరించి thesis నుంచే పరిణామం చెందాలి. అట్లాగే synthesis antithesisకి పరిణామం. వర్గ రహితమైన ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ thesis. వర్గవిభక్త సమాజం antithesis. దీని తదనంతర పరిణామం మళ్ళీ వర్గాలులేని అత్యున్నతమైన కమ్యూనిస్టు వ్యవస్థ. ఒక వ్యవస్థ బీజాలు అంతకు ముందటి వ్యవస్థలోనే ఉంటై. తరవాతి పరిణామాన్ని వివరించే శాస్త్రం dialictics. పెట్టుబడిదారీ సమాజపు వినాశానికి బీజాలు అందులోనే ఉంటై. తన్నునాశనం చేసే కార్మిక వర్గాన్ని తానే సృష్టిస్తుంది.

అట్లాగే ప్రకృతిలో నుంచి ఇంకో ఉదాహరణ చూడండి. గింజ - thesis చెట్టు antithesis. మళ్ళీ అది ఉత్పత్తిచేసే గింజలు ఉన్నతదశలోకి పరిణామం అవే syuthesis, ఈ రెండుదాహరణల్లో గమనించాల్సింది. ఒకదాని పరిణామాన్ని శాస్త్రబద్ధంగా వివరించే సూత్రాల సమూహం dialectics. వాటిని ఒక రకంగా గతి సూత్రాలు (laws of motion) అనవచ్చు. ప్రపంచంలో ప్రతీదీ చలన శీలమైనదనీ, చలనమే పదార్థానికి అస్తిత్వమనీ dialecties బోధిస్తుంది.

ఈ technique పై వేమన పద్యంలో ఎక్కడుందో ఈ వ్యాసకర్తకు అందటంలేదు. ఉప్పు-కప్పురం రెండు వేరువేరు పదార్థాలు. అవి వేరుగా ఉండటం వాటి గుణాల్ని చెప్పటమే కాని పరిణామాన్ని సూచించటం కాదు గదా. పరిణామమే లేనప్పుడు ఇక dialectics ఎక్కడ ? శ్రీశ్రీ ఆపాదించ దల్చుకున్న dialectic technique శాస్త్రప్రమాణానికి నిలవదు. అంటే శ్రీశ్రీ thesis, antithesis Synthesis అనే మూడు మాటలకు ముగ్ధుడై అవి పరిణామగతిని సూచించే పదాలన్న సంగతి విస్మరించాడన్న మాట. శ్రీశ్రీ మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానాన్ని గురించి రమణారెడ్డి ఇదే సంచికలో వేసిన అంచనాలతో ఈ వ్యాసకర్త ఏకీభవిస్తున్నాడు.

విపులమైన ఈ చర్చ తరవాత శ్రీశ్రీ విమర్శకుడుగా తేలే విషయాలివి.

1. శ్రీశ్రీ ప్రతిపాదించిన 'రసన' గొప్ప theoretical concept. సాహిత్య సిద్ధాంత కర్తగా అతని ప్ర ఈ concept వ్యక్తం చేస్తుంది.
2. శ్రీశ్రీ కొత్తను ఆహ్వానించగల సహృదయుడుగా మాత్రమే ఇతర కవులకు రాసిన పీఠికల్లో కనిపిస్తాడు.
3. Technical విషయాలమీద balanced గా రాయగల నేర్పు శ్రీశ్రీకి
4. విమర్శకుడికి కావల్సిన నిశిత పరిశీలనతోపాటు, వ్యక్తీకరించే బలమైన వచనశైలి శ్రీశ్రీకి ఉంది.
5. శ్రీశ్రీకి ఉన్న మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానం పరిమితం. అవసరమైన అవగాహన మాత్రం ఉంది.

6. శ్రీశ్రీని విమర్శకుడిగా ఎప్పటికీ నిలబెట్టేవి గురజాడని అర్థంచేసుకోటానికి, అంచనావేయటానికి ఆయన చూపినమార్గం, అందించిన ప్రమాణాలు.

నిజానికి గురజాడ కోసమే ఆయన సాహిత్య విమర్శలు చేశాడన్నా సబబే. ఎందుకంటే ఆయన సూచించిన theoritical concepts కూడా ఆయన గురజాడ మీద చేసిన పరిశోధన ఫలితమే. తెలుగులో కొత్త కవిత్వానికేగాక కొత్తరకపు విమర్శకు కూడా శ్రీశ్రీ మార్గదర్శి అనటానికి ఈ వ్యాసకర్తకు అభ్యంతరంలేదు. అయితే దాన్ని రుజువు చేయగలిగిన చారిత్రకాధారాలు ఈ వ్యాసకర్తదగ్గర ప్రస్తుతంలేవు.

1 + 1 = 1
శ్రీ + శ్రీ = శ్రీ
30 + 30 = 30
అరవై అబద్ధం
అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ
కవికి వయస్సు ఎల్లప్పుడూ 30
దాటదు తగ్గదు.
లెక్కలు తప్పినవారికి ఇది శ్రీశ్రీ షష్టిపూర్తి.

—కాళోజీ

# కవి వయస్సు ఎప్పుడూ ముప్పైఏళ్ళే



శ్రీ శ్రీ

తో

ఇరవైమంది యువకుల గోష్ఠి

# కవివయసు ఎప్పుడూ ముప్ఫైయే

1 + 1 = 1 రేడియోనాటికలో అన్నిపాత్రల వయసూ అమృతం తాగాక మారుతుందికాని కవివయసు మారదు. అతనెప్పుడూ త్రిదశుడే. కనుక శ్రీశ్రీ కి అరవైఏళ్ళు నిండాయనడం అబద్ధం.

1969 నవంబర్ మొదటివారంలో శ్రీశ్రీ హైదరాబాదు వచ్చినపుడు లోగా చేసుకున్న ఏర్పాటుప్రకారం చలసాని ప్రసాదరావు శ్రీశ్రీకీ ఇరవైమంది రచయితలకూ 1962 నవంబర్ 2న ఒకగోష్ఠి ఏర్పాటు చేసాడు. కనుక ఆయనను యీ గోష్ఠి ప్రయోక్తగా చెప్పవచ్చు. శ్రీశ్రీని ఎలాంటి ప్రశ్నలువేయాలి అన్న ప్రశ్నవచ్చినపుడు ఆయనకు జీవితమూ సాహిత్యమూ రాజకీయాలూ వేరువేరు అరలు కావుకాబట్టి యీనాటిదేశ పరిస్థితుల్లో యువకులు రచయితలుగా మాత్రమే వుండిపోవడం కాక నిర్మాణంలో భాగస్వాములుగా కూడా కావాలికనుక విధి, నిషేధాలు ఉండకూడదనుకున్నాం. అందుకే ఇరవై మందినుంచి ఆహ్వానించిన ప్రశ్నలకు సంపాదక బాధ్యత వహించిన రాంభట్ల కృష్ణమూర్తి, నవీన్, వరవరరావుల పనీ, సంచాలక బాధ్యత వహించిన శ్రీపతిపనీచాలా తేలికయిపోయింది. సెన్సారింగ్ అవసరం లేనిచోట సెన్సార్ బోర్డ్ అంత అలంకార ప్రాయంగా వారుండిపోయారు. తమకుకావల్సింది ఏదో, కూడనిదేదో ప్రజలే నిర్ణయించుకున్నట్లుగా శ్రీశ్రీయే ప్రశ్నలు చదువుకున్నాడు. జవాబులు చెప్పాడు. శ్రీశ్రీ లోని సమగ్రత్వానికి, వైవిధ్యానికీ యీ గోష్ఠి నిదర్శనం. ఇదంతా ఒకచోటరాసి మళ్ళీ శ్రీశ్రీ కి చూపాం. ఆయన ఓ. కే అన్న గోష్ఠిరూపమే యిప్పుడు మన ముందున్నది. ఈ గోష్ఠి ఏర్పాటు చేసినందుకేకాక తొలిసారిగా ప్రచురించుకునే అవకాశం సృజనకు యిచ్చినందుకు చలసాని ప్రసాదరావుకూ, ఇందులో పాల్గొన్న కవులందరికీ, ఇరవైమంది ఒకపెట్టూ తానొకపెట్టూ అన్నట్టు పొద్దుటి నుంచి సాయంత్రందాకా దాదాపు ఆరుగంటలు సాగిన గోష్ఠిలో యువకోత్సాహం ప్రదర్శించిన శ్రీశ్రీ కి ధన్యవాదాలు

— సృజన

౩

ప్ర. 1 : మీరు నిర్దేశించిన 'మరోప్రపంచం' స్వరూపం ఏమిటి ? వివరంగా చెప్పండి.

జ. నిర్దేశించలేదు. imagine చేశాను. అప్పటికింకా నాకు రష్యా విప్లవం కూడ తెలీదు. సాహిత్యకాలవల్లోంచి for instance గురజాడ గేయాలు–అవి సినిమాలు లేనిరోజుల్లో వచ్చాయి. ఫ్రెంచి సింబలిస్టులు, సిసిల్ డెలిస్–వాళ్ళు కొంచెం ముందుకు పోయి చూశారు. కవిత్వం ద్వారా నేను మరో ప్రపంచం చూశాను. అదే సామ్యవాదప్రపంచం అని అప్పటికి తెలియదు. ఒకవిధమైన సాంఘిక న్యాయం లభించాలని అన్యాయం, అధర్మం పోవాలని ఈనాడు మరికొంచెం ఎక్కువ రూపం తీసుకొని రష్యా, చైనా, క్యూబాదేశాల్లో కనిపిస్తున్నది నేను భావించిన మరో ప్రపంచం.

ప్ర. 2 : రేపు ఎలావుండాలో చాలామందిమి ఆలోచిస్తున్నాం. మార్పుకోసం ప్రయత్నిస్తున్నాము, మీ ప్లాన్స్ చెప్పండి.

జ. రేపు–నాకు కావల్సిందట్టే–కొత్తగా ఏం లేవు. ప్లాన్స్ వేయడం రాజకీయ వేత్తలపని. రచయిత సమస్యను present చేస్తేచాలు. సిన్సియర్‌గా present చేస్తేచాలు. పరిష్కారం గర్భితంగా వుండొచ్చు. ఏ కళాకారుడైనా చిత్తశుద్ధితో వాస్తవికతను చూపించగలిగితేచాలు. రచయిత మాథమెటికల్ ఈక్వేషన్‌లాగ చేయలేడు. వాస్తవికతకి దర్పణం పట్టాలి. రాజకీయ వేత్తలు సమస్యలకు పరిష్కార మార్గంచూపాలి.

ప్ర. 3 : నేటి మనిషిని, చుట్టూ ప్రపంచాన్ని analyse చేయండి.

జ. మానవుని కలలు నిజమవుతున్న కాలం. ఒకవైపు చంద్రుని కవతలికి ప్రయాణం చేయటానికి ప్రయత్నాలు కనిపిస్తున్నాయి. మరోవైపు మన దేశంకే పరిమితం కాకుండా మొత్తం ప్రపంచంలో దరిద్రం, ఆకలి. బాధ, చీకటిఆఫ్రికాలో, ఆసియాలో, లాటిన్ అమెరికాలో చుట్టుముట్టి వున్నాయి. సంపన్నదేశాలు ఈ వాస్తవికత మీదికి వెలుగు ప్రసరింప చేయాలి.

ప్ర. 4 : మీలోని 'నేను' గురించి (కవిత్వంలో) సాధ్యమయినంత వివరంగా చెప్పండి.

జ. చాలా వరకు నాదృక్పథం నించే కవిత్వం రాసాను. subjective poetry యే ఎక్కువ. objective గా రాసిన వెర్రివాడా కుర్రవాడా, భిక్షువర్షీయసి వంటివి తప్ప. Most of the poems subjective గా రాసినవి నేను సైతం వంటివి—

'ఐ' చిన్నతనపు ప్రగల్భం. అంతకంటె ఏం లేదు. దాన్ని చదువుకొని చిన్నతనం పడుతున్నానా అంటే లేదు.

ఉపప్రశ్న (వరవరరావు)

యజ్ఞోపవీతం దేనికి సింబల్ ?

పవిత్రతకి

భూతం ?

స్పిరిట్

కేదారగౌళ ?

మ్యూజికల్

ప్రతి పదార్థం తీసుకోకూడదు. ఆ total effect తీసుకోవాలి, ఒక విధమైన exultation.

ఆ రోజుల్లో ఒక కొత్త టెక్నిక్ కనిపెట్టామన్న ఉత్సాహంలో వచ్చిన series of poems. క్రియేటివ్ ఆర్టిస్ట్సు అందరికీ ఒక కొత్త ఉత్సాహం ఏర్పడుతుంది.

యురేకా అని బట్టవిప్పుకొని పరిగెట్టాడట. కొత్త బాణీలో రాసానన్న ఉత్సాహం అది. కుబుసం వదలడం వంటిది. 'నేను సైతం....' ఆ శిల్పంలోకి వస్తుంది. ఆరోజుల్లో నేషనల్ హెరాల్డ్ ఎడిటర్ ఎమ్. చలపతిరావు త్రివేణిలో మోడర్న్ ట్రెండ్ మీద రాసిన వ్యాసం నన్ను influence చేసింది. లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మేనిఫెస్టో — అప్పటి వర్ధమాన రచయితల సంఘం అబ్బూరి రామకృష్ణరావుగారు

చూపారు. అది చూసిన తర్వాత పొలాలనన్నీ హలాలదున్నీ గేయం రాసాను. ఆమేనిఫెస్టో అలాదించేసావే అని అబ్బూరి రామకృష్ణరావు గారన్నారు. ఉదయిని లాస్ట్ ఇష్యూలో కొంపెల్ల జనార్దనరావు దాని గురించి రాసాడు. ప్రగతిశీల సాహిత్య సంఘం అన్న పేరుతో హిందీలో వస్తున్న ఉద్యమ ప్రభావంతో అభ్యుదయ రచయితలుగా మారారు.

## శ్రీ ప తి

ప్ర. 5 : పుడమితల్లికి పురిటి నొప్పులు ఇంకా ఉన్నాయా ?

జ. పుడమి తల్లికి ఇంకా ఫామిలీ ప్లానింగ్ ప్రారంభంకాలేదు. ఎప్పుడూ నొప్పులు పడుతూనే వుంటుంది. కొత్తసృష్టి వస్తూనే ఉంటుంది. మనం యుగసంధిలో ఉన్నాం. చారిత్రాత్మకమైన దశలో ఇది జరుగు తుంది. స్పానిషిన్ యుద్ధంలో బ్రిటిష్‌వాళ్ళు పదేపదే చెప్పేవాళ్ళు యుగసంధిలో మనం ఉన్నామని, గొప్పగొప్ప మార్పులు రాబోతున్నా యని. It is in continuous flux. రష్యన్ విప్లవం తేదీ, ఫ్రెంచి విప్లవం తేదీ వంటివి పుట్టినరోజులు. చరిత్ర ప్రవాహంలాంటిది. సూర్యోదయం అవుతుంటే భూమి మీదున్న చీకటి తొలిగిపోయి చెట్లూ దృశ్యాలూ వెలుతురులోకి వస్తుంటాయే అలాగే మార్పులు జరుగు తుంటాయి.

ప్ర. 6 : తెలుగు సాహిత్యంలో విమర్శ ఎట్లావుంది ? మీ సజెషన్స్ ఏమిటి ?

జ. విమర్శ మూడు పూవులు ఆరు కాయలుగానే ఉంది. సాహిత్యం కొరకే ప్రత్యేకించబడిన పత్రిక లొస్తున్నాయి. ఈ సాహిత్య పత్రికలన్నీ ఏదో దృక్పథంతో విమర్శ సాగిస్తూనే ఉన్నాయి. ఇది ఆరోగ్యకరమైనదే. విమర్శగ్రథాలు వెలువడుతున్నాయి. విమర్శమీద విమర్శ వస్తున్నది. అయితే ఆ view point మనం ఒప్పుకుంటున్నామా కాదా అన్నది కాదు. యువకుల్లో సాహిత్య జిజ్ఞాసని కలిగిస్తున్నది. అది సంతోషించ దగ్గదే.

ప్ర. 7 : పార్లమెంటరీ డెమొక్రసీ సక్సెస్‌ఫుల్ కాదా ?

జ. అన్ని పార్లమెంట్‌లకీ తల్లి అనదగ్గది బ్రిటిష్ వెస్ట్‌మినిష్టర్. అమెరికన్ పార్లమెంటరీ డెమొక్రసీవేరు. ఫ్రెంచి పార్లమెంటరీ డెమొక్రసీవేరు. మన పార్లమెంటరీ డెమొక్రసీ సక్సెస్ అయిందని చెప్పటానికి వీల్లేదు. ఈ పార్టీలు, ఈ చీలికలు. పార్లమెంటరీ డెమొక్రసీ ఇబ్బందుల్లో పడిపోతున్నది. బ్రిటన్‌లో కన్సర్వేటివ్, లేబర్ రెండే పార్టీలున్నాయి. అమెరికాలో రిపబ్లికన్, డెమొక్రాటిక్ పార్టీలు రెండే ఉన్నాయి. మన దేశంలోకూడ రైట్‌రియాక్షనరీస్ అంతా ఒక పార్టీగా, left revolutionaries ఒక పార్టీగా పరిణామం రావచ్చు. ఆ పరిణామం వచ్చేలోగా సామ్యవాద విప్లవం వస్తే సంతోషిస్తాను. పార్లమెంటరీ డెమొక్రసీ fail అయినందుకు ఒక కన్నీటి బొట్టుకూడా వదలను.

ప్ర. : చరమరాత్రి కథల్లో శిల్పాని కిచ్చిన ప్రాధాన్యత వస్తువుకు ఇవ్వలేదు. అందుచేత అవి ఫెయిలయ్యాయి. శిల్పం శిల్పంగా ఏమీ సాధించలేదు. Comment.

జ. నిజమే చరమరాత్రి కథలు సింగిల్ పన్నా కవిత్వం. టెక్నిక్ ప్రాధాన్యత ఇచ్చిన రోజుల్లోనే రాసాను. I am essentially not a story writer. అందులో కూడా కవిత్వం ఉండొచ్చు. కథల్లోనూ నేరేషన్— expect చేసే వాళ్ళకి డిసెప్పాయింట్‌మెంట్. చరమరాత్రి కథ చాలా ambitious గా మొదలు చేసి ఆఖరాఖరున తొందరపడి ముగించేసాను. కాఫ్కా నవలలు చదివి ఈ ప్రయత్నం చేసాను. The trail అన్న నవలుంది. అందులో కే అన్న ఒక కుర్రవాడున్నాడు. ఆ కుర్రవాడిని ఎరెస్ట్ చేస్తారు. ఏమిటి తప్పు చేసాడో తెలియదు ఎప్పుడు విచారణ చేస్తారో తెలియదు. కోర్టులో విచారణ తర్వాత వాయిదా వేస్తారు. వెళ్ళి పొమ్మంటారు. ఈ నవల The trail నరకానికి ప్రతీక.

The Castle అని చెప్పి మరొక నవల రాసాడు. అది కూడా అసమగ్రమే.

కే అన్నవాడికి రాజుగారి దివాణంలో ఉద్యోగం దొరుకుతుంది. అబద్ధంతో కోటలో పాగా వేస్తాడు. కోట స్వర్గానికి సింబల్. కాఫ్కా

మరణ శాసనంలో ఇవి బయటికి రావటానికి వీల్లేదని రాసాడు. ఇవి తగలేయమన్నాడు. అందులోనే వేయాలన్న భావనఉంది. Max Brod ఇవన్నీ కాఫ్కా చచ్చిపోయాక అచ్చువేశాడు. వేళాకోళంగా ఉంటూనే చాలా సీరియస్‌గా ఉంటాయి. అమెరికాని భూలోకంగా కే అన్న కుర్రాడు ఒక అమ్మాయికి కడుపుచేసి అమెరికా పారిపోతాడు. అక్కడ Statue of liberty చూస్తాడు. మూడూ అసంపూర్తి నవలలు. మూడింట్లో కే అనే కుర్రాడు ఉన్నాడు. వీటిని మనస్సులో పెట్టుకొని రాసింది చరమరాత్రి,

నరకం, స్వర్గం, భూమిఅను మూడుకాలాల్లో ఆలాపించినకథ అది. అచ్చు తప్పువేశారు నేను దగ్గరలేక. అనంతరయాత్ర, గవేషణ, గ్రామ ఫోన్ రికార్డుల తిరుగుబాటువంటి రేడియో plays ఆ రోజుల్లోనే రాశాను. అవీ అభ్యుదయలో వచ్చాయి.

## దిగంబర కవులు

ప్ర. 9 : కవిగా మీరు ఏనాడో చనిపోయారని సాహిత్యాభిమానులు అనుకుంటున్నారు. నిజమే నంటారా ?

జ. చెప్పడం కష్టం. చెళ్ళపిళ్ళ జీవితాంతం రాసారు. కవిగా చనిపోవడమంటే మనమిచ్చే అర్థాన్నిబట్టి ఉంటుంది. మొన్న ('69 అక్టోబర్ 31) కవి సమ్మేళనంలో ఒకగేయం విని చాలామంది చప్పట్లు కొట్టారు. దాన్నిబట్టి కవిగా బతికున్నానని చెప్పలేను. స్విన్‌బర్న్ గురించి మీకు తెలుసు. అతని గొప్ప కవిత్వమంతా 25 సంవత్సరాల లోపుగానే వచ్చింది. తర్వాత స్విన్‌బర్న్ చచ్చిపోయినట్టే లెక్క. I am in a suspended state of animation and hybernation. కొన్ని ప్లాన్స్ మనసులో ఉన్నాయి.

ప్ర. 10 : మహాకవిగా సినీప్రపంచాని కమ్ముడు పోకుండా ప్రజలమధ్య జీవించి విప్లవ చైతన్యాన్ని కలిగించలేరా ?

జ. సినీ ప్రపంచాని కమ్ముడుపోవటం అన్నమాట నేనొప్పుకోను. ఎవరు ఏ ఉద్యోగానికి అమ్ముడు పోలేదు. పెట్టుబడిదారి వ్యవస్థలో ఉన్నదే అది.

అమ్ముడు పోవడం కొనుక్కోవడం. అమ్ముడు పోవడం అన్నది సినిమాలకే పరిమితం కాదు. సినీ ప్రపంచంలో కవిగాడు చేసేది ఏంలేదు. ఒక కథని దొంగిలించామంటే దొంగిలిస్తాం. కన్యాశుల్కంలో పాపం గిరీశం అమాయకంగా అంటాడు వకాల్తీలో ఇంతమోసం ఉందని నాకు తెలీదని. ఈ వృత్తి వదిలేయాలని సౌజన్యరావు కూడా అనుకుంటాడు. కాని సౌజన్యరావు తర్వాత ఆ పదవి వొదిలి ఉండడు. సినిమాని తిట్టి ప్రయోజనం లేదు. దాన్ని ఆయుధంగా వాడుకోవాలి. వాడుకోనివాళ్ళున్నారు. ఈనాడు సత్యజిత్‌రాయ్ సాధిస్తున్నాడన్న రియలిజమ్ రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత వచ్చింది. మొదటి ప్రపంచయుద్ధం తర్వాత సినిమా ఒక ఆర్ట్‌ఫార్మ్‌గా డెవలప్ అయింది. రష్యాలో సినిమాలో ఒక కల్లోలం వంటిది వచ్చింది. సినిమాను ఒకయుద్ధంగా వాళ్ళు గుర్తించారు. ఇతర కళలన్నిటి కంటే సినిమా విలక్షణమైనది. పుడొకిన్‌కి ఆచార్య పీఠం ఉంది. రచయితల్లో ట్రేడ్‌యూనియనిజమ్ ఉండాలి. ఇంకోవిషయం. ఒక్క కవిగా ప్రయోజనం ఉండదు. డైరక్టర్‌గానూ, ప్రొడ్యూసర్‌గా కూడా అయితే మంచిది. సదాశివరావు, సముద్రాల డైరెక్టర్లుగా ఫెయిలయ్యారు. నిర్మాతలు కాలేదు. రచయిత తెలుగు సినిమాలో terms dictate చేసే స్థితిలో లేడు. Star system is an evil. పెట్టుబడి దారీ విధానం తోక లాంటిది. ప్రొడ్యూసర్లు లోకోద్ధరణ కోసం ఏం చేయటం లేదు. లాభార్జనే వాళ్ళ ఉద్దేశం. పెద్ద డిస్ట్రిబ్యూటర్‌ని పట్టుకోవాలంటే పెద్ద స్టార్‌కావాలి. ఒక ఇటాలియన్ ఎవరో-idea తీసుకుంటే అది గుర్తిస్తారు. తెలుగులో కథలకి కథలే మారిపోతాయి. సౌజన్యరావు పంతులు చెప్పినట్లే ఈ ఊబిలోంచి బైట పడాలనే అనుకుంటున్నాను. కెరటాలు ఆగిం తర్వాత స్నానంచేస్తానన్నట్టుగాఉంది.

ప్ర. 11 : గురజాడ పాతకొత్తల మేలు కలయికను మీరు అంగీకరించి పాతతో రాజీపడి నవీన అభ్యుదయ తత్వాన్ని బలహీన పరిచారని దిగంబర కవులు ఆరోపిస్తున్నారు — మీరేమంటారు ?

జ. పాతకొత్తల మేలు కలయిక concept నాకిష్టంలేదు. I am always for new. పాతవన్నీ నాశనం చేయమనను. మ్యూజియమ్‌లో పెట్టమంటాను. మహాభారతం, మనుచరిత్ర ఎలారాయకూడదో తెలుసు

కోడానికి. పాతవి చదవాలి. ఆ పునాది వుండాలి. I am always for new. పాతతో రాజీలేదు. దిగంబర కవుల ఆరోపణ ఆధార రహితం. నేను అంగీకరించను. కొత్తరచనలు చేస్తున్నాను. మీరు assume చేసి ఆరోపిస్తున్నారు. నేను ప్రబంధాల్లోంచి వచ్చినవాడిని కనక ఆ అవశేషాలు వుండొచ్చు. కాని తిరుగుబాటు తత్వాన్ని నమ్మిన వాణ్ణి. సాంప్రదాయ ఉపమానాల వలన పాతదనం యముని మహిషపు– శనిదేవత రథ చక్రపుటిరుసుల్లో – హరోంహర – మాటల్లో సాంప్రదాయపు వ్యామోహం ఉన్నది. వీటి గురించి Criticism ఉన్నది.

ఆరుద్ర ఇమేజరీస్ మోడర్న్‌గా ఉంటాయి. పాత వాసనలు మిగిలిపోయాయి. దీనివలన శ్రీశ్రీ ఆధ్యాత్మిక కవి అని నన్ను claim చేయటానికి వీలున్నది. అయితే నేను – కొత్తలోనికి తలుపు తెరిచాను. దాంట్లోంచి చొచ్చుక రావాల్సిన వాళ్ళు మీరు. మీరా పని చేయాలి.

అభ్యుదయ కవిత్వం సాంప్రదాయ స్వభావంతో రాలేదు. దాంట్లో సాంప్రదాయకపు అవశేషాలు ఉండొచ్చు. దిగంబర కవులు తిరుగుబాటు చేస్తున్నారు. వాళ్ళు కనబడిన ప్రతిదాని మీద తిరుగబడుతున్నారు. వాళ్ళు అనార్కిస్టులనుకోవాలో మార్క్సిస్టులనుకోవాలో తెలీదు. ఎక్కువ అనార్కిస్టులుగానే కనిపిస్తున్నారు. ఆ లెక్కన చూస్తే షెల్లీ అనార్కిస్ట్. క్రొపోట్కిన్ శిష్యుణ్ణయిన నాలోకూడ కొంత అనార్కిజమ్ ఉంది. అందుకే వాళ్ళని అనువాదం చేస్తున్నాను. actually క్రొపోట్కిన్ – డొస్తవిస్కీలని వాళ్ళు ఒప్పుకోలేరు.

ప్ర. 12 : సాహిత్యంలో అశ్లీల మనబడే పదజాలాన్ని ఆయుధంగా ఉపయోగిస్తున్నామని దిగంబర కవులు చెబుతున్నారు. మీరు సమర్థిస్తారా?

జ. అశ్లీలం అంటే ఏమిటి? లేడీ చాటర్లీస్ లవర్ యూనివర్సిటీలలో చదువుతున్నారు. జేమ్స్ జాయిస్, ఖజరహో, సింహాచలం మొదలయిన దేవాలయాలమీద నగ్నదృశ్యాలు abscenity గా తీసుకోవడంలేదు.

ప్ర. 13 : జన సామాన్యాన్ని కవిత్వంతో మార్చవచ్చునంటారా?

జ. ఇది కొంచెం గడ్డయిన ప్రశ్నే. జనసామాన్యానికి ఇది ఎంత చేరువలో వుంటుంది అన్నదానిమీద ఆధారపడి వుంటుంది. మనకి ముప్పాతలు

కాదు, రెండుపూటలు తిండి దొరకటంలేదు. జనసామాన్యం కవిత్వాన్ని భోగద్రవ్యంగానే చూస్తున్నారు. Minimum అవసరాలు తీరాకనే కవిత్వం.

మయ్‌కొవస్కీ కవిత్వాన్ని ఇరవయ్యేళ్ళ కిందటికన్న ఇప్పుడు ప్రజలుఎక్కువ ఆస్వాదిస్తున్నారు. ప్రజలలో కవిత్వాభిరుచిని పోషించుకుంటూరావాలి.

ప్ర. 14 : కవిత్వాన్ని సమాజపరంచేసి కవిత్వపు విలువల్ని విమర్శిస్తే కవిత అనిపించుకుంటుందా ? లేక అది కేవలం ఏదో ప్రచారసాధనం అనిపించుకుంటుందా ?

జ. కవిత్వాన్ని సమాజపరం చేయట మన్నది-పెద్ద కాంట్రోవర్సీ. గవర్నమెంట్ కవిత-anti Govt. కవిత అని ఉన్నవి. అభ్యుదయం వస్తే propagonda అని అరుస్తారు. రచయిత స్వేచ్ఛని ఎందుకు సప్రెస్ చేస్తున్నారు రష్యాలో అంటారు. సామాన్యమైన కారణమేమిటంటే-పెట్టుబడిదారీ విధానానికి పునర్జీవనం పోసే ప్రమాదంఉంది. ఉదా-హాడ్జికిన్ తీసిన సినిమా. విప్లవం యొక్కమొదటి విజయం మొదటి పరాజయం. జార్ చక్రవర్తిశిల్పం పడిపోయి ముక్కలుముక్కలయి పోతుంది. కెరెనెస్కిప్రభుత్వం రాగా, ఆ ముక్కలన్నీ మళ్ళీ అతుక్కుని బొమ్మగా తయారవుతుంది. కన్సర్వేటివ్ పత్రికలన్నీ ప్రోపగండా పిక్చర్‌కింద తీసిపారేశారు. కళాత్మకంగా గొప్పదని మెచ్చుకుంటూనే.

ప్ర. 15 : ఈదేశంలో తిరుగుబాటును ప్రోత్సహించి క్రమంగా సాయుధ విప్లవాన్ని పరిపుష్టం చేయాలనే భావం దిగంబర కవుల్లో మీకు కనిపిస్తున్నదా ?

జ. దిగంబర కవులు నక్సలైట్లు అయ్యే అవకాశం ఉందనుకుంటారా లేదా-అనికదూ? దిగంబరకవులు సాంప్రదాయపు విలువ పరువు తీసేస్తున్నారు. వీళ్ళు సాయుధపోరాటాన్ని ప్రోత్సాహిస్తారా అన్నది నేను చెప్పలేను. మీదిగంబర కవిత్వం శ్రీకాకుళం వెళ్ళదు. అసలువిప్లవం శ్రీకాకుళంలో ఉంది.

ఒరిస్సాలో రియాక్షనరీ ప్రభుత్వంఉంది. కేరళలో రివల్యూషనరీ ప్రభుత్వం ఉంది. మధ్య ఆంధ్రప్రదేశ్.........

ఉపప్రశ్న (జ్వాలాముఖి)

ప్ర. కేరళలో ఉన్నది రివల్యూషనరీ ప్రభుత్వం అంటారా ?

జ. మాటవరసకి.

కేరళలోవున్న ప్రోగ్రెసివ్ గవర్నమెంట్ పరిస్థితిఏమిటంటే అందరు మంత్రులమేద నేరారోపణ వచ్చిన మంత్రివర్గం అదే.

దిగంబర కవుల్లో రాజకీయ చైతన్యంకంటే కవితాచైతన్యమే ఎక్కువ.

ప్ర. 16 : ఈ దేశంలో విప్లవంవస్తే రష్యా—చైనాలలో వచ్చిన విధంగా వసుందంటారా ?

జ. You are asking me to become an astrologer. ఈ దేశంలో విప్లవం వస్తుంది. బౌండ్ టు కమ్. ఇవ్వాళొస్తుందా రేపా అన్నదే సమస్య. షేగువేరా షేపో, మావో షేపో, కృశ్చివ్‌వలె transitional షేపో తీసుకోవచ్చు.

అటువంటిది రావటానికి మిగిలిన ప్రపంచంతో సంబంధం ఉంది. ఇండియా మిగిలిన ప్రపంచంతో విడివడిలేదు. ప్రపంచయుద్ధ కాలాల్లో వచ్చినవే రష్యా చైనా విప్లవాలు.

తొమ్మిది నెలలు నిండకముందు—కాన్పురాదు. చరిత్ర ధర్మం విప్లవం. There is always bound to be weapons. రివల్యూషన్‌లో రియాక్షనరీస్ మీాద ప్రొగ్రెసివ్ గెలుస్తారు. హింసలేకుండా, విప్లవం లేకుండా ప్రొగ్రెసివ్ శక్తులు గెలవ్వు. ఇదే డైలెక్టికల్. Objective conditions విప్లవానికి సరిగా లేవు. There are certain conditions. అవి సరిపోవు.

చీపురు పుల్లలతో స్వరాజ్యం రాలేదు. నూరు డిగ్రీల వేడి వచ్చినప్పుడు boiling ని ఎవరూ ఆపలేరు.

ప్ర. 17 : ప్రాచీన కవిత్వం మేలుకంటె ఎక్కువ హాని చేసిందని, యువకులను కొజ్జాలుగా మార్చిందని ఒక విమర్శ—దాన్ని మీరు ఒప్పుకుంటారా ?

జ. కవిత్వం యువకుల వీర్యశక్తిని ఎలా పెంపొందిస్తుందో నేను చెప్పలేను. ప్రాచీన కావ్యాల్లో redoubt చేయాల్సింది చాలా ఉంది.

పాఠ్య ప్రణాళికలో సమూలమైన మార్పురావాలి. ఈనాటి విద్యా విధానమే మారాలి.

నన్నయ్య, శ్రీనాథుడు - వాళ్ళ కవిత్వాన్ని ఆనాటి పరిస్థితుల్లో చూడాలి. కవిత్వం చదివేటప్పుడు కూడా చారిత్రాత్మక దృక్పథం ఉండాలి.

అంతేగాని ప్రాచీన కావ్యాల వలన ఈనాటి యువకులు కొజ్జాలుగా మారారంటే ఒప్పుకోను.

ప్ర. 18 : దిగంబర కవిత్వాన్ని కె. వి. రమణారెడ్డిగారు కసిత్వపు కవిత్వమని బూతులని అపోహపడుతున్నారు-నిజమేనంటారా ?

జ. దిగంబరకవిత్వం కసిత్వం అన్నది అపోహకాదు. దిగంబర కవిత్వంలో నాకుపొయట్రీ కనిపించింది. ఆయనకి కసి కనిపించింది. కసిత్వం మీలో ఉన్నది. అది అతన్నెక్కువగా ఆకర్షించింది. ఆయనకి ప్రొఫెసర్ దృక్పథం వుంది. అదే అతనిస్వంత ఇబ్బంది. కసిత్వం లేదని మీరూ అనలేరు. He has written in a particular viewpoint.

ప్ర. 19 : దిగంబర కవులు పెట్టీ బూర్జువాలాన్న ఆరుద్ర వ్యాఖ్యానంపై మీ అభిప్రాయం ?

జ. పెట్టీ బూర్జువా అన్న మాటని తిట్టుగా తీసుకోకూడదు. దిగంబర కవులు పెట్టీ బూర్జువాలు అన్నది నిజమే. మనం అరిస్టోక్రాట్స్‌మి కాదు. వర్కర్స్‌మి కాదు. మన వర్గమంతా పెట్టీ బూర్జువా వర్గం. దాన్ని తిట్టుగా తీసుకోకూడదు.

ప్ర 20 : 'సమాజం అంతగా పతనమయిందా' అని వాపోయిన రియాక్షనరీ క్రిటిక్ రాచమల్లులో ప్రెజుడిసెస్ ఉన్నాయంటున్నారు. మీరేమంటారు ?

జ. రారా రియాక్షనరీ క్రిటిక్ అనలేదు. సమాజం నిజంగానే పతనమయిపోయింది. ఆయన optimist కావడం వల్ల సమాజం ఇంకా కుళ్ళి

పోలేదనుకుంటున్నాడు. దిగంబర కవులు are right. రా. రా రియాక్ష నరికాదు. అయన మార్క్సిస్ట్ విమర్శకుడు. తూచగల తూకపు రాళ్ళు ఆయన దగ్గర ఉన్నాయి.

ప్ర. 21 : ఎలాంటి వ్యవస్థలోనైనా వ్యక్తికి మానసిక స్వేచ్ఛ— అభివ్యక్తి స్వేచ్ఛ వుండాలనే అంశాన్ని మీరు అంగీకరిస్తారా ?

జ. థియరిటికల్‌గా అంగీకరించొచ్చు. రచయితకి అంతశ్శుద్ధి ఉండాలి. కాని ప్రాక్టికల్‌గా పిచ్చివానిక్కత్తిచ్చి మానసిక స్వేచ్ఛ ఇస్తే ఏమవు తుంది ? నిజమైన మానసిక స్వేచ్ఛతో పిచ్చివాడు ఎవడు అన్న నిర్ణ యం రిజల్ట్‌ని బట్టే ఉంటుంది. నలుగురయిదుగురు అని మనం చెప్ప టానికి వీల్లేదు. సమిష్టి అభిప్రాయాన్ని మనం గౌరవించడం లేదు. మయికోవిస్కీ—ఎంత పెద్ద సాహిత్య సంస్థన్నా పొరపడటానికి అవకాశం ఉంది.

ప్ర. 22 : సమకాలీన వ్యవస్థలో రచయిత- కవి— కళాకారుడి పాత్ర ఏమిటి ?

జ. నేననుకోవడం రచయితేకాదు. ఏ కళాకారుడన్నా వాడి కాళ్ళమీద వాడే నిలబడగలగాలి. ఆర్థిక ఇబ్బందులు లేకుండా బ్రతకగలిగి ఉండాలి. నా గ్రంథాలమీద నేను బ్రతకటంలేదు. మొదట రచయిత ఆర్థిక దృక్ప థాన్ని పెంపొందించుకోవాలి. రచయితలు తమ రచనలమీద బ్రతికే పరిస్థితి రావాలి.

ప్ర. 23 : మిమ్మల్ని ఒక్కర్ని సహారా ఎడారిలో అన్ని సమకూర్చి వదిలేస్తే ఏ రచయితల పుస్తకాలు ఎన్నుకొని చదవాలనుకుంటారు ?

జ. సహారా ఎడారిలో వున్నా New Statesmen and Nation... లాంటి రెండు మూడు పత్రికలు వాళ్ళు రికమెండ్ చేసే పుస్తకాలు ఏ క్షణంలో ఏ కుర్రాడు మంచి పుస్తకం రాసి పడేస్తాడో. పిపీలకం అని రాచకొండ విశ్వనాథ శాస్త్రి బ్రహ్మాండమైన కథ రాశాడు. అచ్చయిన నాలుగయిదు నెలల తర్వాత తెలిసింది. ఆ ఎడారిలో కూడా Continuity కావాలి.

ప్ర. 24 : మార్క్సిజానికి మావో యిజం అతివాద బాలారిష్టం అని రష్యన్ కామ్రేడులు విమర్శిస్తున్నారు, మీరేమంటారు ?

రాజకీయాలు అట్టే ఆలోచించలేదు. ఇండొనేషియాలో కమ్యూనిస్ట్లను ఊతకోచ కోయటానికి మావో యిజమే కారణమని చెప్పలేను. మావో చెప్పినదంతా ఆమోద యోగ్యం కాకపోవచ్చు. అట్లాఅని లెనిన్ చెప్పిన బాలారిష్టాలన్నీ మావోకు వర్తించవు. ఘనాలో ఎన్క్రుమా, ఇండొనేషియాలో సుకర్నో పడిపోయారు. వీటన్నిటికి మావోయిజమే కారణమని చెప్పలేను. మొత్తం ప్రపంచంలో ఉన్న పరిస్థితుల్లో ఆ రోజుల్లో రియాక్షనరీస్ది పై చేయి.

I am not competent to discuss the same.

ప్ర. 25 : శ్రీకాకుళం తదితర ప్రాంతాలలో జరుగుతున్న సాయుధపోరాటం సరియైన మార్గంలో నడుస్తున్న దంటారా ?

జ. శ్రీ కాకుళం పోరాటం గురించి నా అభిప్రాయం ముఖ్యం కాదు. I am not the man to decide it. నేను చెప్పటం మంచిదికాదు. నేను పాలిటిక్స్ ద్వారా సాహిత్యంలోకి రాలేదు.

ప్ర. 26 : 'తుపాకి గొట్టంలోంచి రాజ్యాధికారం వస్తుంది' మావోసూక్తి. అది మనదేశంలోని పోరాటానికి వర్తిస్తుందా ?

జ. అధికారాన్ని పడగొట్టటానికి ఫోర్స్కావాలి. ఫోర్స్, కవుంటర్ ఫోర్స్ ఎప్పుడూ తప్పనిసరి.

27 : ఈనాడు దేశంలో కమ్యూనిస్ట్పార్టీ చీలి, ముక్కలై అవకాశవాదులతో నిండి విప్లవానికి ద్రోహం చేస్తున్నదని విమర్శ—మీరేమంటారు ?

జ. చీలిపోయిన మాట నిజమే.

కాని విప్లవానికి ద్రోహం చేస్తున్నారంటే నేను ఒప్పుకోను. వాళ్ళవాళ్ళ దృక్పథాల్లో దోహదం చేస్తున్నారు.

28 : దిగంబర కవిత్వానికి, వచనకవిత్వానికి తేడావుందని మీరనుకుంటారా ?

వచన కవిత్వమన్నది Contradiction in terms వచనం అయితే కవిత్వం కాదు. కవిత్వమయితే వచనంకాదు. It is not the form that

is importont. దిగంబర కవులకు Conventional ఛందస్సులేదు. వచనమేకాని poetry ఉన్నది, దిగంబరకవిత్వం ఫ్రీవెర్స్ ఫార్మ్‌లో ఉన్నది. work of art వుంటేనే form-content ఫలానావిధంగా ఉంటుందని చెప్పలేక పోయినా when it appears it can be recognised. Non coventional verse అందాం. వచనరూపంలో కవిత్వం. call it అభ్యుదయ కవిత్వం. మిగతా వచనకవులు రాసిందీ అదే.

ప్ర. 29 : వచన కవిత్వం ఒక ఉద్యమంగా మేము చేపట్టబట్టే ఈనాడు ఈ స్థితిలో వుండగలిగింది. అనే ఫ్రీవర్స్‌ఫ్రంట్ నాయకులను మీరు ఎలా రిసీవ్ చేసుకుంటారు ? ఎప్పటికైనా ఉత్త ప్రక్రియఉద్యమం కాగలుగుతుందా ?

జ. ఫ్రీవర్స్‌ఫ్రంట్ నాయకులు చెప్పేది కేవలం ప్రక్రియకాదు. కుందుర్తి story poems, నాటకీయత వంటివి కావాలని అంటున్నాడు. అది ఉత్త ప్రక్రియ కాదు. అట్లారాస్తున్నవారు ఉన్నారు. శీలావీర్రాజు మొదలయిన వాళ్ళు అట్లా రాస్తున్నారు. As poetry it is an experiment.

ప్ర. 30 : స్వభావరీత్యా, శిల్పరీత్యా దిగంబరకవిత్వం ఒక ఉద్యమమని, స్వతంత్ర్య అస్తిత్వంగల ఒక సాహిత్య యుగానికి నాంది పలుకుతూ సమూలమైన మార్పుకోరుతుందని కొందరి విశ్వాసం — మీ అభిప్రాయం.

జ. కొందరి అభిప్రాయాలతో ఏకీభవిస్తాను. సమూలమైన మార్పుకోరుతున్న కొత్త ఉద్యమంగా దిగంబర కవులను ఒప్పుకుంటాను.

ప్ర. 31 : కమ్యూనిస్ట్ వ్యవస్థలో రచయితకి కావలసినంత స్వేచ్ఛ వుండదని కుజునెత్సొవ్ ఉదంతం రష్యా పరిస్థితిని బయటపెట్టింది. మరి మీ వ్యాఖ్యానం ?

జ. ఇది పొలిటికల్ ప్రాబ్లమ్. కమ్యూనిస్ట్ దేశాల్లో రచయితలకు స్వేచ్ఛ ఉండదంటే నేను ఒప్పుకోను.

ప్ర. 32 : రచయిత తాను ఉన్నవ్యవస్థలో భాగంగానే మూడోవ్యక్తిగా జరిగే లోపాలను నిర్భయంగా ఎత్తిచూపెడుతూ తను జీవించే సమాజానికి న్యాయం చేయగలుగు తాడు—అది నిజమే నంటారా ?

జ. రచయిత తాను ఉండే వ్యవస్థలో భాగస్వామి. ఒక ఉదాహరణగా– ఎమిల్ జోలాకి అన్యాయం కనపడింది. I accuse అని ఆరంభించి పోరాడి జయించాడు. A writer can do or undo things. There are writers who really has passionate devotion to justice, equality and other human qualities.
అందరికీ ఆ నిర్భయం ఉండదు.

ప్ర. 33 : గాంధీని లెనిన్‌ను ఒకే దృష్టితో చూస్తూ ఇద్దర్నీ విప్లవవాదులుగా చిత్రిస్తున్నారు. అది సరియైన అవగాహన అని నమ్ముతారా ?

జ. గాంధీ అనే fact Mythగా మారుతున్నది. Gandhian mythology ఏర్పడుతున్నది. Where as Lenin అన్న myth విచ్చిపోయి fact బయటపడుతున్నది. what Lenin means to us is freedom. లెనిన్ అంటే ఫ్రీడమ్. గాంధీని అతని పరిస్థితుల్లో చూడాలి. షా చెప్పినట్టు మరీ అమాయకత్వం కూడా ప్రాణాంతకమే. గాంధీని విప్లవవాది అనే చెప్పాలి. బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా నిరాయుధుల్ని పోగుచేసుకొని పోరాడాడు. He fought with British unarmed. ఆ మేరకు గాంధీ విప్లవవాదే.

ప్ర. 34 : శ్రీకాకుళం గిరిజన పోరాటాన్ని సమర్థించే మీరు పచ్చి సామరస్య వాదియైన గాంధీని పొగుడుతూ వ్రాసిన కవితతో ప్రజల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నారని దిగంబర కవుల ఆరోపణ– ఒప్పుకుంటారా ?

జ. సామరస్యవాది గాంధీ అని కొట్టిపారేయటానికి వీల్లేదు. Gandhi is a Revolutionary in his own way. He has condemned evil. పులిని మేకను ఒకచోట బ్రతుకమన్నవాడు కాదు. కాబట్టి సామరస్యవాది అని రాసి నేనేమి blackmail చేయటంలేదు.

రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌కి ఎందరో రిప్రెజెంట్ చేశారు. గాంధీని అడిగితే భారతదేశంలోని దరిద్రనారాయణుని తను రిప్రెజెంట్ చేస్తున్నా నన్నాడు. He has united the Country– గాంధీ ప్రజల మనిషి.

ప్ర. 35 : ఈనాడు సాహిత్యానికి రాజకీయానికీ వున్న దూరమెంత ?

జ. ఇదివరకు మైళ్ళ లెక్కన ఉండేది.... సాహిత్యానికి రాజకీయానికి దూరం.... ఇప్పుడు సెంటిమీటర్లలో ఉన్నది. దూరం బాగా తగ్గి

పోయింది. రాజకీయ దృక్పథం సరిగా లేనివాడు సాహిత్యంలో రాణించ లేని స్థితి వచ్చింది. They are coming nearer.

ప్ర. 36 : మహా ప్రస్థానానికి యోగ్యతా పత్రం యిచ్చిన చలంగారి మీదా-రమణా చలంగారి మీదా మీ అభిప్రాయం ?

జ. (కొంచెంసేపు ఆలోచించి)

కీర్క్‌గార్డ్ ఏం రాసాడంటే-

ఐరిష్ డీన్ స్విఫ్ట్ ఒకప్పుడు మేయర్‌గా ఉన్నాడట. డబ్లిన్‌కు అనుకుంటాను. అతడు పిచ్చివాళ్ళమీద జాలికొద్దీ ఒక పిచ్చాసుపత్రి కట్టాడట. ముసలి వాడయిన తర్వాత తనే ప్రవేశించాడట.

ప్ర. 37 : శ్రీశ్రీ 'షష్ఠిపూర్తి' మీ అభిప్రాయం ?

జ నాకు అరవయ్యేళ్ళు వచ్చాయంటే నేను నమ్మలేకుండా ఉన్నాను. నేను 30, 40 లలో దిగంబర కవులతో పాటే పుట్టాను. నేను అట్లాగే ఫీలవు తాను. మొదటి యుద్ధమప్పుడు ఎనిమిదేళ్ళ కుర్రవాడిని. యుద్ధం ముగిసినప్పుడు నాకు బాగా గుర్తు. మిఠాయి పంచారు.

ఉత్సవం— ఎవరేంచేస్తే ఊఁ అనటమే. కొన్ని కొన్ని సాంప్రదాయాలు మనకున్నాయి. ఇదొక ఆనవాయితీ. వాళ్ళు షష్ఠిపూర్తి చేస్తామన్నారు. Celebrate it. నేనెప్పుడో రాసాను ఏభయ్యేళ్ళ తరవాత బతకటం అనవసరమని. నూరేళ్ళ ఆయుర్దాయం అవసరంలేదు. యేభయ్యేళ్ళు బతికితే చాలుననుకుంటే పదేళ్ళ గ్రాచ్యూటీ వచ్చింది.

ప్ర. 38 : దిగంబర కవులపైన మీకేమైనా ఆశలున్నాయా ?

జ. దిగంబర కవులపైన ఆశలు ఉండబట్టే translate చేస్తున్నాను.

ప్ర. 39 : చరమరాత్రిలోనూ, విదూషకుని ఆత్మహత్యలోనూ మీరు చేసిన ఆత్మహత్యలు మీలోఉన్న pessimism కి expressions గా వాడు కున్నారా ?

జ. కాఫ్కాగురించి ఇదివరకు చెప్పాను.

కొవ్వొత్తు లారిపోయాయి. మొదలయిన వాక్యాలు విదూషకుడి ఆత్మ హత్యలో....
ఆత్మహత్య అంటే మళ్ళీ బతకడం అని నా అర్థం. కొవ్వొత్తి మళ్ళీ వెలిగి మరణ శాసనమే కాలిపోయింది. కాఫ్కా అన్నట్లు ఔనంటేకాదు. కాదు అంటే ఔను. Suicide is no solution. సూసైడ్ చేసు కుంటే (దానికి కారణం) సమాజం ఆలోచించాలి. There are so many untoward actions. కీర్క్‌గార్డ్, కాఫ్కా, Sartre existentialism ప్రభావం ఆ రోజుల్లో నామీద ఉంది. (విదూషకుని ఆత్మ

ప్ర. 40 : నియోకాల్పనిక వాదులుగా, అవకాశవాదులుగా అభివృద్ధి నిరోధకులుగా బ్రతుకుతూ కవిత్వాన్ని cash చేసుకుంటున్న—ఆరుద్ర, దాశరధి, నారాయణరెడ్డి, సోమసుందర్ లాంటి వాళ్ళను నిజాయితీగల కవులుగా గుర్తిస్తారా ?

జ. ఆ అవకాశం వచ్చినందుకు వాళ్ళను envy చేస్తామా!. We regret the social conditions that made them. There are some people who are publishing sex magazines (to earn their lively hood) మంచిది కాదనుకుంటూనే చేస్తున్నారు. ఈ ఊబిలోంచి బయిట పడాలని ఆవేదన ఉంది. అట్టివాళ్ళ లిస్ట్‌లో నన్ను కలుపు కోవచ్చు.

## సి. యస్. రావు

ప్ర. 41 : ప్రస్తుత తెలుగు నాటకం స్థాయి ఏ స్థితిలో వుందని మీ భావం ?

జ. చాలా మంచిస్థాయిలో ఉందనవచ్చు. గయోపాఖ్యానం స్థాయిలోనూ ఉన్నాం. చాలా మంది experiments చేస్తున్నస్థితిలోనూ ఉన్నాం. కొంత రియాక్షనరీ ప్రతిఘటన ఉన్నదనుకోండి. కిరాయినటులు ఉన్నారు. మొత్తంమీద మంచి అభ్యుదయ స్థాయిలోనేఉంది. నాటకం రాయటానికి పదిహేనేళ్ళనుంచి ఆలోచిస్తున్నాను. బెండయ్యగారి గది. మొదటి రెండు అంకాలు స్పష్టంగా వున్నాయి. Next year రాయగల ననుకుంటాను.

ప్ర. 42 : కవితారంగంలో విప్లవాన్ని తీసుకొచ్చారు. అలాగే తెలుగు నాటక రంగంలో విప్లవం తీసుకరావడం గురించి మీరు ఆలోచిస్తున్నారా ?

జ. నాటకరంగంలో విప్లవం తేవాలనే ఆలోచిస్తున్నాను.

ఉ. ప్ర : ఏ రకంగా ఉంటుంది ?

జ. ఆ రకంగా ఉండదు. నారకంగా ఉంటుంది. దీనికి రెండు రకాలు ఉన్నాయి.

బెర్నార్డ్‌షాలాగ నాటకం రాయటం. ప్రిఫేస్‌లు పెద్దగా ఉంటాయి. సమస్యను దాంట్లో చర్చించడం. బెండయ్యగారి గది రెండో పద్ధతి.... ప్రయోగించడంలో కొత్తపద్ధతి. అది జన్మానికో శివరాత్రి. బెర్నార్డ్‌షా హాట్‌హట్‌గా ప్రాబ్లమ్స్ తీసుకొని రాసాడు. నాది రెండోపద్ధతి.

ప్ర. 43 : నేడు కూడా జోతిశ్శాస్త్రాన్ని మీరు శాస్త్రంగా నమ్ముతారా మూఢ నమ్మకంగా భావిస్తారా ?

జ. Astronomy is science.
Astrology is not a science. నమ్మకంలేదు.

## వ ర వ ర రా వు

ప్ర. 44 : మీకు మతం, దేవుడు, జ్యోతిషం వంటి విషయాల్లో విశ్వాసం ఉన్నదా ?

జ. జవాబుకోసం ఇంకా వెతుక్కుంటున్నాను. సద సత్సంశయ రూపంలోనే ఉన్నది. విశ్వాసం అవిశ్వాసంవేపే మొగ్గు చూపుతున్నది. లేదు అని సైంటిఫిక్‌గా ప్రూవ్ చేయలేక పోతున్నాను.

సద సత్సంశయం ముగింపు 'సామ్యవాద మానవుడే శాస్త్ర సకల విశ్వానికి'

దానికి మధ్య ఎన్నో ఎగుడు దిగుడులు, సందేహాలు వస్తాయి. కాని పై మాట ఫైనల్.

ప్ర. 46 : అవతారం గేయంలో సాంప్రదాయబద్ధమైన సంకేతాలు ఎందుకు ఉపయోగించారు ?

జ. అవతారం transitional stage లో poetic diction అలా వచ్చింది. ఉద్దేశపూర్వకంగానే వచ్చింది.

ప్ర. 47 : సి. విజయలక్ష్మి కావ్యాలు చదివారా ? మీ అభిప్రాయం.

జ. సి. విజయలక్ష్మిది చాలా మంచికవిత్వం.

ప్ర. 48 : కేరళలో నంబూద్రిపాద్ ప్రభుత్వ పతనం తర్వాత కూడా మీకు పార్లమెంటరీ డెమొక్రసీ పై విశ్వాసం ఉందా ?

జ. Parliamentary democraty does not deliver goods. Revolution వచ్చితీరాలి.

ప్ర. 49 : పొలాలనన్నీ హలాలదున్నీ....
సహస్రవృత్తులు సమస్త చిహ్నాలు....
కమ్మరికొలిమి, కుమ్మరిచక్రం....etc.

చరణాలు ఉత్తేజంపొంది సాహిత్య పాఠకుడు సామాన్యుడు కూడా మార్క్సును చదువుతున్నాడు. ఇట్లా ఒక రాజకీయ అర్థిక సామాజిక చైతన్యాన్ని కలిగించడమే మీ కవిత్వ ధ్యేయమా ?

జ. కొన్ని గేయాల్లో ఇదికూడా ఉంది. రా.రా. totalగా నా పంచపదుల్ని reject చేసాడు. పత్రికకి ఎడిటోరియల్ ఎంత అవసరమో కార్టూన్ అంత అవసరం.

## ఉపప్రశ్న (చే. రా)

ప్ర. వీణపత్రికలో మీరేంరాసేవారు ?

జ. వీణ సంపాదకీయం, కవులమీద కామెంట్స్ రాసింది నేను. దాని పొయిట్రీ సెక్షన్‌కు నేను ఎడిటర్‌ను.

ప్ర. 50 : సమాజసంబంధమైన భావాలైనా సాహిత్యం మూసలోకి వస్తే స్వీకరణ యోగ్యమవుతాయా ? అలాంటి సాహిత్య ప్రభావం ఏమిటి ?

జ. సాహిత్య పరులకు స్వీకరణ యోగ్యమవుతుంది. కొంతమందిని convert కూడా చేయగలుగుతుంది. ఒకప్పటి తీవ్ర అభిప్రాయం కూడా తర్వాత moderate అవుతుంది.

ప్ర. 51 : ఎంత తీవ్రమైన భావం చెప్పినా వస్తువును వదలి శైలిమీద దృష్టి కేంద్రీకరించడం వల్ల సాహిత్యం సామాజిక చైతన్యం తెచ్చే ఆయుధం కాలేక పోతున్నదా?

జ. నిజమే. ఈపద్ధతి ఒక్కసారే తొలిగిపోక పోవచ్చు. సాహిత్యం సామాజిక చైతన్యానికి ఆయుధం కావల్సిందే.

ప్ర. 52 : కన్యాశుల్కంలో వున్నదంతా శబ్దాశ్రయ హాస్యమే. ఇంగ్లీషువస్తేతప్ప హర్షించలేమన్న విమర్శతో మీరు ఏకీభవిస్తారా ?

జ. శుద్ధతప్పు. ఎంచేతంటే ఒక్కగిరీశంలో తప్ప ఇతర పాత్రల్లో ఇంగ్లీషు వస్తేతప్ప హ్యూమర్ enjoy చేయలేక పోవడం లేదు. రామప్పంతులు. హ్యూమరు, అగ్నిహోత్రావధానుల, లుబ్ధావధానుల హ్యూమర్‌లో ఇంగ్లీషు లేదు కదా.

శబ్దాశ్రయ హాస్యమన్నదాన్ని అపహాస్యం చేయాలి. అట్లా అన్నవాళ్ళ పట్ల జాలిచూపాలి. శబ్దంలేని హాస్యం ఎక్కడ్నించి వస్తుంది. మాట లేకుండా కవిత్వం ఎట్లావస్తుంది? ఈ రోజు ఆ మాత్రం ఇంగ్లీషు ప్రతి వాడికీ వచ్చేస్తున్నది. ఇంగ్లీషు రావడం దేనికీ అర్హత కానక్కర్లేదు.

ప. 53 : కొడవగంటి, రావిశాస్త్రి కమిటెడ్ మార్క్సిస్ట్‌గా వాళ్ళ రచనల్లో కన్పిస్తారు. వారికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతు లిచ్చింది. సాహిత్య అకాడమీకి మార్క్సిస్ట్ దృక్పథంపట్ల సానుభూతి ఉన్నట్లేనా ?

జ. ఇదికూడ ప్రచ్ఛన్నమైన రాజకీయ ప్రశ్న. మీరు అకాడమీని అడగ వల్సిందే. నోబుల్ బహుమతిని షా, సార్త్రె రిజెక్ట్ చేసారు. నేను 'సాహిత్యాచార్య' అనే బిరుదును స్వీకరించాను. గిరిగీసుకొని బ్రతకాలి సిన అవసరంలేదు. అవి మనకు కావలసిన రూపంలో లేవనే అసంతృప్తి యిలా వ్యక్తం చేయొచ్చును. ఇతర వర్గందగ్గర డబ్బుతీసుకొని

వేరే వర్గానికి వోటు వేయొచ్చుకదా. ఎన్నో ఖర్చులుంటాయి..........తీసుకో వల్సిన అవసరం వస్తుంది.

ప్ర. 54 : మీరు 'సామ్యవాద భారతం' వొకటి రాయబోతున్నట్లు వరంగల్‌లో చెప్పారు. ఎంతవరకు వచ్చింది ?

జ. సాహిత్యము-సామ్యవాదము. దాన్ని సా....సా....అన్నాను. అది నేను రాయదల్చుకున్న లేక రాయలేకపోతున్న విమర్శగ్రంథం.

ప్ర. 55 : Regis Debrey రాసిన Revolution in the Revolution చదివారా ?

జ. చదవలేదు. చదవాలనుంది.

పొలిటికల్ ఎడ్యుకేషన్ సంపాదించాలి. ఇటువంటివి కొన్ని చదివితేనే గాని ఈ తుక్కు కరిగిపోదు.

ప్ర. 56 : మీరు శ్రీకాకుళ గిరిజన సాయుధ పోరాటాన్ని సమర్థిస్తున్నారా ?

జ. సమర్థిస్తాను. My sympothy is always with them.
నేను extremist of extreme.

ప్ర. 57 : మీరు గిరిజన పోరాటంలో చేరిపోతారని జ్వాలపత్రికలో రాసింది అబద్ధమా ?

జ. అబద్ధం రాశారని చెప్పను. I want to go there and observe them. I am not a politician.

ప్ర. 58 : మీకు యీదేశంలోని అన్ని కమూనిస్టు పార్టీలపట్ల సానుభూతి వున్నది. ఇది సెంటిమెంటల్‌కాదా ?

జ. Sentiment - blind unthinking sentiment deep గా థింక్ చేస్తే కొందరిని హర్ట్ చేయక తప్పదు.

## రాంభట్ల కృష్ణమూర్తి

ప్ర. 59 : తెలుగు కవితలో ఈనాడు కనిపిస్తున్న ఇజాలేమిటి ? వాటి లక్షణాలను వివరించి, తారతమ్యాలను నిరూపించి ఆయా ఇజాలకు తెలుగు కవితలోంచి లక్ష్యాలను చూపిస్తారా ?

తెలుగు కవితలో నవయుగం అవతరించిన నాటినించీ నేటివరకు పుట్టిన ఇజాలలో మరుగుపడినవి ఏవైనా వున్నాయా ? వుంటే అవేమిటి ? తెలుగు కవిత భవిష్యత్తు ఎలా వుంటుంది ?

జ. సావా రాస్తే ఒకవేళ.... ఈ విషయం వివరంగా చర్చించటానికి వీలుంటుంది. చాలా ఇజాలు కనిపిస్తున్నాయి కదా. బాగా filter చేస్తే Rightism, Leftism, Reactionary, Revolutionary.

వివరించినపుడు లక్ష్యాలు కావాల్సినన్ని దొరుకుతాయి. విశ్వనాథ నవలల్లో Right extremes ఉంటాయి.

(అమెరికా వాళ్ళు వియత్నాంలో కూరుక పోయినట్లుగా ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్య రచనలో కూరుక పోయాడు.)

మరుగువడినవన్నీ మరిచిపోవలసిన ఇజాలే. పెనువర్తి వెంకటరత్నం కవిత్వం ఒకప్పుడు నన్ను inspire చేసింది. కాటూరి వెంకట నరసింహారావు చాలా మంచి పోయిట్రీ రాసాడు. కాటూరిలో Romanticism ఉంది. His poetry deserves to be preserved.

మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి– ఇవన్నీ బయిటికి తీసుకురావాలి. భవిష్యత్తులో– More and More మాండలికాలు వస్తాయి. తెలుగు సాహిత్యం యొక్క భవిష్యత్తు మిగిలిన ప్రపంచ సాహిత్య ఉద్యమాలతో ముడి పెట్టుకొని ఉంటుంది. యాంగ్రీ యెంగ్‌మెన్ ఇన్‌ఫ్లుయన్స్‌తో దిగంబర కవులు వచ్చినట్టు.

Healthy influences అవసరమే.

Inter language translations ఎక్కువవుతాయి. కాని మాండలికాల ఉపయోగం వల్ల ట్రాన్స్‌లేషన్ కష్టమవుతుంది.

'దయచేసి ఇక దయచేయండి'

'దయచేసి ఉన్నాను. దయచేయను'

లాంటి (నుడికారాన్ని) వాటిని అనువాదం చేయడం పడదు.

## చేకూరి రామారావు

ప్ర. 60 : ఇతరేతర అనేమాట ఇతర అనే అర్ధంలో వాడారా ? పరస్పర అనే అర్థంలో వాడారా ?

జ. ఇతరేతర అంటే- వేరే వేరే

పరస్పర అన్నది కాదు.

ప్ర. 61 : మీరు పబ్లిష్ చేసే మీ పద్యాల translations ఇంగ్లీషు వాళ్ళకి చూపించారా ?

Sadly the moon light
Saddles the night
Mystic fantastic
Gives me a fright.

అనేది అమెరికాలో చదివితే ఎప్రిషియేట్ చేయలేకపోయారు. ఇంగ్లీషు మాటలు ఇంగ్లీషువాళ్ళకి ఎట్లాంటి association ఇస్తయ్యో చూడొద్దా ?

జ. ఒకసారి మద్రాస్ VSIS లో కవితా ఓ కవితా (అనువాదం) చదివాను.

మెచ్చుకొని చాలా గబగబా చదువుతానని విమర్శించారు.

ఇంగ్లీషు వాడుక భాషకి మనం దూరంగానే ఉంటాం.

ప. 62 : వారం వారం, వీణ మొదటి సంచికనుంచి సంవేదనలో కుటుంబరావు వ్యాసం వరకు చూస్తున్నాను. 'వ్రాస్తాను' అని రాస్తారు గాని 'రాస్తాను' అని రాయరేం ? అంటే మాట్లాడే రూపం ఒకటుండగా ప్రాచీన రూపం ఎందుకు వాడతారు ?

జ. రాస్తాను అని ఎందుకు రాయను? చాలా దగ్గర్లో రాస్తాను. అని కూడా ఉంది.

ప్ర. 63: శ్రీశ్రీ కవిత్వాన్ని మార్క్సిజంతో నిమిత్తం లేకుండా విమర్శిస్తే శ్రీశ్రీ కవిత్వంలో గొప్పదనం కనిపిస్తుందా? అంటే సాంప్రదాయక పద్ధతిలో శ్రీశ్రీని విమర్శించవచ్చా?

జ. అలాగ విమర్శించేవాళ్ళు కూడా ఉన్నారుగా. my approving or disapproving అన్నది అవసరంలేదు.

ప్ర. 64: ఒక టెక్నికల్ కొశ్చన్: ముత్యాలసరం మీద మీరు రాసిన వ్యాసంలో చెడగొట్టిన వాళ్ళ ముత్యాల సరాలే బాగున్నాయన్నారు. ముత్యాలసరంలో 'లగం'గాని జగణంగాని వేస్తే నడక ఎదురు తిరగదా?

జ. కందంలో నాల్గింట జగణం – ఎదురు తిరగడం కూడా సొగసే.

ఆ వొరలకు కూతుళ్ళిద్దరు.

మోదుగులు పూసాయి – అని ఉండొచ్చును. టెక్నికల్ ఇన్నొవేషన్. చమక్. I don't think it is a technical defect.

ప్ర. 65: దిగంబరకవుల్లో మొదటి రెండు సంపుటాల్లో చాలా పద్యాల్లో syntax కనబడదు. వాటిల్లోంచి మీరు తీసుకున్నవి ట్రాన్స్‌లేషన్‌కి లొంగినయా?

జ. సింటాక్స్ లేకపోయినా ఫరవాలేదు. లొంగాయి. కవితా ఓ కవితాలో ఒక చోట సింటాక్స్ తప్పింది. దిగంబర నృత్యంలో సింటాక్స్‌లేదు. ఐడియా ట్రాన్స్‌లేషన్‌లో లొంగుతుంది. కొంత లిబర్టీ తీసుకున్నాను.

## అబ్బూరి గోపాలకృష్ణ

ప్ర. 66: సాహిత్యం ద్వారా సాయుధ విప్లవం గురించిన భావ ప్రచారం జరగడం జరుగుతుంది. సాయుధ విప్లవంలో హింస అనివార్యం. అయినప్పుడు బౌద్ధికమైన (intellectual) శారీరకమైన (physical)

క్రమ శిక్షణలేని ప్రజలు సాయుధులై తిరుగుబాటు జరిపినపుడు మంచి కంటె చెరుపే కలుగుతుంది. సైన్యంలో అనుసరించే హింసాత్మక చర్యలకు ఒక ప్రయోజనం ఉన్నది. మంచైనా చెడు అయినా అల్లరి మూకగా ప్రవర్తించే ప్రజలకు హింసాత్మక ధోరణులు బోధించడం ప్రమాదకరం కాదా ?

జ. Revolution లో అల్లరిమూకలు ఎక్కడుంటారు ? We cannot do without 'Himsa'. విప్లవం అహింసతోరాదు. అల్లరి చిల్లరిగారాదు. విప్లవ ప్రతీఘాతకులకు కూడా చాలా బలం ఉంది. కిరాయి మూకలు, ప్రెస్ ఇట్లాంటివి ఒకటేమిటి చాలా ఉన్నాయి.

So what I said is మంచి leadership provide చేసినప్పుడు హింస సార్థకమవుతుంది.

ప్ర. 67 : నేటి పరిస్థితుల దృష్ట్యా క్రమశిక్షణ ఒక ముఖ్యావసరం. క్రమ శిక్షణ లేకుండా ఏ విప్లవమూ విజయవంతమైన ఉదాహరణ చరిత్రలోనే లేదు కదా ?

ఈ విషయంలో మీరేమంటారు ?

జ. It is not the Headmasters' or principals' discipline. That is not wanted.

ప్రజా నాయకులు అమలు చేయగలిగిన క్రమశిక్షణ కావాలి.

ప్ర. 69 : ప్రజలలో క్రమశిక్షణా, ఉత్తమ లక్ష్యశుద్ధీ ఉన్నప్పుడు హింస అంత అవసరమైన ఆయుధంగా ఉండవలసిన అవసరం లేదుకదా ?

జ. నేను ఒప్పుకోను. It is the nature of the history itself. ఒకరు తయారు చేసినదికాదు. విప్లవాలు చరిత్ర పరిణామ క్రమంలో వస్తాయి. ఇంతవరకు అట్లాగే వచ్చాయి. ఇక మీదట కూడా అట్లాగేవస్తాయి.

హింస అనవసరంకాదు. అవసరమే.

విప్లవం హింసాత్మకంగానే వస్తుంది.

## రంగనాథం

ప్ర. 69 : రచయితలకు ప్రత్యక్ష రాజకీయాలతో సంబంధం అవసరం లేదంటారా? .... లేదనటం ఒక విధంగా రచయిత తన బాధ్యత నుండి తప్పించు కోవటానికి ప్రయత్నించటమే అనుకుంటాను .... ప్రస్తుతం రాజకీయోద్యమాలలో పాల్గొనదలిస్తే మీరు ఏ మార్గాన్ని ఎన్నుకుంటారు ? (స్పష్టమైన సమాధానం కావాలి)

జ. తప్పకుండా. రచయితలకు రాజకీయాలతో సంబంధం ఉండాలి. పెట్టుకోకూడదనడం escapism. ఇప్పుడిప్పుడే రచయితలకు రాజకీయచైతన్యం కలుగుతున్నది. నవలలకి సాంఘిక ప్రయోజనం ఉందని రాస్తున్నది తక్కువ. డిటెక్టివ్‌లు సెక్స్‌నవలలు చాలా వస్తున్నాయి. రచయితకు రాజకీయచైతన్యం ఉండాలి. రాజకీయాల్లో పాల్గొనాలి. I may... ఇంకా ఎలక్షన్లు దాటే పరిస్థితికి .... ఇంకా నేను లేను. ఎన్నికల్లో నుంచుంటాను .... always with the support of the left ... all kinds of left.

రాజకీయాల్లో నాది వావిలాల గోపాలకృష్ణయ్య పార్టీ.

ప్ర. 70 : 'నేనిక రాయనవసరంలేదు.' అన్నంతగా యోగ్యతా పత్రం ఇచ్చిన రచయితలు అవకాశవాదులయ్యారు. వచన కవితలో భావ కవితాయుగావశేషాలైన కొంత మంది కవుల్ని మీరు ఆకాశాని కెత్తారు.... ఇలా నానా గోత్రీకులకు యోగ్యతా పత్రాలివ్వటంవల్ల మీ దృక్పథస్థైర్యం విషయంలో అభిమానులలో కన్ఫ్యూషన్ కలుగుతోంది. దీనికి మీ సమాధానం ఏమిటి ?

జ. I really appreciate their work. వాళ్ళు జీవిత రంగంలో అవకాశవాదులుగా మారిపోయారు. ఇప్పుడు వాళ్ళను డౌన్‌రైట్‌గా ఖండించాలా ? వాళ్ళు (తిలక్, ఆరుద్ర, సోమసుందర్, దాశరథి) anti progressive అనుకోకూడదు. మల్లాది, బుచ్చిబాబు anti revolutionary అనుకోను.

నేనింకా రాయనక్కరలేదన్నది ఆరుద్ర గురించి గజ్జెల మల్లారెడ్డికి రాసిన ఉత్తరం.

ప్ర. 71 : బెంగాల్‌లో రచయితలు కళాకారులు ఆయా సందర్భాలలో ఊరేగింపుల ద్వారా, పత్రికాదుల ద్వారా తమ అభిప్రాయాలను నిర్భయంగా వ్యక్తం చేస్తుండటం చూస్తున్నాం. కాని తెలుగుదేశం ఇంత అధ్వాన్నంగా నిరంకుశంగా ప్రజావ్యతిరేక విధానాలతో పాలింపబడుతున్నా రచయితలు నోరు విప్పిన పాపాన పోవటంలేదు. దానికి తెలుగు రచయితలలో చైతన్యం లేక పోవడమే కారణమా ?

ఒక ముఖ్యకారణ మేమంటే తెలుగువాళ్ళకి ఒక నగరంలేదు. బెంగాల్‌కి కలకత్తా ఉంది. So they can experiment. బెంగాల్ సినిమా ఒక్క కలకత్తాలో ఆడినా సక్సెస్ అయిపోతుంది. చక్కగా ఏభై వేలతో పిక్చర్ తీయొచ్చు. అయినా పిక్చర్ అక్కడ ఫెయిల్‌కాదు. నగర జీవితం వాళ్ళకుంది.

మనకు పల్లెటూరి మనస్తత్వం ఉంది. విజయవాడ, విశాఖపట్నం అవి గ్లోరిఫైడ్ విలేజెస్. హైదరాబాద్ మనకు ఉన్నా ఫ్యూడల్‌తత్వం యింకా పోలేదు. అందువల్ల రచయితల్లో ఒక సంఘటిత శక్తి రాలేదు. గిరీశం అంటాడు ఇదే బెంగాల్ కుర్రాడైతే ఏం చేసేవాడో తెలుసా ? అని writers cooperative ఏర్పడాలి.

## వేనరెడ్డి

ప్ర. 72 : గాంధీ రాజకీయాల్లో Religion, philosophy ethics etc. ప్రవేశ పెట్టినట్టే మీరూ కవిత్వంలో వట్టి కథా కమామిషా మాత్రమే కాక రాజకీయ చైతన్యం కలిగించే రాజకీయ తత్వాన్ని తెలుగులో మీరే మొదట ప్రవేశపెట్టినా రనుకుంటాను ?

జ. ఇది గురజాడ ప్రవేశపెట్టారు. నేను ఫాలో అయ్యాను. మీ పేరేమిటి అన్నకథలో చాలా Subtle politics ఉన్నాయి. విలేజ్ పాలిటిక్స్. కన్యాశుల్కం నాటకంలో కూడా పాలిటిక్స్ కనబడతాయి. రాజకీయాలని మనం తప్పించుకోలేం. గురజాడకి పొలిటికల్ కాన్‌షస్‌నెస్ ఎక్కువ. దేశమును ప్రేమించుమన్నా మొదలయిన గేయాల్లో అది మనకు స్పష్టం.

ప్ర. 73 : మిమ్మల్ని ఇన్‌స్పైర్ చేసిన కవులు తెలుగులో కాని ఇతరభాషల్లో కాని ఎవరు ?

జ. Earliest influences అయిన కృష్ణశాస్త్రి, విశ్వనాథ నుంచి బయట పడాలని చాలా struggle చేసాను. ఆ తర్వాత Shelly, Swinburnలు ప్రభావితం చేసారు.

ఇండియన్ లాంగ్వేజెస్‌లో కవులెవరూ నన్ను ఇన్‌ఫ్లుయెన్స్ చేసారను కోను.

నజురుల్ ఇస్లాంకంటె ఎక్కువ హరీంద్రనాథ్ ఇన్‌ఫ్లుయన్స్‌చేసాడు.

ప్ర. 74 : వచనకవితా ఉద్యమము అభ్యుదయ కవితకు తరువాత పరిణామం అంటారు. వచనకవిత పరిధి అభ్యుదయ కవితాపరిధికంటె విస్తృతమైన దను కుంటాను. మీరేమంటారు ?

జ. నేను ఇదివరకొకటి చెప్పాను. కవిత్వముయొక్క ఫారమ్ డెవలప్‌మెంట్-మారుతూ వచ్చింది. పూర్వం రథం ఉపయోగించారు. నాలుగుచక్రాలు ఉండేవి. గుర్రాలు ఉండేవి. తర్వాత గుర్రబ్బండి. అప్పుడు బళ్లకు అను లంగా రోడ్లు ఏర్పడ్డాయి. ఇప్పుడు మోటారు ఉంది. దీనికీ నాలుగు చక్రాలే. కాని దీనివేగం హెచ్చు. దీనికి ఉండాల్సిన రోడ్లువేరు. మన దేశంలో కవిత్వం మోటారుదశలో ఉంది.

అమెరికాలో, రష్యాలో కవిత్వం రాకెట్‌యుగంలో ఉంది.

వచన కవిత్వంలో reactionaries ఉండొచ్చు. మనము మనకు నచ్చి నవి తీసుకోవాలి.

ప్ర. 75 : వచన కవితా ఉద్యమంలో కుందుర్తికి ఉన్న ప్రత్యేక స్థానంగూర్చి మీ అభిప్రాయం ఏమిటి? ఆయనకు దాశరథి, సినారెలవలెకాక ఒక విశిష్ట స్థానముందన్న భావంతో మీరు ఏకీభవిస్తారా ?

జ. కుందుర్తికి దాశరథి, సినారెలకంటె better place ఇస్తాను. వాళ్ళిద్దరూ నాకు ప్రాచీన కవుల్లానే కన్పిస్తారు. కుందుర్తి వచనగీతాలు వాటితో ఫ్రీవర్స్ ఫ్రంట్ లీడర్స్‌లో స్థిరపడ్డాడు. He has contributed something వచన కవితా ఉద్యమంతో. దాశరథి, సినారె they are more or less classical poets.

ప్ర. 76 : వచన కవితయొక్క next phase ఏమిటి. మళ్ళీ మాత్రా ఛందస్సు లోకి వెడుతుందా ? వచనమో మరే రూపమో ఆ రూపాన్ని గూర్చి మీరే మైనా చెప్పగలరా ?

జ వచన కవిత ఉంటుంది. folklore (జానపదచిత్రాలు) metresలో ఎక్కువ కృషిచేయడం జరుగుతుంది. మాండలికపు నుడికారం వస్తుంది. Contentకి సంబంధించినంత వరకు సామాజక జీవితం ఇంకా విస్పష్టంగా ప్రతిబింబిస్తుంది.

ప్ర. 77 : మీరు ఒక పత్రికకిచ్చిన ఇంటర్వ్యూలో ప్రజల దగ్గరగా వచ్చి ప్రత్యక్ష పోరాటంలో పాల్గొంటామన్నారు. మీరనుకుంటున్న పోరాట స్వరూపమేమిటి ? మీరిప్పుడు అంతకన్న ఎక్కువగానే ప్రజల్ని ఉత్తేజితుల్ని చేస్తున్నారనుకుంటాను. రచయిత తాను చెప్పేది ఆచరించి చూపించాలనేది మాత్రమే మీ అభిప్రాయమా ? అలాంటివారు చలం-కాళోజీల వలె యింకెందరున్నారు ?

జ. ప్రత్యక్ష పోరాటం విల్లంబులు ధరించి కాదు. నా ఆయుధమైన కలం ఎప్పుడు కూడా అభ్యుదయ శక్తులకు అంకితమయిందే. I am a fighter with pen. చలం విచిత్రమైన reactionary. చలం, కాళోజీలతో నన్ను పోల్చటం సరికాదు. చలం, కాళోజీలది ఇద్దరిదీ కూడా రియాక్షనరిజమ్. I am not at all a reactionary. I am a marxist.

ప్ర. 78 : మన పూర్వ సాహిత్యంలో స్త్రీని శృంగార వస్తువుగానే చూశారు. మీరు స్త్రీకి సమాజంలో ఎలాంటి స్థానం ఉండాలంటారు. మీ రచనల్లో స్త్రీని గూర్చిన ప్రసక్తి లేదెందుచేత ?

జ. పూర్వ సాహిత్యం స్త్రీని కేవలం శృంగార వస్తువు చేయలేదు. ఎక్కువగా భోగ వస్తువుగా చూశారు. They must have complete equality-with men. ఏమన్నా నావెల్స్ రాస్తే అట్లాంటి charactersను సృష్టిస్తాను. ఇంతవరకు స్త్రీ సమస్య ప్రత్యేక సమస్యగా భావించలేదు.

ప్ర. 79 : కేవలం ఖండ కావ్యాలకన్న- శ్రోత మనస్సుపై- కథా కావ్యం ఎక్కువ ముద్ర వేయగలుగుతుందనుకుంటాను. మీ భిక్షు వర్షీయసి, బాటసారి ఖండ కావ్యాలలో కథా కావ్య లక్షణం ఉందనుకుంటాను?

జ. కుందుర్తి. ఫుల్‌లెంత్ నావెల్‌లాంటి కావ్యం రావాలంటాడు అదొక దక్పథం. Poetic short stories ఒక ఫారమ్ మాత్రమే. కొంచెం కథంటూ వుంటే శ్రోతలకు డైరెక్టుగా పట్టుందని కావచ్చు.

ప్ర. 80 : సినిమా కవిత్వం వ్రాసేటప్పుడు మీరెట్లా feel అవుతారు ?

జ. ఈ పాట ఎంత వేగిరం పూర్తి అయిపోతుందా. వాళ్ళిచ్చే డబ్బులు ఎప్పుడు చేతుల్లో పడుతాయా— అనుకుంటాను.

ప్ర. 81 : నద సత్సంశయంలో మీరు మానవ శక్తిని బలహీనపరిచే దేవుణ్ణి తిరస్కరించారు. అంతే కాని మానవ శక్తికి మరింత చైతన్యం కలిగించే దేవుణ్ణి కాదు. అలాగే సామాజిక సామూహిక సద్వర్తనమే పరమార్థమన్నారు. అలాంటి పరమార్థంలో ఉంటే ఆస్తికత్వంతో మీకు వైరుధ్యం లేదనుకుంటాను ?

జ. ఆస్తికత్వంలో అలాంటి పరమార్థం సాధ్యమా ? అట్లాంటి ఆస్తికత్వం ఉంటుందా అన్నది సందేహమే. నాకెక్కడా కనిపించలేదు. నీ శక్తి పనికిరాదు అన్న unconditional surrendering ఆస్తికత్వం. సామాజిక సామూహిక సద్వర్తనగల ఆస్తికత్వం లేదు.

ప్ర. 82 : మహా ప్రస్థానానికి యోగ్యతా పత్రం ఇచ్చిన చలం ఇప్పుడు రమణాశ్రమంలో తన పూర్వ భావాలకు వైరుధ్యం లేకుండానే ఆధ్యాత్మిక చింతనలో గడుపుతున్నారు. చలం నిజాయితీని ఎవరూ శంకించరనుకుంటాను. కాబట్టి సామాజిక ప్రగతికి, ఆధ్యాత్మిక చింతనకూ వైరుధ్యమేమీ లేదనుకుంటాను. ప్రస్తుతం చలాన్ని గూర్చి మీ అభిప్రాయమేమిటి ?

జ. గాంధీజీని మిత్ (myth) గా చేసినట్టు— శ్రీశ్రీలో ఆధ్యాత్మిక అభినివేశాలు చూపించి శ్రీశ్రీ బాబా అని కొంతమంది ఒక కల్ట్‌గా తయారుచేసినా చేయొచ్చు. సమర్థుడు (చలం) కాబట్టి He may convert me into Baba. I feel guilty. అట్లాంటి భావాలకు కొన్ని బీజాలున్నాయని మహా ప్రస్థానం గేయాలు చదివి దువ్వూరి రామిరెడ్డి అంతకుముందు నేను రాసి అచ్చువేసిన పద్యాలే తనకు బాగున్నాయని రాసారు. అట్లాగే

చలంగారికి ఆధ్యాత్మిక భావాలు కనిపించాయి. అవి unavoidable గా పడినాయి.

చలంగారు ఆధ్యాత్మిక చింతనలోకి వెళ్ళిపోయారు. స్వంత మోక్షం కోసం. ప్రజలమోక్షం అనలేదు. To that extent he must be congratulated. హిడొనిస్ట్ – మొదట్లో విచ్చలవిడి ఖయాంలైక్ రచనల్లో. not now. ఎవరినీ convert చేయటానికి ప్రయత్నించలేదు. no mischief is done. సామాజిక ప్రగతివేరు. అది సమష్టి. అధ్యాత్మిక చింతన వేరు. ఇది వ్యక్తిగతమైనది. అందుచేత సామాజిక ప్రగతికీ, ఆధ్యాత్మిక చింతనకూ వైరుధ్యం లేదు అన్నది నేను ఒప్పుకోలేను. సమాజమేమో అందరికీ. ఆధ్యాత్మికం–ఒక్కరికీ. ఇది వైరుధ్యం.

ఆయన (చలం) మంచికిగాని చెడ్డకిగాని ఆధ్యాత్మిక మార్గంలో పడ్డాడు. నన్నే నమ్మండి నేనే దేముణ్ణి అనలేదు. తనలో తను ఉన్నాడు.

(అష్టగ్రహ కూటమి రిఫరెన్స్ వచ్చింది.)

దానికి అయనకి నేను ఉత్తరం కూడా రాసాను. ఉప్పెనవస్తే చెన్న పట్టణంలోని 20 లక్షల ప్రజలతో నేనూ మునిగిపోవడానికి సిద్ధమే అని.

ప్ర. 83 : మిమ్మల్ని ఏ ఒక్క ప్రత్యేక రాజకీయ వర్గానికి చెందిన వానిగా మాత్రమే ముద్రవేయడానికి ప్రయత్నిస్తున్నారు. 'మానవుడే నా సంగీతం' మానవుడే నా సందేశం' అన్న మీరు మానవులందరికీ కావలిసిన వారే కాని ఒక ప్రత్యేక వర్గానికి మాత్రమేకాదు. మీరు కాదన రనుకుంటాను?

జ. ఇది విస్తృతమైన ప్రశ్న.

ఏ ప్రత్యేక వర్గానికీ చెందిన కవికాదు అనటానికి వీల్లేదు. ఇది irrelevent question. మానవుడే నా సందేశం అన్నది ప్రపంచం అంతా సుభిక్షంగా ఉన్నప్పుడే అది సాధ్యమౌతుంది. ఇప్పుడు కవిని వర్గాలు ఆదరించడం తప్పదు. It must taken sides. జాతీయతా భావం ఉంటుంది.

మానవులందరికీ కావలసిన కవిత్వం అన్నది ఏ రెండు వందలేళ్ళకోగాని సాధ్యంకాదు.

## గుత్తికొండ సుబ్బారావు

ప్ర. 84 : అభ్యుదయ కవిత అంతగా ఆదరణ పొందని ఆరోజుల్లో ప్రచురించిన మహాప్రస్థానం విపరీతమైన ఆదరణ పొందగా కవితకు నీరాజనం పడ్తున్న ఈ దశాబ్దంలో ప్రచురించిన ఖడ్గసృష్టి అంతగా ఆదరణ పొందలేదు. దీని అర్థం- ఆనాటి కంటె ఈనాటి మీ కవితారచన పటిష్ఠత తగ్గిందనా ?

జ. కవితకి ఆనాడు ఆదరణలేకపోలేదు. ఈనాడు ఉందనీ అనుకోకూడదు. ఖడ్గసృష్టి Random Collection of Poems. మహాప్రస్థానం అలా కాదు. A particular భావంకోసం ఎడిట్‌చేసినది. Reception లో ఎట్లాగూ భేదం ఉంటుంది. ఆనాటి కంటె ఈనాడు విస్తృతమైన ఆదరణే ఉంది. లేకపోలేదు.

ప్ర. 85 : సాయుధ పోరాటంద్వారానే తప్ప మరోమార్గంద్వారా ఆర్థిక సమానత్వం సమకూరదంటారా ? ఆర్థిక సమానతా వ్యవస్థకు మీరు సూచించే సత్వర పరిష్కార మార్గాలేమిటి ?

జ. మనం ఇంతవరకు రాజకీయ స్వాతంత్ర్యాన్ని మాత్రమే పొందాం. ఆర్థిక స్వాతంత్ర్యం విప్లవంద్వారా తప్పించి రిఫార్మ్‌ద్వారా రాదు. సాయుధ విప్లవం – మనదేశంలోనే కాకుండా ప్రపంచ పరిస్థితులో పరిపక్వం కావాలి. ఆరముగ్గినపండు ఎలా నేలమీద పడుతుందో అలా వస్తుంది విప్లవం. దీనికేం short cuts లేవు.

## వరవరరావు :

ప్ర. 86 : రాయితో కొట్టి రాల్చవచ్చుకదా

## జ్వాలాముఖి :

పండు మగ్గేవరకు ఆగితే మధ్యలో చిలక లెత్తుక పోతున్నాయికదా !

జ. ఆయుధం అలీనంకాదు. కృష్ణుడు చెప్పిందదే.

ప్ర. 87 : అభ్యుదయ కవిత్వం అంటే ఏమిటి? కేవలం ప్రజా సమస్యల మీద కవిత్వం వ్రాయటమా? కవిత్వ పరంగా రచనా రీతిలో అభ్యుదయం కాంక్షించడమా?

జ. ఒక్క మాటలో చెప్పేయటానికి వీల్లేదు. ప్రజలయొక్క అభ్యుదయాన్ని కోరేదే అభ్యుదయ కవిత్వం. ప్రజల సమస్యలకు సంబంధించి ఉండాలి. ప్రజల సమస్యల మీద రాయాలి. కొత్త పంథాలో చెప్పితే ప్రజల మనసులో ఇంకడానికి అవకాశం ఉంది.

ప్ర. 88 : శిష్ట్లా ఉమామహేశ్వరరావుగారు మిమ్మల్ని influence చేసినట్లుగా విన్నాను. ఎంతవరకు? నిజమా? వచన కవితలో మీరు ముందా? ఆయనా?

జ. నామీద గురజాడ ఇన్‌ఫ్లుయన్స్ ఉంది. చింతా దీక్షితులు, బసవరాజు వీళ్ళు నన్ను గురజాడ దగ్గరకు చేర్చారు. ముద్దుకృష్ణ, నేనూ అదే దార్లో వెళ్తుండేవాళ్ళం. శిష్ట్లాని చూసినపుడు— I was really inspired. నాకంటె ముందు శిష్ట్లాయే start చేశాడు. ఇద్దరమూ ఒక్క దారంట వచ్చిన వాళ్ళమే.

నారాయణబాబు చాలా తర్వాత వాడు. ముద్దుకృష్ణ చాలా మంచి వచన గీతాలు రాశాడు.

కొంపెల్ల జనార్దనరావువి పిరమిడ్లు.

## నవీన్

ప్ర. 89 : Fruedian psycho analysis సాహిత్యాన్ని చాలా influence చేసింది. దీన్నికొందరు undesirable influence అంటారు.
మీ అభిప్రాయం ఏమిటి?

జ. It is not undesirable. Stream of consciousness develop కావటానికి ఫ్రాడియన్ థింకర్స్ కారణం.

ప్ర. 90 : క్రిస్టోఫర్ కాడ్‌వెల్ రాసిన Illusion and reality అన్న పుస్తకాన్ని గూర్చి మీ అభిప్రాయం ?

జ. ఒక్కమారే చదివాను. అదిసూత్రప్రాయమైన గ్రంథం. లిటరరీ ఉేస్టు ఉన్న ప్రతివాళ్ళు చదవదగ్గ గ్రంథం.

## పింగళి రంగారావు

ప్ర. 91 : సినిమా ఒక బలమైన సాహిత్య ప్రచార సాధనమనే అందులో ప్రవేశించారా ?

జ. నేనెప్పటికన్నా మంచి సినిమా తీయగలననే తలచాను. ప్రచార సాధనమన్నది కాదనలేము. As a weapon for the good of the people, సినిమాలను కూడా జాతీయం చేసినప్పుడే అది సాధ్యమవుతుంది. మంచి జరుగుతుంది, అయితే అది reactionary ప్రభుత్వం చేస్తేకాదు.

Progressive Government చేస్తేనే అది సాధ్యమవుతుంది.

నేను తీయాలనుకున్నది – రుక్మిణీకల్యాణం. సక్సెస్ కాలేదు. అసలు పునాదే ఎగిరిపోయింది. పురిటిలోనే సంధి కొట్టుకపోయింది,

ప్ర. 92 : సెక్స్ చిత్రాలు ప్రజాదరణ పొందుతున్నాయనే తీస్తున్నారా ? సమాజాన్ని ప్రతిబింబించే చిత్రాలు తీసే సాహసం నిర్మాతలకు లేదా ? కథకులు లేరా ?

జ. డబ్బులొస్తాయంటే వాళ్ళేపనైనా చేయగలరు. సమాజాన్ని ప్రతిబింబించే చిత్రాలు తీయాలంటే సమాజ శ్రేయస్సును కోరే ప్రభుత్వం ఉండాలి. కథకులు లేరనే సమస్య లేదు.

ప్ర. 93 : ఇటీవల ఏర్పడ్డ సినిమా రైటర్స్ వర్క్‌షాప్ వల్ల ప్రయోజనం ఉందంటారా ?

జ. నిజంగా సరైన పద్ధతిలో ఏర్పాటు చేస్తే ఈ writers work shop ప్రొడ్యూసర్లని ఇన్‌ఫ్లుయన్స్ చేయగలుగుతుంది.

Writer's work shop లో forward looking మీద ఆధారపడి ఉంటుంది.

ప్ర. 94 : సినిమా వాళ్ళకు వాస్తవిక దృష్టి లేకపోవడం వల్ల కొ. కు. లాంటి వాళ్ళకు ప్రవేశం లేకపోయిందనటంతో మీరు ఏకీభవిస్తారా ?

జ. సినిమా రంగంలో లాభదృష్టి– కమర్షియల్ దృష్టి బాగా ఉంది. కుటుంబరావు కొన్ని సినిమాలకి రాసారు.

ప్ర. 95 : సాహిత్యంలో రతికేళి వర్ణించినపుడు కనీసం సినిమాల్లో తెరపై ముద్దు ఉంటేనేం, తప్పా ?

జ. ప్రజల పరిణతి మీద ఉంటుంది. సమర్థిస్తాను. అవసరమయితే నగ్న దృశ్యాలని కూడా సమర్థిస్తాను.

# Housing Plots for Telangana N. G. Os Colony

## WARANGAL

## AN APPEAL

*Dear friends*

We wish to inform you that the Collector, Warangal has pleased to allot an area of 36 acres at Waddepalli and 16 acres in Laxmipura village, near Narsampet road for the construction of N.G Os Colony in City Warangal. The alienation of above area in favour of Telangana Non-Gazetted Officers Union is in progress. The extent of land to be alloted shall not exceed to 300 Sq Yards to each member and allotment will be subject to the following conditions

1) An employee eligible for house building loan under State Government Rules.

2) One should not own a house at present.

3) Plot should not be aliented, transferred or otherwise disposed off under any circumstances.

4) In all the matters of allotment the decision of the Union will be final.

5) The allotment will be made according to the seniority of payment of amount in the Bank.

6) The right of cancellation of allotment for the reasons of misstatement of etc., is reserved with the Union.

The Telangana Non-Gazetted Officers who desire to have the allotment of site for construction of houses in Waddepalli and Laxmipura are requested to remit the following amounts in Co-operative Central Bank, Warangal. ( Telangana Non-Gazetted Officers Union a/c No. **325**) and produce the receipt of the Bank in the Union office along with the application form for allotment of site.

| | | |
|---|---|---|
| 1) Rs. | 170/- | towards cost of the land including charges on account of surveying, plotting etc., |
| 2) Rs. | 12/- | towards Two Years Annual Subscription for the Union. |
| 3) Rs. | 15/- | Donation to the Union. |
| 4) Rs. | 3/- | Membership for the Society. |
| Total | 200/- | (Rupees Two hundred only). |

The application forms may please be obtained from Union office daily from 6-00 p. m. to 9-00 p. m. on payment of Re. 1/- (Rupee one only). The payment of Rs. 200/- shall not make the union necessarily liable for allotment of plots and the amount so deposited towards cost of land (i. e., Rs. 170/- only) shall be refundable if the allotment is not made for any reasons.

We appeal to all the Non-Gazetted officers to come forward and have the opportunity to get the plot at the earliest.

Yours faithfully,

**K. VEERASWAMY.**
President,
T. N. G. Os Union, Warangal Dist.

**N. JAGAN MOHAN RAO,**
President,
T. N. G. Os Union, Warangal Tq.

మహాకవి శ్రీశ్రీ

షష్ఠిపూర్తి సందర్భంలో మా హృదయపూర్వక

శుభాకాంక్షలు

# రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్

హైదరాబాదు - 38

ఈ సందర్భంలో

పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు

అరవై యేండ్ల తండ్రిగా ఇరవై యేండ్ల కొడుకుగా

అద్వితీయంగా నటించిన మా

## ధర్మదాత

రాబోతున్నదని సవినయంగా మనవిచేస్తున్నాం

ఇట్లు

తమ్మారెడ్డి కృష్ణమూర్తి

రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్

# సృజన 'సాహితీ మిత్రులు'గా చేరండి

- ప్రతి నెలా పదిరూపాయల చొప్పున యిచ్చేవారు ప్రస్తుతం సృజనను నిర్వహిస్తున్న 'సాహితీ మిత్రులు'.
- నెలనెలా పదిరూపాయల చొప్పునగాని, వీలును బట్టిగాని వందరూపాయలు, అంతకన్న ఎక్కువగాని యిచ్చేవారు సృజన శాశ్వత సభ్యులు.
- కనీసం పదిమంది చందాదార్లను కొత్తగా చేర్పించే వారికి ఒక సంవత్సరం సృజన ఉచితంగా లభిస్తుంది.
- పది రూపాయలకు తక్కువగాకుండా విరాళాలు ఎంత మొత్తంలోయిచ్చినా సంతోషంగా స్వీకరించబడుతాయి
- సృజన ప్రచురణలు చందాదార్లకు తగ్గింపురేట్లలో లభిస్తాయి.
- ప్రత్యేక సంచికలు కూడా చందాదార్లకు మామూలు చందాలోనే కలిసివస్తాయి.
- ఇకనుంచి ప్రత్యేక సంచికలుకాక మామూలుసంచికల విడి ప్రతివెల రూపాయిపావలా. సంవత్సరచందా ఐదు రూపాయలు.
- ఈ రోజే సృజన పోషకుల్లో చేరండి.